# ఎందరో మహానుభావులు - అందరూ 'హాసం' అభిమానులే!

'హాసం' వచ్చిందంటే చివరిపేజీ చూసేదాకా కింద పెట్టను - బాపు

మాస పత్రికలకు బందీలై మూలుగుతున్న వారంతా హాయిగా నవ్వి, నవ్విస్తున్నారు. సంగీతపరంగా కూడా ఇంతవరకూ ఇంత చక్కగా కొత్తగా-అలాగా! అనిపించేలా ఎక్కడా రాలేదు - ముళ్ళపూడి వెంకటరమణ

ఈనాటి పాఠకుల నాడి తెలిసిన పత్రిక - కాళీపట్నం రామారావు

సంస్కారులైన పాఠకులకు ఓ అపురూప వరం 'హాసం'. చేతిలో ఉంటే గర్వకారణంగా ఉంటోంది. - ఎస్.పి.బాలసుబ్రహ్మణ్యం

ఈ 'హాసం' - ఆహ్వానించదగ్గ మధుమాసం! - సిరివెన్నెల సీతారామశాస్త్రి

ఒక సమగ్ర రసాత్మక కావ్యం చదువుతున్నామని అనిపించే తీరున, తీరుగా రూపుదిద్దుకుంటోంది - పి.బి.శ్రీనివాస్

కేవలం 'అట్ట'హాసం మాత్రమే కాకుండా ఆపాదమస్తకం 'ఆహా'సం!!! - బ్రహ్మానందం

'హాసం' హాస్య సంగీత ప్రియులందరినీ అందమైన లోకాలలో విహరింపచేస్తోంది. - యస్వీ కృష్ణారెడ్డి

శ్రమపడి, ప్రత్యేక లక్ష్యంతో నడుపుతున్న పత్రిక - చలసాని ప్రసాదరావు

'హాసం'— is the first magazine which I want to be in my house – తేజ

'హాసం'ను అందరూ మెచ్చుకుంటున్నారు. ఆనందంగా ఉంది - రావి కొండలరావు

టెన్షన్స్‌లోంచి కొంతసేపైనా బయటపడి హాయిగా రిలాక్సయేందుకు మనసుకు ఒక మంచి టానిక్ 'హాసం' - డా॥ ఇండ్ల రామసుబ్బారెడ్డి

ప్రతి శీర్షిక, ప్రతిపేజీ లక్షల విలువ - పూరీ జగన్నాథ్

కాపీ దొరక్కపోతే దొంగిలించాలనేంత కోరిక పుట్టించిన పత్రిక 'హాసం' - త్రివిక్రమ్ శ్రీనివాస్

యువర్ 'హాసం' ఈజ్ రియల్లీ, ట్రూత్‌ఫుల్లీ గుడ్ - సత్యానంద్

మీ హాస సముద్రంలో నేనూ ఓ చిరుబిందువు నవ్వాలనే ఆకాంక్ష - భువనచంద్ర

## కొనడం మీ వంతు!

## ఆకట్టుకోనడం మా వంతు!

పాఠకులకు 'హాసం' ఉగాది శుభాకాంక్షలు

## SUBSCRIPTION/RENEWAL COUPON

Name :............................................................ Age: ..................... Profession......................

Address:..........................................................................................................

..........................Ph. No. ............... (O) ...................... (R) email:..........................................

I am enclosing DD/Cheque/M.O. Receipt No........................ Dated ......................... for Rs. 200/- (225/- in case of outstation cheques)favouring HUMMUS INFOWAY (P) Ltd., **payable at HYDERABAD** for Subscription/Renewal (incl. Postal Charges) of 24 issues of 'HAASAM HAASYA SANGEETHA PATHRIKA' starting from Issue No......(................ month, 2003)

Date: Signature

Mail to: HUMMUS INFOWAY (P) LTD., 502, SRI BALAJI NILAYAM, 13-1-212, BSP COLONY, MOTINAGAR, HYDERABAD - 500 018. Ph: 2383 1388 / 5557 0215, email: haasammag@hotmail.com

Note: If chq/DD is not drawn on Hyderabad Add Rs. 25/- towards collection charges

హాసం
హాస్య-సంగీత పత్రిక

Also available on net - www.haasam.com

# ఇవీ సంగతులు 37

# హాస్యం - సంగీతం







**ముఖచిత్రం**

**నిర్మాణంలో ఉన్న ఎ.ఎం.రత్నం చిత్రం**
**'ప్రేమంటే సులువు కాదురా' లో ఉదయ్‌కిరణ్**

'సెంటర్ స్ప్రెడ్'లో
'రాఘవేంద్ర', 'జీన్స్'
సినిమా పాటల పుస్తకాలు
కలర్‌లో

సంపుటి : 2 సంచిక:13

1-15 ఏప్రిల్ 2003

పేజీలు: 68 + 8

వెల : రూ. 10-00

సంవత్సర చందా : రూ. 200

మేనేజింగ్ ఎడిటర్
ఎమ్బీయస్ ప్రసాద్

ఎడిటర్
రాజా

రిఫరెన్స్ కర్టెసీ
డా॥ కె.వి.రావు
జె.మధుసూదన శర్మ

HAASAM HAASYA SANGEETHA PATHRIKA
Flat No. 502, Sri Balaji Nilayam
13-1-212, Motinagar,
Hyderabad-500 018
Ph: 2383 1388 / 5557 0215
*email:* haasammag@hotmail.com

Printed and Published by:
**K.I.Varaprasad Reddy**
on behalf of Hummus Infoway (P) Ltd.,
502, Sri Balaji Nilayam,
13-1-212, B.S.P. Colony, Motinagar,
HYDERABAD-500 018
Fax: 040-3541713

**Printed at:** Kalajyothi Process Ltd.,
1-1-60/5, RTC X Roads,
Musheerabad, Hyderabad-20,

**Published at:** 502, Sri Balaji Nilayam,
13-1-212, B.S.P. Colony, Motinagar,
HYDERABAD-500 018

**Editor: RAJA**

Marketed by:
Margadarsi Marketing Pvt Ltd.,
6-3-570, Eeenadu Compound
Somajiguda, Hyderabad-82

The one and only Magazine devoted to Humour & Music



# హాసం

## హాస్య-సంగీత పత్రిక

37

కొత్త సంవత్సరం కొత్త ఆశలు తెస్తుంది. వ్యక్తికైనా సరే, సంస్థకైనా సరే.

స్వభాను సంవత్సరం 'హాసం'కు ఆశావహంగానే ప్రారంభమవుతోంది.

నూతన సంవత్సరం ముంగిట్లో ఉండగానే 'హాసం'కు అంతర్జాతీయ స్థాయిలో బహుమతి లభించింది. యూరప్‌లోని దేశాలలో నివసిస్తున్న తెలుగు వారందరూ కలిసి స్థాపించుకున్న యూరోపియన్ తెలుగు అసోసియేషన్ (ETA) ,శ్రీ ఆర్.వి రమణమూర్తి(అభినందన, నీరాజనం చిత్రాల నిర్మాత) ఆధ్వర్యంలో హైదరాబాద్‌లో నిర్వహించబడుతున్న కళారాధన సాంస్కృతిక సంస్థ సహకారంతో 'ఈటా మ్యూజిక్ అవార్డులు- 2002' ప్రకటించింది. గీతకారులకు, సంగీతకారులకు, గాయకులకు అవార్డులు ఇవ్వడంతో బాటు ఈ సారి ఇంతకుముందెన్నడూ లేనివిధంగా 'మంచి పాటకోసం విశేషంగా కృషిచేస్తూ అందరి ప్రశంసలు అందుకుంటున్న పత్రికగా 'హాసం'కు అవార్డు ప్రకటించడం జరిగింది- పత్రికారంగంలోనే ఇది అరుదైన సందర్భం!

రెండవ విశేషం కూడా అంతర్జాతీయ రంగానికి సంబంధించినదే! ఇంటర్నెట్‌లో 'హాసం' గురించి ఇదివరకే ప్రస్తావించడం జరిగింది. తొలిసంచికలు కొన్ని 'హాసం' వెబ్‌సైట్‌లో లభ్యమవుతున్నాయి. 'హాసం' ఖ్యాతి విదేశాలకు కూడా ప్రాకుతున్న దృష్ట్యాక్రమం తప్పకుండా 'హాసం' చదవాలన్న ఉత్సుకత అక్కడివారిలో కూడా పెరిగింది. ప్రింట్ వెర్షన్‌కై ఇక్కడి సామాన్యులు కూడా పది రూపాయలు వెచ్చించడానికి సిద్ధపడుతూండగా అభిరుచిగల ప్రవాస భారతీయులు ఆన్‌లైన్ వెర్షన్‌కై ఖర్చుకు వెనుకాడుతారని మేం భావించటం లేదు.

అందుకని ఇప్పటినుండీ మార్కెట్లో వెలువడే ప్రతి 'హాసం' సంచికా అదే రోజున వెబ్‌సైట్‌లో ప్రత్యక్షమవుతుంది. ఆ ఆన్‌లైన్ వెర్షన్‌కు చందాదారులుగా చేరిన వారికి ఒక పాస్‌వర్డు ఇవ్వడం జరుగుతుంది. ఆ పాస్‌వర్డు ఉపయోగించి వారు పత్రికను చదువుకోవచ్చు. కావలసిన పేజీల ప్రింట్ అవుట్‌ను తీసుకోవచ్చు.

దీనికిగాను వారు కట్టవలసిన వార్షిక చందా 12 అమెరికన్ డాలర్లు మాత్రమే! అది పేపాల్, 2-చెక్ అవుట్ అనే నమ్మకమైన పేమెంటు గేట్‌వేల ద్వారా క్రెడిట్ కార్డు మూలంగా' పే' చేయవచ్చు. క్రెడిట్‌కార్డు ఉపయోగించడానికి సంకోచించేవారు చెక్కుద్వారా సొమ్ము చెల్లించవచ్చు. చెక్కు కలక్షన్‌కు వేరే చార్జీలు చెల్లించనవసరం లేదు.

ఇంట్లో అందరికీ కంప్యూటర్‌పై చదివే అలవాటు లేకపోవచ్చు. వారికోసం పుస్తక రూపంలో కూడా ఉంటే బాగుంటుందనుకోవచ్చు. అటువంటి కుటుంబాలకోసం ఇంకో సౌలభ్యం. ఈ ఆన్‌లైన్ వెర్షన్‌తో బాటు అదనంగా ప్రింట్ వెర్షన్ కూడా ప్రతీ పక్షం ఎయిర్ మెయిల్‌లో అందుకోదలిచేవారు ఈ రెండు వెర్షన్‌లకు కలిపి ఏడాదికి 50 అమెరికను డాలర్లు కడితేచాలు.

ఇంటర్‌నెట్‌లో ఉచితంగా చదవడానికి అలవాటుపడిన జనత ఇలా డబ్బుకట్టడానికి ముందుకు రారని అనేకమంది హెచ్చరిస్తున్నా మేం ముందుకు సాగుతున్నాం. నచ్చినదానికై ఖర్చుచేయడానికి ఇక్కడ మనం వెనుకాడనప్పుడు అక్కడి ప్రవాసాంధ్రులు మాత్రం వేరుగా ఎందుకు ఆలోచిస్తారు? ఆలోచించాలి? 'హాసం' పాఠకులు, అభిమానులు విదేశాలలో ఉన్న తమ బంధుమిత్రులకు **www.haasam.com** వెబ్‌సైట్‌ను సందర్శించి చందాదారులు కమ్మనమని కోరుతారని మా నమ్మకం, కోరిక.

'హాసం'ద్వారా ఉగాది శుభాకాంక్షలు తెలుపడానికి చాలామంది ముందుకువచ్చారు. మంచిని పంచుకోవాలనే సదుద్దేశ్యం ఉన్నందుకు వీరందరికీ ధన్యవాదాలు.



అందరికీ 'స్వభాను'నామ సంవత్సర శుభాకాంక్షలు.

# సుందరం-సుబ్రావ్ మాస్టారు

-జయంతి కిరణ్మయి



ఒకనాడు సూత పౌరాణికుడు నైమిశారణ్యంలో ఓ చెట్టుకింద కూర్చొని తన శిష్యులందరికీ అలవాటుగా కథ చెప్పడం మొదలు పెట్టాడు.

అంతలో ఓ చిన్న శిష్యుడు లేచి 'స్వామీ కలియుగం కథలు తెలుసుకోవాలని ఉంది. ఆ కథలు చెప్పరూ' అన్నాడు.

దానికి సూతుడు చిరునవ్వు నవ్వి 'వత్సా కలియుగంలో రాజులుండరయ్యా- మనం రామాయణం, భారతాలు చెప్పుకుందుకు బహుశా అరణ్యాలూ ఉండవు- మనం ఇలా తీరిగ్గా కూచుని కథలు చెప్పుకోడానికి'.

'మరెలా స్వామీ' అంటూ మధన పడుతున్న శిష్యులని చూస్తూ 'కంగారు పడకండి నాయనా కలియుగం ప్రథమ పాదంలో 'సత్యం బాబాయి' గా జన్మిస్తాను. మీరంతా నా కథలచేత ఆకర్షితులై నా క్లబ్బుకే వస్తూ ఉంటారు. ఆ జన్మలోనూ నాకు భూత, భవిష్యజ్ఞానం ఉండటంతో నేను ఎన్నో సమస్యలను వివరించి చెప్తూఉంటాను'అని తెలిపాడు.

ప్రస్తుతానికొస్తే, కలియుగ ప్రథమపాదే, భరతవర్షే, భరతఖండే, పరశురామ క్షేత్రే, సముద్ర తీరే, నవీముంబయ్యాం నగరే.. ఫలానా వీధిలో, ఫలానా వాకిట్లో 'సత్యం బాబాయి క్లబ్బు' వెలిసింది. టీవీలు, కంప్యూటర్ కన్నా సత్యం బాబాయి కథలే బావుంటాయని ఆయన కథలు విన్న కుర్రకారు అంటూ ఉంటారు.

ఆ రోజు బాబాయి క్లబ్బులో చాలా సందడిగా ఉంది. పక్కనే ఉన్న స్కూలుకి కొత్త లెక్కల మాస్టారు వచ్చారు. అదీ హడావిడి.

'ఆ ప్రభాకరేం లెక్కల మాస్టారు? లెక్కల మాస్టారంటే లావుగా , పొడుగ్గా, కళ్ళల్లోంచి, ముక్కుల్లోంచి నిప్పులు కక్కుతూ చేతిలో పెద్ద బెత్తం పట్టుకుని ఉండాలికదా' అన్నాడు వాసు.

'ప్రభాకరేం లెక్కల్లో ఎమ్.ఎ. చేశాడు. లెక్కల మాస్టారుగా మంచి పేరుంది...'అన్నాడు శేఖర్.

'అవన్నీ నరే, ఆ ప్రభాకర్ నాకు చిన్నప్పట్నించీ తెలుసు. మేమిద్దరం కలిసి చదువుకున్నాం. తెలుగు క్లాసు బోరుకొట్టకుండా బ్యాగులో కప్ప పిల్లలు తెచ్చేవాడు. మా అందరి లాగే అల్లరి చేసేవాడు. వాడు లెక్కల

"మాస్టారేంటి?"

'నువ్వు నాలుగో క్లాసు వరకే మా ఊళ్లో చదువుకున్నావు కదూ' అన్నాడు సత్యం బాబాయి.

'అవును ఆ తర్వాత నాన్నగారికి ట్రాన్స్‌ఫర్ అవ్వడంతో బొంబాయి వచ్చేశాం. అప్పట్నుంచీ ఇక్కడే చదువుకున్నాను" అన్నాడు వాసు.

'అందుకే నీకు లెక్కల మాస్టారు ఫోబియా పోలేదు. మా సుందరానికీ అంతే. చిన్నప్పుడే పల్లెటూరు వదిలేసి వచ్చేసే వాళ్ళకి లెక్కల మాస్టారంటే భయం జీవితాంతం అలాగే ఉండిపోతుంది. ''అంటూ మిన్నమ్మలో యన్.టి.ఆర్ లా సిగరెట్టు వెలిగించి వాలు కుర్చీలో సర్దుక్కూచున్నాడు సత్యం బాబాయి 'సుందరం - సుబ్రావు మాస్టారు" కథ చెప్పడానికి.

మా సుందరం నాలుగో క్లాసుదాకా పల్లెలోనే



చదువుకున్నాడు. పల్లెలో రాలుగాయి పిల్లలతో తిరిగి చెడిపోతాడేమోనని భయం వేసి వాళ్ళ నాన్న సుందరాన్ని సుబ్బారావు మాస్టారి దగ్గర చదువుకి పెట్టేశాడు.

లెక్కల 'సుబ్రావు' మాస్టారంటే ఊళ్లో అల్లరి పిల్లలందరికీ హడలు. ఆయనకి నిలువెల్లా కోపం. ఎప్పుడు ఎవరికి మొట్టికాయ వేస్తారో, ఎవరి చెంపలు వాయిస్తారో తెలిసేది కాదు.

అసలు సుందరానికి పల్లె అనగానే ఓ రోజు పరీక్షకి చదువుకోకుండా చెరువులో సుబ్రావ్ ఈతకొడుతూ మాస్టారికి దొరికిపోయిన సంఘటన గుర్తు వస్తుంది. ఆరోజు ఒంటి మీద పడ్డ దెబ్బలు మాసిపోయినా, మనసులో లెక్కల మాస్టారంటే భయం మాత్రం అలాగే ఉండిపోయింది. ఆ తర్వాత వాళ్ళు పట్నం




వచ్చేశారు.

సుందరం బాగా చదువుకుని మంచి ఉద్యోగంలో చేరి, మంచివాడు, మర్యాదస్తుడు, నెమ్మదస్తుడు అనే పేర్లు సంపాయించుకున్నాడు.

అతనిలో ఈ గుణాలు చూసే సునీత అతన్ని ప్రేమించింది. సునీత రిటైర్డ్ మేజర్ సార్వభౌమరావుగారి అమ్మాయి. చిన్నతనం నుంచీ మేజర్లూ, వాళ్ళ ఆత్మ విశ్వాసం, దూసుకుపోయే మనస్తత్వం చూసీ చూసీ విసిగిపోయిన సునీత మనసులో తనకు తెలియకుండానే తనకు కాబోయే భర్త గురించి ఓ చిత్రం రూపుదిద్దుకోసాగింది.

భయస్తుడూ, నెమ్మదస్తుడూ, సిగ్గుపడుతూ తక్కువ మాట్లాడే సుందరం సహజంగానే సునీతని ఆకర్షించాడు. అందంగా, చురుగ్గా, చలాకీగా ఉండే సునీత అంటే సుందరానికి ఎంతో ఇష్టం.

ఇద్దరూ కలిసి సినిమాలకీ, షికార్లకీ తిరిగాక, ఒకళ్ళనొకరు వదిలి ఉండలేరని అర్థం చేసేసుకున్నారు. సునీత 'రేపు సంక్రాంతికి మా ఊరు వచ్చేయి సుందరం. మా నాన్నని కలిసినట్టూ ఉంటుంది, పల్లెల్లో కొన్నాళ్ళు గడిపినట్టూ ఉంటుంది' అంది.

సంతోషంగా సంక్రాంతికి పల్లెకి బయల్దేరాడు సుందరం. పల్లెకి చేరిన గంటకే అర్థం అయిపోయింది సుందరానికి తను చేసింది పొరపాటని! సార్వభౌమరావుగారి ఆతిథ్యంలో లోపమేమీ లేదు. ఆ పాతకాలం నాటి భవంతిలో అటాచ్డ్ బాత్రూమ్, బాల్కనీ అన్నీ ఉన్న ఒకే ఒక మంచి గది అతనికి ఇచ్చారు. అతని కిష్టమని స్పెషల్‌గా అరటిపువ్వు పెరుగు పచ్చడి, గుత్తొంకాయ కూర, గుమ్మడికాయ పులుసు, పరవాన్నం అన్నీ చేయించారు.

ప్రేమగా పక్కనే కూచుని ప్రత్యేకంగా అన్నీ కనుక్కొని మరీ వడ్డించారు. వచ్చిన చిక్కల్లా ఆయన మాటలే! ఆయన మిలటరీ నించి రిటైరయ్యాక ఈ పల్లెకి వచ్చి వ్యవసాయం చేసి గొప్పపేరు తెచ్చుకోవడమే ఆయన జీవితాశయం. ఆయన భోజనం చేస్తున్నంత సేపూ అరటిచెట్లు అంత బలంగా ఎలా పెరిగాయో, వంకాయలు అంత నిగనిగలాడుతూ రావడానికి ఏ ఎరువులు వాడాలో చెప్తూనే ఉన్నారు.

చిన్నప్పుడే పల్లె వదిలేయడం, తర్వాత పట్నంలోనే ఉండిపోవడం వల్ల సుందరానికి వ్యవసాయం గురించి - ఆధునికమే కాదు, పురాతనం అయినా సరే- అ,ఆలు కూడా తెలీవు.



ఏడవలేక నవ్వుతూ ఆ ఒక్కరోజు గడిపేసి రాత్రికి రాత్రే పట్నానికి బండెక్కేశాడు.

అతన్ని పంపించడానికి బస్టాండు కొచ్చిన సునీత 'మనం పొరపాటు చేశామనిపిస్తోంది సుందరం. ఇందాక నాన్న ఏమన్నారో తెలుసా? కుర్రాడు బానే ఉన్నాడు గానీ అమ్మాయ్ మరీ నోట్లో నాలిక లేదు. ఎలా బతుకుతాడో ఏమిటో అంటూ తేల్చేశాడు'.

ఆ మాటతో ఉక్రోషం వచ్చేసింది సుందరానికి. 'ఏం చెయ్యమంటావు చెప్పు? ఆయన ఇండియా క్రికెట్ గురించో, తెలుగు సినిమా గురించో, ఇంగ్లీషు నవల గురించో కనీసం రాజకీయాల గురించి మాట్లాడినా ఏదో ఒకటి మాట్లాడే వాడిని. మరీ అరటి చెట్టుకి ఏ ఎరువులు వెయ్యాలి, వరి దిగుబడి ఎక్కువగా రావాలంటే యూరియా ఏ నిష్పత్తిలో వాడాలి డుమెక్రాన్ నువక్రాన్ అంటూ నానా ఎరువులు ఏకరువు పెడుతూ ఎడాపెడా వాయిస్తుంటే ఏం చెయ్యమంటావు చెప్పు?'

"అదేనోయ్ బాబూ నేను చెప్పేది కంగారు పడకుండా విను. మనం పెళ్లి చేసుకోవాలంటే నాన్న ఒప్పుకోవాలి. ఆయన్ని మంచి చేసుకోవాలంటే ఆయన అభిమాన విషయం అయిన ఆధునిక వ్యవసాయం గురించి నువ్వు మాట్లాడాలి. అందుకు ఒకటే మార్గం మొన్న పేపర్లో చూశాను. ఈ మధ్య 'విజ్ఞాన ఖని' ఓ ఎడ్యుకేషన్ ఇనిస్టిట్యూట్ వాళ్ళు కొత్తగా కరస్పాండెన్సు కోర్సు పెట్టారు. ముప్ఫయి రోజుల్లో హిందీ లాగ మూడునెలల్లో ఏ విషయం అయినా నేర్పిస్తారట. నువ్వు అక్కడ చేరి, మూడు నెలల్లో 'ఆధునిక వ్యవసాయం' గురించి పూర్తిగా తెలుసుకుని, అప్పుడు నాన్నతో మన పెళ్లి గురించి మాట్లాడుదువు గాని' అంది సునీత.




సుందరానికీ సునీత సలహా నచ్చింది. హైదరాబాద్ తిరిగివచ్చిన కొన్నాళ్లకే 'విజ్ఞాన ఖని' లో చేరిపోయాడు. వారం తిరక్కుండానే మొదటి పాఠం వచ్చేసింది. ఆ రోజు నుంచీ దీక్షగా, శ్రద్ధగా ఆ పాఠాలు చదవడం మొదలు పెట్టేశాడు.

మూడు వారాలైనా వాళ్ళు పంపిన నోట్సు విషయం అతనికి అర్థం కాలేదు. 'ఆధునిక వ్యవసాయం' కోర్సులో 'ఆధునిక వ్యవసాయం గురించి కొంచెం అన్నా చెప్తారని అతని ఉద్దేశ్యం. కానీ ఆ పాఠాల్లో మాత్రం రోజూ పొద్దున్నే లేవడం మంచి యోగాసనాలు వెయ్యడం, గట్టిగా గాలిపీల్చి, ఓ నిమిషం బిగపట్టి మళ్ళీ వదలడం, సాత్వికాహారం,దైవధ్యానం ఇలాంటి వన్నీ ఉన్నాయి కానీ, వ్యవసాయాన్ని వాళ్ళు వేలేసి కూడా ముట్టుకోడంలేదు. ఎర్రమట్టిలో ఎండు మిరపకాయలు ఎలా పండించాలో, నల్ల మట్టిలో నక్కదోసకాయలు ఎలా పండించాలో చెప్తారను కున్నాడు. అలాంటివేం లేకుండా రోజూ పొద్దున అరగంట జాగింగ్ చెయ్యడం, పావుగంట పద్మాసనంలో కూచోడం లాంటివే చెప్తున్నారు.

అసలు ఒళ్ళుమండి ఈ కోర్సు మానేద్దామా అనుకున్నాడు కూడాను. కానీ పొద్దున్నే లేవగానే సునీత మొహం కన్పించి 'జయం' సినిమాలో సదాలా 'వెళ్ళవయ్యా వెళ్ళు... వెళ్ళూ అని అంటున్నట్టు అన్పించి జాగింగ్‌కి పరిగెట్టు కెళ్ళిపోతున్నాడు.

ఆరువారాలయ్యేసరికి సునీత మొహం కూడా అతన్ని పొద్దున్నే లేపి, జాగింగ్‌కి పంపలేక పోయింది. ఆ ముందు రోజే అతనికి ఆరో పాఠం అందింది. అందులో కూడా 'ఆధునిక వ్యవసాయం' పద్ధతుల గురించి ఏమీ. లేదు. పొద్దున్నే చల్లటి నీళ్లతో స్నానం చెయ్యమని ఉందిగానీ, పొలానికి నీళ్లు ఎప్పుడు పెట్టాలో మాత్రం లేదు. ఆ రోజు ఏమైనా సరే 'విజ్ఞాన ఖని' ఆఫీసుకి వెళ్ళి అసలు సంగతి తేల్చుకోవాలను కున్నాడు. సెలవు పెట్టి మరీ వాళ్ళ ఆఫీసుకి దూకుడుగా వెళ్ళాడు.

వినురుగా తలుపు తెరుచుకుని 'కె.శ్రీనివాసరావు-మానేజర్' అని ఉన్న బల్ల దగ్గరికి వెళ్ళి, తనతో తెచ్చిన నోట్సు ఆ బల్లమీద గిరవాటేశాడు.

'నేను ఆధునిక వ్యవసాయం' గురించి నేర్చుకోవాలని మీ కోర్సులో చేరాను. ఇప్పటి వరకూ నాకు ఆరు నోట్సు పంపించారు. వీటిలో ఎక్కడైనా, ఒక్క ముక్క అయినా ఆధునిక వ్యవసాయం గురించి ఉంటే నేను ఇప్పుడే ఈ నోట్సు అంతా నమిలి మింగుతాను' అన్నాడు.

శ్రీనివాసరావుగారు కొంచెం పెద్దాయన. ముందు ఆ నోట్సు తీసుకుని పైనుంచీ కిందకి చూసి అక్కడికక్కడే కొంచెం చదివాక, కళ్ళజోడులోంచి సుందరాన్ని చూసి చిరునవ్వు నవ్వారు.

"ముందు మీరు కూర్చోండి. మీ పేరేమిటన్నారు? సుందరం కదూ, చూడండి చిన్న పొరపాటు జరిగిపోయింది. మీకు 'ఆధునిక వ్యవసాయం' బదులు 'ఆత్మవిశ్వాసం పెంచుకోవడం' మీద కోర్సు అందింది. ఆరు వారాల్లోనే దాని ప్రభావం కూడా కనిపిస్తోందని మాత్రం మీరు ఒప్పుకోవాలి" అన్నారు.

ఈ మాటలు వినేసరికి సుందరం కోపం కొంత తగ్గింది. అతను సాలోచనగా కుర్చీలో కూర్చుండిపోయాడు. ఇన్నాళ్ళుగా తనకి అర్థంకాని చిన్నచిన్నవిషయాలు హఠాత్తుగా అర్థం అవసాగాయి.



ఆటోవాళ్ళు అడగ్గానే ఎక్కడికైనా వస్తున్నారు, బస్సులో కండక్టర్లు టికెట్టు, చిల్లరకూడా ఇస్తున్నారు. కాంటీన్లో తను అడగ్గానే కాఫీ వచ్చేస్తోంది. పక్కింటివాళ్ళ పిల్లలు టీవీ చూస్తామంటూ వేళకాని వేళ రావడం లేదు.

అంతా అర్థం అవగానే మాట్లాడకుండా బయటికి వచ్చేశాడు. ఇప్పుడు మళ్ళీ ఆధునిక వ్యవసాయం గురించి నేర్చుకోడానికి మూడు నెలలు ఆగాలా? లేక కొత్తగా నేర్చుకున్న ఆత్మవిశ్వాసంతోనే సార్వభౌమారావు గారిని కలవాలా అని ఆలోచిన్నా రోడ్డుమీద నడుస్తున్నాడు. అసలు సునీతని పెళ్ళి చేసుకుని పట్నంలో కాపురం చెయ్యడానికి ఈ వ్యవసాయాలు అవీ తెలియాల్సిన అవసరం ఏమిటి అనిపించింది. ఈ విషయం ఓసారి సునీతతో మాట్లాడితే బావుండు అనుకుంటూ ఉండగానే ఎదురుగా సునీత కన్పించింది. సుందరం పిలిచే లోపే ఇంకో అబ్బాయితో స్కూటర్ మీద వెళ్ళిపోయింది. పట్నం వస్తే సునీత వాళ్ళ పిన్నిగారింట్లోనే ఉంటుందని తెలుసు కాబట్టి వాళ్ళ ఇంటికి వెళ్ళి కూర్చున్నాడు. సాయంత్రం ఆరింటికి తీరిగ్గా వచ్చింది సునీత.

వస్తూనే 'అరె నువ్వెప్పుడొచ్చావు? పొద్దున రాగానే నీ కోసం ఆఫీసుకి ఫోన్ చేశాను. ఇవాళ శలవు పెట్టావన్నారు. అందుకని రఘుకి ఫోన్ చేశాను. వాడీ మధ్యే ఢిల్లీ నుంచీ ట్రాన్స్‌ఫర్ మీద హైదరాబాదు వచ్చాడు. బర్కత్‌పురాలో వాడి ఆఫీసుకి రమ్మన్నాడు. వాడి ఆఫీసు కనుక్కునే సరికి తలప్రాణం తోకకొచ్చింది. అందుకని వాణ్ణి దబాయించి తాజ్‌లో లంచ్, ఓ సినిమా చూపిస్తేనే కానీ వీల్లేదని లాక్కెళ్ళాను. గడగడ మాట్లాడేస్తున్న సునీత మాటలకి బ్రేక్ వేస్తూ 'నేను మిమ్మల్ని చూశాను' అన్నాడు సుందరం.

'ఎక్కడ? అయ్యో! ఒకసారి పిలిచి ఉండాల్సింది కదా, నిన్ను పరిచయం చేసేదాన్ని!'

ఇంతకీ ఈ రఘు ఎవరు? ఢిల్లీ అంటున్నావు. మీ ఢిల్లీ అత్తయ్య కొడుకా?' కొంచం గంభీరంగా అడిగాడు సుందరం.

'అవును మేం ఢిల్లీలో ఉండేప్పుడు వాడు, నేను ఒకే స్కూల్లో చదువుకున్నాం. వాడు నాకన్నా రెండు మూడేళ్ళు పెద్ద. కలిసి ఆడుకునే వాళ్ళం. తరువాత మేం హైదరాబాదొచ్చేశాం. మళ్ళీ వాణ్ణి ఇప్పుడే చూడ్డం. అది సరే కానీ, నీ ఆధునిక వ్యవసాయం నేర్చుకోడం ఎంత వరకూ వచ్చింది?'

'పూర్తి అయింది. ఉగాది శలవులకు నేను మీ ఊరొస్తున్నాను మీ నాన్నగారితో మాట్లాడటానికి.' కొంచం గంభీరం పాలు ఎక్కువచేసి అన్నాడు.

ఈ పాలు నీళ్ళు గమనించని సునీత మాత్రం "నువ్వు రఘుని దూరం నుంచీ చూశావు కదా, బావున్నాడు కదూ! ఎంత బాగా మాట్లాడతాడనుకున్నావు? ఎన్ని జోక్స్, హోటల్లో




ఉన్నంతసేపూ నవ్విస్తూనే ఉన్నాడు. సినిమా హాల్లో ఎన్ని జోక్స్ వేశాడో! చిన్నప్పుడు ముంగిలా ఉండేవాడు. అది సరేగానీ, నువ్వు శనివారం పొద్దున రాకు. సాయంత్రం బస్సుకిరా. పొద్దున మేమంతా మా పక్కఊళ్ళో ఉన్న సుబ్బులు మావయ్య ఇంటికి భోజనానికి వెళ్తున్నాము. మా మావయ్య అసలే ముక్కోపి. టైముకి వెళ్ళకపోతే చంపేస్తాడు. నీ బస్సు లేటైతే అనవసరంగా గొడవ." అని చెప్పుకొంటూ పోతోంది.

"సరే నేను వెళ్ళొస్తాను. చాలా పనుంది" అంటూ బయల్దేరిపోయాడు సుందరం.

ఆ శనివారం బస్సు దిగేసరికి ఆరోపాఠం పూర్తిగా చదివేయడంతో పూర్తి ఆత్మవిశ్వాసంతో అలరారుతున్నాడు అతను. బస్టాపులోనే రఘుని చూసి ఆశ్చర్యపోయాడు.

"హలో! నా పేరు రఘు. సునీత మా గురించి అంతా చెప్పింది. నన్ను మిమ్మల్ని రిసీవ్ చేసుకోమని పంపింది. వాళ్ళంతా ఇప్పుడే ఇంటికి వచ్చారు. రండి నా బైక్ మీద వెళ్దాం" అన్నాడు స్నేహపూర్వకంగా. పొడుగ్గా హీరోలా ఉన్న రఘుని చూస్తున్న కొద్దీ సుందరానికి కోపం ఎక్కువైపోతోంది. ఎలాగో ఇద్దరూ ఇంటికి చేరారు. సునీతని చూడగానే భగ్గుమన్నాడు సుందరం.

'నిన్నసలు ఆ రఘుతో మాట్లాడనే వద్దని చెప్పాలనుకుంటూంటే అతన్ని నా కోసం పంపిస్తావా?' అంటూ విసుక్కున్నాడు... సరేకానీ, నాకు కిందటిసారి ఇచ్చిన గదే కదా, స్నానం చేసి వస్తానుండు' అన్నాడు. లోపలికి వెళ్ళబోతూ 'ఈసారి ఆ గది కాదు. వేరే గది ఇచ్చాం. ఆ గదిలో....' ఇంకేదో చెప్పబోతున్న సునీతని కట్ చేస్తూ...

"ఓ! నా కర్థమైందిలే..." అంటూ విసురుగా లోపలికి వెళ్ళాడు. సునీత అతను వెళ్ళిన వైపే సాలోచనగా చూస్తుండిపోయింది.

సుందరం ఉక్రోషంగా తన గదికి చేరుకున్నాడు. క్రితం గది కంటే ఇది చిన్నది. బాల్కనీ లేదు. పైగా మంచం కూడా పెద్దది కాదు. ఈ గదిలో ఇబ్బంది లేకపోయినా, రఘుకి ఆ గది ఇచ్చినందుకు సుందరానికి చాలా కోపంగా అనిపించింది. స్నానం చేసి, భోజనానికి కిందికి వెళ్ళాడు.

భోజనాల దగ్గర అంతా హడావిడిగా ఉంది. చాలా రోజుల తర్వాత కలిశాడేమో రఘు సుందరమ్మత్త గురించీ, సుబ్బారావు బాబాయి గురించీ, వెంకట్రావు మావయ్య గురించీ, వాళ్ళబ్బాయి రవి గురించీ, వీళ్ళమ్మాయి స్వాతి గురించీ వివరాలు అడుగుతూనే ఉన్నాడు. సునీత కొంచెం పరధ్యానంగా జవాబులు చెప్తోంది. సునీత వాళ్ళమ్మ 'అన్నయ్యగారు వాళ్ళు ఇంకా






రాలేదు. కారు ట్రబులిచ్చిందో ఏమిటో! ఆయనకసలే కోపం... దారంతా ఏం రాద్ధాంతం చేస్తున్నారో ఏమిటో' అంటూ తెగ కంగారు పడిపోతోంది.

తనకి తెలీని మనుష్యుల గురించి వినే మూడ్‌లో లేడు సుందరం. అతనికి రఘుని చూసిన కొద్దీ, కోపంతో ఒళ్ళు మండిపోతోంది. పైగా పక్కన సార్వభౌమరావుగారు గుమ్మడిపాదు చక్కగా ఎదిగి, మంచి గుమ్మడికాయలు రావాలంటే ఏం చెయ్యాలో విపులంగా వివరిస్తున్నారు. ఆయన ఎండిపోయిన ఆకులు, కుళ్ళిన కూరగాయల దాకా వచ్చేసరికి ఇంక సుందరం ఆగలేకపోయాడు. ఆయన్ని తీవ్రంగా చూస్తూ, 'మళ్ళీ ఎప్పుడూ భోజనాల దగ్గర కుళ్ళిపోయిన కూరలు, ఎండిపోయిన తొక్కల గురించి మాట్లాడకండి' అన్నాడు-కొంచెం తగ్గు స్వరంతోనే అయినా కాస్త తీవ్రంగా.

తిరిగి ఏదో అనబోయిన ఆయన సుందరం కళ్ళలోకి చూసి తగ్గిపోయారు. 'అబ్బే, అదేం లేదు. నాకు మరేమో... వ్యవసాయం అంటే ఇష్టం. అందుకని మాట్లాడుతున్నాను. ఇవాళ స్వీటేమిటి? హల్వా చేశారా' అంటూ టాపిక్ మార్చేశారాయన.

'మీతో ఇంకో ముఖ్యమైన విషయం మాట్లాడాలి. అసలుఅందుకే ఈ ఊరు వచ్చాను. భోజనాలు కాగానే మాట్లాడదాం' అదే స్వరంతో అన్నాడు సుందరం.

అరగంట తర్వాత తోటలోంచి వస్తున్న సుందరం మొహంలో ఇందాకటి కోపం గానీ, విసుగుగానీ మచ్చుకైనా లేవు. హాల్లో అందరూ మాట్లాడుకుంటున్నారు. సునీత మాత్రం మౌనంగా కొంచెం దూరంగా కూచుని ఆలోచిస్తోంది. సుందరం చనువుగా సునీత పక్కన కూచున్నాడు.

'మీ నాన్న మన పెళ్ళికి ఒప్పేసుకున్నారు సునీతా. అసలు అంతా ఊరికే అంటారు కానీ, ఆయనెంత నెమ్మదస్తుడో తెలుసా? ఇందాక భోజనాల దగ్గరే తగ్గిపోయారా? ఇప్పుడు తోటలో నేనీమాట చెప్పగానే వెంటనే ముహూర్తం ఎప్పుడు పెట్టించమంటావని అడిగేశారు."

'ఏ విషయం నువ్వు మాట్లాడేది? ముహూర్తం దేనికి?' అంది సీరియస్‌గా చూస్తూ.

'ఇంక దేనికి? మన పెళ్ళికి. మనం పెళ్ళి చేసుకోవాలని అనుకుంటున్నామని మా నాన్న గారికి చెప్పేశాను' అన్నాడు.

'ఎందుకలా అబద్ధం చెప్పావు?

'అబద్ధమా? మనం పెళ్ళి....

'నేను నిన్ను పెళ్ళి చేసుకుంటానని ఎవరు చెప్పారు? నేను నిన్ను పెళ్ళి చేసుకోబోవడం లేదు'.

'ఓ! ఇప్పుడర్థమైంది. ఇప్పుడు బస్సులు లేవుగా. నేను రేపొద్దున్నే ఫస్ట్ బస్సుకి వెళ్ళిపోతాను. మళ్ళీ నువ్వు లేస్తావో లేదోనని ఇప్పుడే చెప్పేస్తున్నాను. అన్నాడు సుందరం విసుగ్గా.

'మంచిది'అంది సునీత తాపీగా.

సుందరం విసురుగా తన రూమ్‌కి వెళ్ళిపోయాడు. అంతా రెండు క్షణాల్లో జరిగిపోయింది. సునీత మనసు మనసులో లేదు. చాలా బాధగా ఉంది. తను అనుకున్నదేమిటి? జరిగిందేమిటి? కుందేలు పిల్ల అని ప్రేమగా ఎత్తుకుంటే అది ముసుగు తీసేసి 'హహహా నేను నిజంగా సింహాన్ని' అన్నట్టు అనిపిస్తోంది.

సుందరాన్ని గురించి తనేం అనుకుంది? అతనెలా మారిపోయాడు? కొత్త సుందరం సునీతకి అస్సలు నచ్చలేదు.

అటు సుందరం బెడ్‌రూంలో స్థిమితంగా ఉండలేకపోయాడు. ఇప్పుడంతా చక్కగా అర్థం అవుతోంది. స్టయిలుగా, అందంగా ఉన్న రఘుని చూడగానే సునీత మనసు మారిపోయింది. అందుకే అతనికి స్పెషల్ రూము ఇచ్చి తనని అవమానిస్తే తనంతట తనే వెళ్ళిపోతాడనుకుంది. ఇప్పుడింక లాభం లేదని డైరెక్టుగానే చెప్పేసింది. ఈ ఆడపిల్లలంతా ఇంతే. అతని ఆలోచనలు ఈ పంథాలో కొంతసేపు సాగాక కొంచెం కోపం తగ్గింది.

పాపం సునీత తప్పేం ఉంది? తప్పంతా రఘుది. ఇలాంటి వాళ్ళ వల్లే ఆడవాళ్ళందరికీ ప్రమాదం. ఆడపిల్లల్ని షికార్లనీ, సినిమాలనీ, హోటళ్ళనీ తమతో తిప్పుతారు. కబుర్లు చెప్పి నవ్వించి, కవ్వించి చివరికి వదిలేస్తారు.

ఇలా అర్థం, వర్థం లేకుండా సాగిపోతున్నాయి ఆలోచనలు. ఆ ఆలోచనల్లో కింద ఎవరో తలుపు గట్టిగా బాదడం, సునీత తల్లీ తండ్రీ హడావిడిగా కిందకి వెళ్ళడం, ఏవో మాటలు, తర్వాత అంతా డైనింగ్ హాల్లోకి వెళ్ళడం లీలగా వినిపిస్తూనే ఉన్నా, అతను అదేం పట్టించుకోలేదు.

సుందరానికి ఉక్రోషంగా ఉంది. ఇన్నాళ్ళ నుంచీ సునీత కోసం పొద్దున్నే చన్నీళ్ళ స్నానాలు చెయ్యడం, జాగింగ్, యోగా అన్నీ గుర్తువచ్చాయి. వాటితో పాటు తనకి కొత్తగా వచ్చిన ఆత్మవిశ్వానం కూడా గుర్తొచ్చింది. అదే ఆత్మవిశ్వాసంతో ఇప్పుడే వెళ్ళి రఘుతో మాట్లాడి, 'అమీ, తుమీ' తేల్చుకోవాలనుకున్నాడు.

రఘు ఇప్పుడుంటున్న గది తెలుసు కనుక సూటిగా ఆ గదికి వెళ్ళాడు. ఇంకా రఘు గదికి రాలేదు. అతనొచ్చే వరకు ఎదురు చూస్తూ అక్కడే కుర్చీలో కూర్చున్నాడు.



గొడవంతా తెలీని రఘు మాత్రం తనకిచ్చిన వేరే గదిలో హాయిగా నిద్రపోతున్నాడు.

సుందరం కుర్చీలో కూచున్న 5 నిమిషాలకే బయట మాటలు వినిపించాయి.

'బాగా పొద్దుపోయింది. మీరు పడుకోండి. రేపొద్దున సుందరాన్ని పరిచయం చేస్తాను. రఘు కూడా ఇక్కడే ఉన్నాడు' సార్వభౌమరావు గారి గొంతు వినిపిస్తోంది.

ఎక్కడో ఏదో పొరపాటు జరిగినట్టు అన్పించింది సుందరానికి. ఇంతలో

'ఎవరూ? వావిరాల సుందరం ఇక్కడున్నాడా?' అన్న మాట వినిపించగానే స్థాణువైపోయాడు.

ఆ గొంతు తను ఎక్కడైనా గుర్తు పట్టేస్తాడు. చిన్నప్పుడు చెరువులో స్నానం చేస్తున్నప్పుడు విన్న గొంతే అది. తలుపు తీస్తున్న చప్పుడు అవుతోంది. అతను ఒక్క దూకులో మంచం కింద దూరాడు. అతను భయంతో ఎంత బిగుసుకుపోయాడంటే, మంచం కింద ఉన్న దుమ్ములో ముడుచుకు కూచున్నా, అతనికి తుమ్ము కూడా రాలేదు.

సుబ్బులు మావయ్యంటే ఎవరో అనుకున్నాడు కానీ, తన చిన్నప్పటి సుబ్బారావు మాస్టారని అనుకోలేదు. ఆయన బాత్రూములోకి వెళ్ళినప్పుడు కూడా బయటికి పారిపోలేక పోయాడు.

మంచం మీద ఆయన నిద్రపోయి, గుర్రు మొదలుపెట్టాకే అతను ధైర్యంగా తల బయటికి పెట్టాడు. గదంతా చీకటిగా ఉంది. మంచం మీద గుర్రు వినిపిస్తోంది. లేచి నుంచునే ధైర్యం లేక, అలా పాకుతూనే తలుపు దాక వెళ్ళాడు. గుమ్మం దాటి, అవతలకి వెళ్ళి, తలుపు వేశాక ధైర్యంగా ఊపిరి పీల్చుకున్నాడు. కాళ్ళకేదో చల్లగా, మెత్తగా తగలడంతో భయపడి ఒక్క గెంతు గెంతాడు. అప్పుడు వినిపించింది - భూమి, ఆకాశం బద్దలైనంత చప్పుడు. హడలిపోయి మళ్ళీ గెంతాడు. ఈసారి అతని తల గోడకి తగిలి, అనుకోకుండా పక్కనే ఉన్న స్విచ్చి నొక్కుకుని లైటు వెలిగింది. తను చేసిన పొరపాటు అర్థం అయింది. ఆ చీకట్లో బయటికి వెళ్తున్నాననుకుని పొరపాటున బాత్రూములోకి వచ్చేశాడు.

ఆ చిన్న బాత్రూంలో తను మొదటి గెంతులో స్టూలుని తన్నడం వల్ల కింద పడి విరిగిన షాంపూ బాటిల్సూ, స్టీలు బకెట్టూ, స్టీలు చెంబూ కలిసి చేసిన చప్పుడు ఇంకా చెవుల్లో గింగురుమంటూనే ఉంది. హడలిపోయి నుంచున్న సుందరానికి బయట నుంచి నిద్రలోంచి ఉలిక్కిపడి లేచిన మాస్టారి గొంతు విన్పించింది. వెంటనే తెలివిగా బాత్రూము తలుపు గడియ వేసి, లైటార్పేశాడు.

బయట చప్పుళ్ళు ఎక్కువయ్యాయి. దొంగొచ్చాడనుకుని కర్రకోసం వెతుకుతున్న లెక్కల మాస్టారి పాదాల చప్పుడు, ఇంకాస్త బయట ఏం జరిగిందో తెలుసుకోవాలని




తలుపులు బాదుతున్న ఇంటాయన చేతుల చప్పుడు.

కాసేపటికి సుబ్బారావు గారికి కర్ర దొరికినట్టుంది. ధైర్యంగా బాత్రూం తలుపు దగ్గరకొచ్చి 'ఎవర్నువ్వు' అన్నారు.

'నేన్నేన్నేనే భయం లేదు' అన్నాననుకున్నాడు సుందరం.

'ఎవర్నువ్వు అంటే మాట్లాడవేం? బయటికి రా చితక్కొట్టేస్తాను' కోపంగా అన్నారు సుబ్బారావుగారు.

'నేనే ఫర్వాలేదు' అన్నాడు సుందరం మళ్ళీ.

'దొంగున్నాడా? ఏమంటున్నాడు? బయటినుంచీ సార్వభౌమరావుగారు.

'వీడెవడో హిందీ దొంగలాగున్నాడు. హిందీలో మాట్లాడుతున్నాడు. బాత్రూములో దూరి తలుపేసుకున్నాడు.

'ముందు తలుపు తియ్యండి. నా దగ్గర నా మిలట్రీ గన్నుంది. వాణ్ణి షూట్ చేసేద్దాం'

తలుపు తీసిన చప్పుడు వినిపించి, సుందరం ఇంకా కంగారు పడ్డాడు.

'నేన్నేన్నేను, సు, సు, సు...' అన్నాడు బాత్రూములోంచి.

'వీడు నిజంగా హిందీ దొంగే. బహుశా మేం ఢిల్లీలో ఉన్నప్పుడు నా మీద పగబట్టి ఉంటాడు. ఇప్పుడే వాడి పని పడతాను.

ఆ తర్వాత మాటలు వినిపించలేదు. ఢాం! అని చప్పుడు మాత్రం విన్పించింది. ఆ చప్పుడే సుందరానికి కర్తవ్యం బోధించింది. స్టూలు వేసుకుని, కిటికీ లోంచి సిల్ మీదకి ఎక్కాడు. అక్కడ ఒక్క క్షణం నుంచునే సరికి బాత్రూము తలుపు విరిగిన చప్పుడు విన్పించింది. ఆ చప్పుడే స్ఫూర్తిగా పక్కనే ఉన్న పైపు పట్టుకుని పైకి పాకేశాడు. తను సరిగ్గా కాలు పైకి తీసుకోగానే ఆ గోడకి బుల్లెట్ తగలడంతో వరుగు లంకించుకున్నాడు. మెట్లవైపు వెళ్ళబోయాడు కానీ, అందరూ అటునుంచే పైకి వస్తారని గుర్తొచ్చి, మరోవైపు వెళ్ళాడు. అటునుంచీ ఓ విండో సిల్ మీదకి దూకేశాడు.

మారిపోయిన సుందరాన్ని తలుచుకుని కిటికీలో కూచుని బాధపడుతున్న సునీత ఏదో దూకిన చప్పుడు విని ఉలిక్కి పడింది. పక్కనే పైపు పట్టుకుని కిందికి వస్తున్న సుందరాన్ని చూసి ఆశ్చర్యపోయింది. సునీతని చూడగానే సుందరం ఆ కిటికీలోకి దూకేశాడు.

'సునీతా నన్ను రక్షించు. లేకపోతే మీ నాన్న నన్ను షూట్ చేసేస్తారు.' అంటూ వణికిపోతూ నుంచున్న సుందరాన్ని చూస్తుంటే సునీతకి కోపం మాటున దాగిన ప్రేమంతా పొంగి వచ్చింది.



ఎమర్జెన్సీ వచ్చినప్పుడు ముందు పనిచేసి, తర్వాత ప్రశ్నలు అడగాలని తెలిసిన అమ్మాయి కనుక అతన్ని దాచేందుకు బీరువా తలువు తీయబోయింది. మంచం కింద చటుక్కున దూరటంలో అల్రెడీ తర్ఫీదైన సుందరం మాత్రం ఇటూ, అటూ చూడకుండా ఎదురుగా వున్న మంచం కిందకి దూరిపోయాడు. బయట అడుగుల చప్పుళ్ళు ఎక్కువయ్యాయి. మరు నిమిషం సునీత గది తలుపు ఎవరో టకటకా కొట్టారు.

'సునీతా! మన ఇంట్లో దొంగ పడ్డాడు. వాణ్ణి పట్టుకోడానికి మేం ఇల్లంతా గాలిస్తున్నాం. నేను పిలిచే వరకూ బయటికి రాకు. తలుపు గడియ తియ్యకు' అంటున్న తండ్రి మాటలు విని,

'భయం లేదు నాన్నా, నేను గడియ వేసుకునే ఉంటాను' అంది సునీత.

'ఒక్క క్షణంలో జారిపోయాడు వెధవ. చేతికి దొరికితే ముక్కె లిరగొట్టి ఉందును వెధవని, ఇటువైపే దిగాడే. అమ్మాయి గదిలోకి రాలేదంటే, కింద తోటలోకి వెళ్లుంటాడు పదండి చూద్దాం' అన్నారు సుబ్రావు మాస్టారు.

ఆయన మాటలు వింటుంటే మంచం కిందున్న సుందరం కళ్ళముందు చీకట్లు కమ్మి నక్షత్రాలు కనిపించాయి.

వాళ్ళంతా వెళ్ళిపోయాక పైకి లేచిన సుందరం కళ్ళముందు మాయమౌతున్న ఒక్కో నక్షత్రంతో పాటు, అతను నేర్చుకున్న ఒక్కో ఆత్మవిశ్వాసం పాఠమూ కూడా మాయమయిపోయాయి.

తనముందు అమోయమంగా నుంచున్న సుందరాన్ని చూస్తూ, 'ఏమిటిది సుందరం? ఏం జరిగింది?' అంది.

'ఏం లేదు. సుబ్బారావు మాస్టారు... మా సుబ్బులు మావయ్యా'

'అవునూ, ఆయన లెక్కల మాస్టారుగా




పనిచేసి, ఈ మధ్యే రిటైరయ్యారు. కొంపతీసి ఆయన స్టూడెంటు వావిరాల సుందరానివి నువ్వునా ఏమిటి?' అంది అప్పుడే అంతా అర్థమై.

'అవును కానీ, ఇప్పుడు మీ ఊరునించీ హైదరాబాదుకి బస్సేదైనా ఉందా? పాలు తీసుకెళ్ళే వ్యాన్ అయినా సరే. నీకు పుణ్యం ఉంటుంది. నన్నందులో ఎక్కించేద్దూ. మళ్ళీ మాస్టారు వెళ్ళాక వచ్చి మీ నాన్నతో మాట్లాడతాను.'

'ఒక్క నిమిషం ఆగు. అసలు జరిగిందేమిటో మొదటినించీ చెప్పు'

'రాత్రి భోజనాలు చేశాక నువ్వు కోపంగా ఉన్నావని నా గదికి వెళ్ళాను. ఎంత సేపటికీ నిద్ర




పట్టక, రఘు రూముకి వెళ్ళాను.'

'ఎందుకు?'

'ఎందుకంటే... ఊరికే కాసేపు మాట్లాడదామని'.

'రఘు రూము నీకెలా తెలుసు? వాడు కింద హాలు పక్క గదిలో పడుకున్నాడు'

'కిందటిసారి నాకిచ్చిన గది అతనికిచ్చారేమో అనుకుని ఆ గదికి వెళ్ళాను.'

'ఓ'

'అలా ఓ అని నా వైపు చూస్తావెందుకు? ఊరికే కబుర్లు చెప్పడానికే వెళ్ళాను. తీరా, ఆ గదిలో రఘు లేడు. మాస్టారి గొంతు విని మంచం కింద దూరాను...

కథంతా విన్న సునీత పకపకా నవ్వింది.

'నీకు మావయ్యంటే భయం ఎందుకు చెప్పు? మావయ్యకి నువ్వంటే ఎంత ఇష్టమో తెలుసా? నువ్వు చాలా బుద్ధిమంతుడివనీ, నాలాంటి అల్లరి పిల్లకి నీలాంటి నెమ్మదస్తుడే సరిపోతాడనీ... అసలు నీ సంబంధం గురించి నాన్నతో మాట్లాడటానికే వచ్చారు. ఆ సుందరం నువ్వేనని తెలీక నేను కంగారు పడుతున్నాను.

'మరి రఘు.... నీతో మాట్లాడటం'

'అదా, తను ప్రేమించిన సిమ్రాన్ గురించి వాళ్ళమ్మతో మాట్లాడమని నిన్ను అడగాలను కుంటున్నాడు. ఇందాక నాన్నని నువ్వు ఎదిరించిన తీరు చూశాక, మా కమలత్తతో మాట్లాడేందుకు నువ్వే సరిపోతావని వాడి ఉద్దేశం. అందుకని, ఆ 'ఆత్మవిశ్వాసం' కోర్సు అడ్రసు వాడికియ్యి.

'అలాగే చేస్తాను కానీ, ముందు సుబ్రావు మాస్టారిని కలిసి మాట్లాడి వస్తాను.' అంటూ హడావిడిగా కిందకి పరిగెత్తాడు.

సునీత సంతోషంగా కిటికీలోంచి బయటికి చూసింది. వెన్నెల మబ్బు తెరల్లోంచి తొలగి తోటంతా పలచగా పరుచుకుంటోంది. పిల్లగాలి నేను తాకితేనే ఇంత సిగ్గా అంటూ ఆమె ఎర్రబడ్డ బుగ్గలని చల్లగా తాకుతోంది.

దూరంగా తోటలో ఇంకా దొంగని వెతుకుతున్న సార్వభౌమరావుగారు, సుబ్రావు మాస్టారు, పనివాళ్ళతో పాటు సుందరం గొంతు కూడా మంద్రంగా వినిపిస్తోంది. జరిగింది తల్చుకున్న సునీత పెదాల మీద చిరునవ్వు వెలసి, ఆ వెన్నెల్లో తళుక్కుమంది."

అంటూ కథ ముగించాడు సత్యం బాబాయి.

'మరి సుందరం ఆత్మవిశ్వాసం ఎక్కువైపోయి సునీతని ఎప్పుడూ ఏమీ అనలేదా?' అడిగాడు కథ విన్న వాసు.

'అనకేం... ఎప్పుడన్నా ఏవన్నా అంటే, సుబ్రావు మాస్టార్ని భోజనానికి పిలవనా అంటుంది సునీత. దాంతో తగ్గిపోతాడు సుందరం!" అన్నాడు సత్యం బాబాయి ఫక్కున నవ్వి. ■


చదువుల్రావు
సత్యమూర్తి BV
చదువుల్రావు పరీక్షహాల్లో కూర్చుని బల్లమీద గవ్వలు విసిరి_ 'ఒకటి పడింది_ అంటే 'ఏ' అని టిక్కు పెట్టాడు.
మళ్ళీ గవ్వలు విసిరి 3 అంటే అన్నమాట_అని 'C' మీద టిక్కు పెట్టాడు
మళ్ళీ విసిరి 2 అంటే B అన్నమాట అని B టిక్ పెట్టాడు
ఏమిటోయ్ గవ్వలాట ఆడుతున్నావ్?!
లేదు సార్ ఒకటి పడ్తే A అని 2 పడ్తే B అని...
3 పడ్తే C అని, 4 పడ్తే D అని ఒక్కొక్క ప్రశ్న చూసుకుని...
A యొ B యో టిక్ పెడుతున్నాను సార్



ప్రముఖ గాయకుడు, స్వరకర్త
లలిత సంగీత విద్వాంసుడు,
వాగ్గేయకారుడు
**ఎం.చిత్తరంజన్**
సమర్పిస్తున్న శీర్షిక ఇది.
ఫోన్ నెం. 040-7402993

# లలిత సంగీతం

## హృదయాల తోటలు పూయగా

హృదయాల తోటలు పూయగా వచ్చింది వాసంతం వాసంతం
మన భాగ్యనగరం అంతటా విరిసింది ఆనందం ఆనందం

1. రాళ్ళ గుండెలలో మల్లియలే తెల్లని నవ్వులొలికే
ముళ్ళ మనసులలో గులాబీలే తీయని తావి చిలికే
ఓ ఉగాదీ స్వాగతం స్వాగతం
ఓయనేస్తం స్వాగతం సుస్వాగతం ॥హృదయాల॥

2. కథానాయకుడవై నీవు కదలిరావోయీ
ఎల్లజనులు మెచ్చుకొనగ మల్లెపూలు విచ్చుకొనగ
సుధామయ జీవివై నీవు సొంపులిడవోయీ
ఎల్లజనులు మెచ్చుకొనగ మల్లెపూలు విచ్చుకొనగ
ఓ ఉగాదీ స్వాగతం స్వాగతం
ఓయి నేస్తం స్వాగతం సుస్వాగతం ॥హృదయాల॥



| | |
|---|---|
| రచన | : కీ॥శే॥డా॥దాశరథి |
| సంగీతం | : చిత్తరంజన్ |
| గానం | : చిత్తరంజన్, శాంత, ఎ.వి.సావిత్రి |
| రాగం | : బిలహరి |
| తాళం | : మిశ్రచాపు (కర్ణాటక సం॥)<br>- రూపక్‌తాల్ (హిందుస్తాని సం॥) |
| ఆరోహణ | : స రి గ ప ద స |
| అవరోమణ | : స ని ద ప మ గ రి స |

-షడ్జము, చతుశృతి రిషభం, అంతర గాంధారం, పంచమం, చతుశృతి ధైవతం ఆరోహణలోను, కాకలినిషాదం, చతుశృతి ధైవతం, పంచమం, శుద్ధమధ్యమం, అంతరగాంధారం, చతుశృతి రిషభం అవరోహణలోను వుండే యీ రాగంలోని స్వరాలు. కైశికి నిషాదం కూడా యీ రాగంలో వాడబడుతుంది.

కర్ణాటక సంగీతంలో బిలహరి చాలా ప్రసిద్ధి చెందిన రాగం. ఎంతోమంది వాగ్గేయకారులు యీ రాగంలో కీర్తనలు రచించారు. ''వరిదానవిచ్చితే పాలింతువేవేవెూ'', "కనుగొంటిని శ్రీరాముని నేడు" మొదలగు కీర్తనలు యీ రాగంలో బహుళ ప్రచారాన్ని పొందినవి. లలిత శాస్త్రీయ, లలిత సంగీతాలలో కూడా యీ రాగం వాడుకలో వున్నది. నాటక రంగంలో ఎంతోమంది నటీనటులు బిలహరి రాగంలో పద్యాలు పాటలు కూడా పాడేవారు. లలిత సంగీతంలో కూడా చాలామంది స్వరకర్తలు యీ రాగాన్ని ఉపయోగించి సురుచిరమైన బాణీలను అందించారు. తెలుగు చలన చిత్ర రంగంలో ముఖ్యంగా పౌరాణిక చిత్రాలలో పద్యాలకు యీ రాగాన్ని వినియోగించేవారు సంగీత దర్శకులు.

అది 1963వ సంవత్సరం. ఉగాది పర్వదినం. కన్నుల పండువగా తీర్చిదిద్దబడిన రవీంద్రభారతి వేదిక. మద్రాసు నుంచి భాగ్యనరంలో స్థిరనివాసమేర్పరచుకోవడానికి విచ్చేసిన ఆంధ్రుల ఆదరాభిమానాలను అమితంగా చూరగొన్న 'నటసామ్రాట్' అక్కినేని నాగేశ్వరరావు గారికి ఎంతో ఘనమైన సత్కారం ఆనాడు జరిగింది. ఆ సందర్భాన్ని పురస్కరించుకుని ముళ్ళపూడి వెంకటరమణ, బాపుగార్లు దాశరథి గారిని ఒకపాట రాయమని కోరగా, దాశరథి గారు నన్ను సంగీతం కూర్చమని అడిగారు. ఆబిడ్స్‌లోని తాజ్‌మహల్ హోటల్లో బసచేసిన బాపు, ముళ్ళపూడి వారల సమక్షంలో "హృదయాల తోటలు పూయగా వచ్చింది వాసంతం" అనే పాట రూపుదిద్దుకుంది. నాగేశ్వరరావు గారిపై ముళ్ళపూడి వారు రచించిన "కథా నాయకుడి కథ" అనే గ్రంథం ఆ సత్కార సభలో ఆవిష్కరించబడింది. ఆ విషయాన్నే దాశరథి గారీ పాటలో "కథానాయకుడవై నీవు కదలిరావోయి-ఎల్లజనులు మెచ్చుకొనగ మల్లెపూలు విచ్చుకొనగ" అంటూ కడునేర్పుగా ధ్వనింపజేశారు. ఉగాది నాడు జరిగిన ఆ కార్యక్రమంలో నేను, మా సోదరి శాంత, ఎ.వి.సావిత్రి ఆ పాటను పాడాము. తరువాత అదే పాటను ఆకాశవాణిలో ఉగాది పాటల కార్యక్రమానికై రికార్డు చేసి ప్రసారం చేయడం జరిగింది. నేటికి అక్కినేని వారు భాగ్యనగర వాసిగా స్థిరపడి నలభై వసంతాలు పూర్తి చేసుకున్న శుభ సందర్భంలో యీ సంవత్సరపు ఉగాది పండుగకు ఆనాటి ఆ పాటను 'హాసం' పాఠకులకు సముచితమని భావించి అందిస్తున్నాను.

**ఎ.వి.సావిత్రి**



ఎ.వి.సావిత్రి (1939-1995) శ్రీమతి లక్ష్మీబాయి శ్రీ ఎ.వి.కృష్ణారావు దంపతుల





సంతానం. చిన్నప్పటి నుంచి సంగీతం అంటే సావిత్రికి ప్రాణం. మొదట తన సోదరి శ్రీమతి మారేమండ శేషమ్మ గారి వద్ద సరిగమలు ప్రారంభించింది. తరువాత శ్రీ పి.చెల్లప్ప, మహామహోపాధ్యాయ శ్రీ నూకల చిన సత్యనారాయణ గార్ల వద్ద శాస్త్రీయ సంగీతం, శ్రీ పాలగుమ్మి విశ్వనాథం గారి వద్ద లలిత సంగీతం అభ్యసించింది. తొలుత హైదరాబాదు ఆంధ్ర బాలానంద సంఘం వేదిక మీద పాటలు పాడుతూ గాయనిగా రూపుదిద్దుకుంది. చిన్నప్పుడు పాఠశాల నాటకాల్లో నారదుడు, కాళిదాసు, కణ్వమహర్షి వంటి వేషాలు వేస్తూ పాటలు పాడేది. 1950 నుండి హైదరాబాద్ ఆకాశవాణిలో గాయనిగా పలు కార్యక్రమాల్లో పాల్గొనటం ప్రారంభించింది. శ్రీ విశ్వనాథం గారి సంగీత సారథ్యంలో సినారె గారి 'రామప్ప' సంగీత రూపకంలో 'రాలలోపల పూలు పూచిన' అనే పాటలను నాతో కలిసి గానం చేసింది. దాశరథి గారు రచించిన 'మీర్జా గాలిబ్' రూపకంలో పాలగుమ్మి వారి నిర్వహణలో కలిసి నటించి పాటలు పాడింది. ఇలా ఎన్నో సంగీత రూపకాల్లో పాల్గొంది. విశ్వనాథం గారు స్వరపరచిన పాటలెన్నో మేమిద్దరం కలిసి పాడాము. నా సంగీత సారథ్యంలో 'మాధవా మాధవా' 'మరల కొత్త చిగురులు' పాటలు పాడింది.

రవీంద్ర భారతి ప్రారంభోత్సవ సభలోను, దక్షిణ హిందీ ప్రచార సభ రజతోత్సవ సందర్భంగా ప్రదర్శించిన 'శ్రీనివాస కల్యాణం' హిందీ రూపకంలోను, ఇలా ఎన్నో సభల్లో వేదికల మీద సావిత్రి తన గానం వినిపించింది.

ఆంధ్రప్రదేశ్‌లోనే కాకుండా తన భర్త ఉద్యోగరీత్యా పర్యటించిన అమెరికా, లిబియా, సౌదీ అరేబియా మొదలైన చోట్ల కూడా శాస్త్రీయ, లలిత సంగీత కచేరీలు చేసింది. 'కథా నాయకుని కథ' ఆవిష్కరణ సందర్భంగా దాశరథి గారు రచించిన ఈ వసంత గీతంలో నాతో, శాంతతో కలిసి గళం అందించింది.

మంచి గాత్రం చక్కని భావ ప్రకటన గల మంచి గాయని సావిత్రి లాంటి ఉత్తమ కళాకారిణి జీవనలత మధ్యలోనే తునిగిపోవటం చాలా విచారకరం. సావిత్రి భర్త శ్రీనివాసరావుగారు ఎంతో శ్రమించి సావిత్రి పాడిన పాటలన్ని కాసెట్లుగా వెలువరించటం అభినందతగిన విషయం. అంతేకాకుండా వారు నవ్య నాటక సమితి ఆధ్వర్యంలో ప్రతియేడాది "ఎ.వి.సావిత్రి స్మారక లలిత సంగీత పోటీలు" నిర్వహించి విజేతలకు నగదు బహుమతులు కూడా అందజేస్తున్నారు. ఈ పోటీలు ప్రతియేడు జూలై నెలలో శ్రీ వేమరాజు నరసింహారావు గారి పర్యవేక్షణలో జరుగుతున్నాయి. ఇవి లలిత సంగీత కళాకారులకు ఎంతో ప్రోత్సాహకరంగా ఉన్నవి.

**'హాసం' జూన్ 1-15, 2002 సంచికలో బిలహరి రాగం ఆధారంగా కొన్ని చిత్రగీతాలు పేర్కొనడం జరిగింది.** ■

**జరిగిన కథ**

అజయ్ అనే శ్రీమంతుడు, విజయ్ అనే పేదవాడు ఒక ఏడాదిపాటు తమ తమ స్థానాలను మార్చుకోవాలని నిశ్చయించుకుంటారు. అజయ్ స్థానంలో వచ్చిన విజయ్ మేనేజర్ భానోజి మోసం చేస్తున్నాడని గమనించి అతని కూతురు సరళతో ప్రేమ నటిస్తాడు. కానీ ఆమె తనంటే నిజంగా ఇష్టపడుతోందని అనిపిస్తుంది అతనికి. భానోజీ అనుచరులను ఉద్యోగంలోంచి తీసేసి, దుబారా తగ్గిస్తూ, భానోజికి ముకుతాడు వేస్తూంటాడు. విజయ్ స్థానంలో వచ్చిన అజయ్ చెల్లెలు మీనా కాపురం సరిదిద్దే ప్రయత్నంలో బావ బుజ్జిని బెదిరిస్తాడు. బుజ్జి భార్యను కలవడానికి చాటుగా వస్తూంటాడు. మోటారు మెకానిక్‌గా పని చేస్తున్న అజయ్‌కు తన కొలీగ్ ప్రకాష్ చెల్లెలు పద్మతో ప్రేమలో పడతాడు. భార్యను కలిసి వస్తున్న బుజ్జి తండ్రి కళ్లల్లో పడుతూంటే, తల్లి కాపాడుతుటుంది. పద్మకు అజయ్ ఆఫీసులో ఉద్యోగం లభిస్తుంది. తన యజమాని, ప్రియుడు ఒకే పోలికలో ఉన్న విషయం గుర్తిస్తుంది. (ఇక చదవండి)



# అన్నపూర్ణావారి ఇద్దరు మిత్రులు

## సీరియల్ - నెం 14

**రచన : ముళ్లపూడి వెంకటరమణ**

"అయితే, మీరే దాచుకోండి!"



"ఓడి పోయావు! ఓడి పోయావు!" అంటూ పొట్లంవిప్పి తాయిలం మీనా నోటికి అందించబోయాడు బుజ్జి.

మీనా పెడమొహం పెట్టి, "ఒద్దు నాకా మిఠాయి వాసన పడదు" అంది.

"అదేమిటి మీనా. ఎంతో ఇష్టంగదా నీకు? ఏం ఒంట్లో బాగాలేదా?" అన్నాడు బుజ్జి బేజారుపడి.

"కడుపులో తిప్పుతోంది."

"ఏం?ఎప్పటినుంచి?"

"రోజూను...ఆ మిఠాయి కాస్త దూరంగా పెడుదురూ" అంది మీనా వెలపరం దిగద్రొక్కు కుంటూ.

"చిత్రంగా ఉందే. మీ అన్నయ్యతో చెబితే మందు తెచ్చేవాడుగా."

మీనా సిగ్గుతో దూరంగా జరిగింది.

"అబ్బ!మీరొకరు...మరే...మరేమో..."అంటూ దరిచేరింది. "ఛ నాకు సిగ్గేస్తోంది బాబూ" అంటూ చేతులలో ముఖం దాచుకుంది.



"ఇంకా సిగ్గే!" అన్నాడు బుజ్జి. అతనికి సంగతి బోధపడలేదు. "ఏమిటి మీనా" అన్నాడు లాలనగా.

"అదికాదండి మరి, మా అన్నయ్య లేడూ?... మా అన్నయ్య"

ఉన్నాడని ఒప్పుకున్నాడు బుజ్జి.

"మా అన్నయ్య-త్వరలో మాఁవయ్యవు తాడండీ"

"మావఁయ్య అవుతాడా?ఎవరికీ?"

"పొండి! మీకేమి తెలియదు" అంటూ సిగ్గుతో తల వంచుకుంది మీనా.



అప్పటికి తెలిసింది బుజ్జికి. "ఒహో! తెల్సింది. అదా సంగతి!" అంటూ ఆమె చెవిలో రహస్యంగా అడిగి అదేనని తేల్చు కున్నాడు.

"నిజమేనా, మీనా!-అయితే మనకి త్వరలోనే బుజ్జి జూనియర్-ఆఁ?... అవునా?"

మీనా సిగ్గుతో తలతాటించింది.

బుజ్జి ఆనందంతో తువ్వాయిలా చెంగున గంతులు వేశాడు. టూకీగా భరతనాట్యం లాటిది ఆరంభించి, కొంత సాగాక, ఇంటికి పరుగెత్తి తరువాయి అక్కడ ప్రదర్శించాడు.



"ఏమిట్రా నాయనా! ఏమిటా చిందులు?" అంది తల్లి

"అమ్మా అమ్మా మన విజయ్‌బావ లేడూ?" అన్నాడు, బుజ్జి భార్య పంథానే తొక్కుతూ.

"ఆఁ వున్నాడూ-"

"విజయబావకేం-"

"ఆఁ ఏఁవిట్రా చెప్పు" అందావిడ కంగారుగా!

"విజయ్‌బావకి, అల్లుడు పుడతాట్ట"

"అల్లుడు పుట్టడం ఏమిటి? ఇంకా పెళ్ళయినా కాందే!"



"పోమ్మా నీకేం తెలీదు. మీనా చెప్పిందిగా-" అంటూ శుభవార్త తల్లి చెవిలో వూది, సిగ్గు నటించాడు బుజ్జి.

"ఆఁ! నిజమే మానాయనే. ఎంత చల్లని కబురు తెచ్చావురా బుజ్జి" అంటూ,

సంబరపడి పోయింది సూరమ్మగారు.

"మరేమిటనుకున్నావ్" అన్నాడు ప్రయోజకుడైన పుత్రుడు సగర్వంగా.



సూరమ్మగారి సంబరం చప్పున చల్లారి పోయింది. "ఊహ్!" అంటూ కుప్పకూలిపోయింది.

"ఎందుకమ్మా ఫిట్టు. నాన్న లేడుగా!"

"కొంప మునిగిందిరా నాయనా!" అంది తల్లి మండిపోయి.

"కొంప నిలుస్తుందంటారుగా?"

"అందరికొంపలూ నిలుస్తాయి. మన కొంప కూలిందిరా బాబూ!"

"ఏం, మనది గట్టికొంపేగా?" అన్నాడు, కొంపపై కప్పుకేసి పరకాయించి చూచి.

"నువ్వు దొంగచాటుగా అక్కడికి వెళ్ళొస్తున్నావని మీ నాన్నకి తెలిస్తే ఇంకేమన్నా వుందా? ఇల్లు పీకి పందిరెయ్యరూ?" అంది సూరమ్మగారు.



ఒక్కమాటతో ఒక్కమాటుగా బుజ్జి దిగాలు పడిపోయాడు. "అవునే. ఈ సంగతి నాన్నకి తెలిస్తే మనిద్దర్నీ చీల్చి పందిరికి వేళ్ళాడేస్తాడు" అన్నాడు నీరసంగా.

సూరమ్మగారు మాట్లాడలేదు. కర్తవ్యం ఆలోచించసాగింది.

"ఒరే నాయనా! మీ నాన్నని ఎలాగేనా ఒప్పించి, మీనాను ఇక్కడికి తీసుకొచ్చే ఏర్పాటు చేద్దాం. ఎందుకేనా మంచిది. అంతవరకూ నువ్వక్కడికి వెళ్ళద్దు ఏం?" అంది.

తండ్రి కాబోతున్న బంగారు తండ్రి, బాచాల కొండ, "సరే"నని తల తాటించాడు.



* * *

తల నిలువుగా తాటించడం రివాజైన మనుషులు, అడ్డంగా తాటించడం మొదలు పెడితే-ఒక్క భరతనాట్య ప్రదర్శనంలో ఏ తిల్లానా డాన్సుకో తప్ప-సాధారణంగా బాగుండదు. యజమాని తల తాటింపు డైరెక్షన్ మారడం భానోజీగారికీ బావుంటడం లేదు. ఇల్లా అంటే అల్లా అంటాడు. యతి అంటే, ప్రతి అంటాడు. ఇటీవలగా తనతో సంప్రతించ కుండానే, కొన్ని వ్యవహారాలు పరిష్కారం చేస్తున్నాడు. ఫ్యాక్టరీ ఏజన్సీ మార్చడంతో, ఆయన ఓపికపోయింది. ఎదుటపడి అడిగేశాడు.

"అజయ్‌బాబూ! నిజమేనా ఈ సంగతులు? మన ఫ్యాక్టరీ హోల్‌సేల్ ఏజెంట్లును తీసేసి, కొత్త ఏజెంటును ఏర్పాటు చేస్తున్నారట-?"



"అవునండి. ఏం?" అన్నాడు విజయ్ తలెత్తకుండానే.

"ఫాక్టరీ పెట్టినప్పటినుంచీ, వాళ్ళే మన ఏజంట్లు. వాళ్ళ నాన్నగారికి ఎంతో కావలసిన వాళ్ళు, మన వ్యాపారం రహస్యాలన్నీ వాళ్ళకి తెలుసు."

"ఏమిటా రహస్యాలు?" అన్నాడు విజయ్.

అవి యజమానులకు తెలియాల్సినవికావు; వాళ్లు అడగాల్సినవీకావు.



"నా నోటితో ఎందుకు చెప్పిస్తారు?" అన్నాడు మానేజరు గుటకమింగి. ఓ క్షణం ఆగి, చెప్పతగ్గ రహస్యం ఒకటి చెప్పాడు. "వాళ్లూ మనం కలిసి యెంతో సరుకు బ్లాకులో అమ్మాం. ఎంతో 'సొమ్ము' చేసుకున్నాం."

విజయ్ తల పైకెత్తి అయనకేసి సూటిగా చూసి, సూటిగా ఉత్తర్వు ఇచ్చాడు. "భానోజీ గారూ! ఇక ముందు మనం బ్లాక్ మార్కెట్ చెయ్యనూ వద్దు; అన్యాయపు లాభాలు తియ్యనూ వద్దు!" అంటూ లేచి బయటకు బయల్దేరాడు.

మానేజరుగారు గత్యంతరం లేక ఆవేశం తగ్గించుకున్నారు. "అయినా వ్యాపారధర్మం అంటూ ఒకటి వుందిగదూ!"

"మీ వ్యాపారనీతి మెచ్చుకోతగిందే. కాని ఈ విషయంలో నేను బాగా ఆలోచించాను. ఏజెన్సీ కొత్తవాళ్ళ యివ్వటానికి నిశ్చయించుకున్నాను" అన్నాడు విజయ్, నిష్కర్షగా.



ఎదటివాడు పెళునంగా ఉన్నప్పుడు, తను మెత్తబడడం భానోజీగారికి వెన్నతో తిని వంట బట్టించుకున్న విద్య అయినా ఆ క్షణంలో ఆయన నిగ్రహం అగ్రహాన్ని ఆపలేకపోయింది.

"అజయ్‌బాబూ! పాతిక సంవత్సరాలుగా మీ నాన్నగారికి కుడిభుజంగా వుండి పనిచేశాను. వారెన్నడూ నన్ను ఈవిధంగా అవమానించలేదు. ఆ రోజులు పోయాయి. మీ హయాం వచ్చింది..." అంటూ ఆవేశంతో నిట్టూర్చాడాయన.



గుమ్మం దాటుతున్న విజయ్ ఆగి వెనక్కు చూశాడు. "అలా ఉద్రేకపడకండి. కూర్చోండి. కారణం లేకుండా మీ మనసు కష్టపెట్టుకుంటున్నారు" అన్నాడు.

మానేజరుగారు మాట్లాడలేదు. ఒక్క క్షణంలో విజయ్ కర్తవ్యం నిర్ణయించుకున్నాడు. ఆయనకు సూటిగా తిరిగి నిలవలేకపోయినా, మాటమటుకు సూటిగా గురిచేసి, తుదిపలుకు పలికాడు.

"ఒక్క విషయం మాత్రం మీకు స్పష్టంగా చెప్పాలి. మంచిదైనా, చెడ్డదైనా నేనొక నిర్ణయం తీసుకుంటే, దానినే మీరు అమలు జరపవలసి వుంటుంది" అన్నాడు, సుదృఢ స్వరంతో.

భానోజీగారు నిర్ఘాంతపోయారు. విజయ్ ఇంత మాట అంటాడని ఆయన అనుకోలేదు. కథ, కథాంతానికి వచ్చింది. ఆయనా తన దగ్గర వున్న తురుఫాను తీసి ఆడాడు.



"మంచిదే అజయ్‌బాబూ! అలాంటపుడు యిక నా అవసరం ఏముంది. అన్నీ మీరు చూసుకుంటానంటే. ఇక్కడొక హెడ్ గుమాస్తాగా ఉండి, నేను చేయగలిగింది మాత్రం ఏముంది? అది మీకూ గౌరవంకాదు. నాకూ గౌరవం కాదు..." అని అడిగాడు.

విజయ్ ఊపిరి బిగబట్టి వింటున్నాడు. వింటున్నాడని భానోజీగారికి తెలుసు.

"...అంచేత నా ఉద్యోగానికి రాజీనామా ఇస్తున్నాను. నాకు శలవు యిప్పించండి" అన్నాడు నెమ్మదిగా, స్పష్టంగా.

ఈ బ్రహ్మాస్త్రంతో విజయం తనదే అవుతుందన్న తృప్తి, మందహాస రూపంలో ఆయన పెదవులపై మెదలింది.



విజయ్‌కీ బ్రహ్మాస్త్రం గట్టిగానే తగిలింది. క్షణకాలంపాటు నివ్వెరపోయాడు. అజయ్ ఏమను కున్నా సరేనని తెగించాడు.

"మంచిది భానోజీగారూ! మీరూ పెద్దవాళ్ళయ్యారు. కొంత విశ్రాంతి మీకూ అవసరం" అని పక్కగదిలోకి వెళ్ళిపోయాడు.

ఛెళ్ళున కొరడాతో దెబ్బ తగిలినట్లు భానోజీగారు అదరడం విజయ్ గమనించలేదు.

భానోజీగారి కింక కాలు నిలువలేదు. కర్తవ్యం తోచలేదు. ఎదురుగా యజమాని చిత్రపటం కనిపించింది. హఠాత్తుగా ఆయన ఆత్మీయు డనిపించాడు.



నెమ్మదిగా ఆ పటం దగ్గరకు వెళ్ళి చేతులు జోడించి నమస్కరించాడు.

"పాతికేళ్ళ అనుబంధం నేటితో ఋణం తీరిపోయింది. సెలవు దయచెయ్యండి" అన్నాడు.

కంఠం గద్గదమై పోయింది. ముచ్చెమటలు పోశాయి. పాతికేళ్ళుగా రాళ్లుపేర్చి, తన కుమార్తె కోసం కడుతున్న ఆశాసౌధం, గాలిమేడలా అరనిముషంలో కూలిపోయింది.

"మామగారూ!"

పిలుపువిని ఉలికిపడి, సంభ్రమంతో పక్కకు తిరిగి చూశాడు.

"ఒక మాట మామగారూ-" అన్నాడు విజయ్. అతని ముఖం



ప్రశాంతంగా వుంది, మందహాసం వెలుగుతూంది, వినయం ఉట్టిపడుతోంది. ఆయనకు గుండె ఝుల్లుమంది.

"అజయ్‌బాబూ!" అన్నాడు భానోజీగారు.

"మేనేజరు బాధ్యతనుండి మిమ్మల్ని రిలీవ్ చేస్తాను. కాని, సరళ తండ్రిగా, నాకు కాబోయే మామగారుగా మిమ్మల్ని గౌరవించడం నా విధి. ఇక్కడ మీకొక ప్రత్యేకమైన హోదా ఎప్పుడూ వుంటుంది" అన్నాడు విజయ్ నెమ్మదిగా.

"ఎంతమాట అజయ్‌బాబూ!" అన్నాడు భానోజీగారు. సంభ్రమంతో,



ఆనందంతో ఆయనకు ఒళ్ళు పులకరించింది.

"జీతాలు, పెన్షన్లను గురించా నా చింతంతా? సరళ భవిష్యత్తు గురించే. అది కాస్తా ఇపుడు మీరు తీర్చేశారు. మీ దయ...అంతా నాన్నగారి ఆశీర్వాదం" అంటూ, యజమానికి తిరిగి కృతజ్ఞతాభివందనం చేశారాయన. ఆయన కళ్ళు చెమ్మగిల్లాయి.

మనసులో మాట కాస్తా పైకి చెప్పడంతో, విజయ్‌కి సరళ దగ్గిర మరికాస్త చనువుగా మెలిగే అవకాశం ఏర్పడింది. భానోజీగారింటికి వెళ్ళినప్పుడు, ఆయన లాంఛనంగా పలకరించి తప్పుకునేవాడు - సరళా, తనూ స్వేచ్ఛగా మాట్లాడుకుందికి వీలుగా. నగల



రహస్యం, సరళ ద్వారానే సరళంగా గ్రహించాలని, విజయ్ తలపెట్టిన ఉద్యమం దారినపడింది. ఒకనాడు పిక్నిక్‌కు బయల్దేరాడు సరళతో. తిరిగి తిరిగి స్వగ్రామంలో వాళ్ళ బంగళా కూడా చూదామన్నాడు. సరళ ఉత్సాహంగా ఒప్పుకుంది. భానోజీగారు సరేనరి. అత్తయ్యకే నచ్చినట్టు లేదు.

"ఏం నాయనా ఊరికి వెళ్తున్నావట?" అంది.

"అవునత్తయ్యా. భానోజీగారింటికి."

"ఊఁ... సరళతో కలిసేనా?" అందావిడ.

"ఏం?"

"ఏం లేదు-"



విజయ్ అత్తయ్య దగ్గరగా వచ్చి కూర్చున్నాడు. "అత్తయ్యా! నువ్వేమీ సందేహించకు. భానోజీ ఇంటికి వెళ్తే, ఎన్నో రహస్యాలు తెలుసుకోవచ్చు. మన యింటినించి చేరవేసిన సొమ్మూ, నగలూ అన్నీ అక్కడే వున్నాయని నా నమ్మకం" అన్నాడు.

"సరే, వెళ్ళిరా నాయనా. జాగ్రత్త" అంది అత్తయ్య.

ఆవిడ హెచ్చరిక, కారు జోరుగా నడపడం గురించి కాదు; చీకట్లో తిరగడంనించీ కాదు. ఆరోగ్యం కాపాడుకోవడం గురించి కాదు... కాదని విజయ్‌కి తెలుసు.

వెళ్ళేముందు ఆఫీసు గదిలోకి వెళ్ళి, కాగితాలు భద్రపరచి, గది తాళం వేసి, సెక్రటరీ పద్మను పిలిచాడు.

"నేను రెండు రోజుల దాకా రాకపోవచ్చు. ఇవిగో నా ఆఫీసు తాళాలు."

"యస్సార్" అంది పద్మ - విజయ్‌వెంట జంటగా వెళుతున్న సరళను చూస్తూ.



కారు ఊరు దాటగానే, సరళకు డ్రైవింగ్ యిచ్చాడు విజయ్. ప్రాణం హాయిగా వుంది. కొత్త జీవితంలోకి వచ్చి చాలా రోజులయింది. గడువు కింక అట్టే వ్యవధి లేదు. అసలే ఏడాది జీవితమే తన జీవితంలో పిక్నిక్‌లాంటిది. ఇందులో చికాకులు కొన్ని తప్పించుకొని, ఇపుడింకో చిన్న పిక్నిక్‌కు వెళుతున్నాడు; ఈ మూణ్ణాళ్ళ ముచ్చటలో, ప్రేమకలాపం ఒకటి అప్రయత్నంగా సంభవిస్తోంది. సరళని మంచి చేసుకుని, ఆమె ద్వారా నగల రహస్యం భేదిస్తానని అత్తయ్యకి చెప్పాడు. ఆ మాటే తన మనసుకి చెబుతూ వచ్చాడు. కాని మనసు నవ్వుకొంది. మనసులో మాట, మనసుకి తెలుసు...తనకి తెలీకుండానే తన హృదయం వివశం అయిపోతోంది.



తమాయించుకుని కర్తవ్యం గుర్తుకి తెచ్చుకుంటున్నాడు. పెద్దల మధ్యనించి, కట్టుబాట్ల మధ్యనించి ఇవతలకు రాగానే హృదయం రెక్కలు విప్పింది. సరళ మరింత చనువుగా,

స్వేచ్ఛగా వుంటోంది. ఆ ఆనందంలో, జీవితమే ధన్య మైందనిపించింది. సరళది నిజంగా అమాయక హృదయం. ఆమెకీ, భానోజీగారి కుతంత్రానికి సంబంధం లేదు...సరళ కెంత చక్కని సందేహాలు! ఎంత అందమైన సందేహాలూ! ఎంత మధుర మయిన ఊహలూ! గాలికి ఊగుతున్న పువ్వుల్ని చూసి, గునగున లాడుతున్నా యంటుంది. అవేమిటీ అంటుంది.





**ఈ ముసిముసి నవ్వుల**
**విరిసిన పువ్వులు**
**గుసగుసలాడినవి ఏమిటో**
**విరజాజి గులాబి**
**మన గుట్టే తెలుసుకున్నవి**
**చామంతి పూబంతి**
**పరిహాసాలాడినవి**
**పొదరింటను ఒంటరి పావురము**
**తన జంటను కలియగ వేచినది**
**మనసే తెలిసి తన ప్రేయసికై**
**మగపావురమే దరిచేరింది**
**నీ కురులను రేపిన చిరుగాలి**
**నా మదిలో కోరిక రేపినది**
**వలపే తెలపే కనుసైగలతో**
**నీ వూసులు బాసలు చేశాయి**
**నదిలో మెరిసే కదిలే కాంతి**
**నా మోమున తళతళ లాడింది**
**నీ చక్కని చెక్కిలి అద్దాన**
**నా రూపము నేనే చూశాను.**





* * *

"రామా! రక్షకా!...ఇవెక్కడి పంపులయ్యా ఇవి" అన్నాడు రామదాసుగారు. ఆయన ఆ వీధి కుళాయి దగ్గిర కూర్చుని దాని తలవంచడానికి పడుతున్న ప్రయాస చూసినవాళ్ళెవరూ, ఆయన పంపుల తయారీ కంపెనీ ఎడ్రసను కోసం రాముడిని వాకబు చేస్తున్నాడని అనుకోరు.



"మీ రొచ్చారే బాబాయ్, అమ్మాయి ఏమైంది" అంది, బిందె చంకనేసుకొచ్చిన ఓ యిల్లాలు.

"అమ్మాయి-" అంటూ పంపుని ఇంకాస్త నొక్కాడు దాసుగారు.

"ఎంత చోద్యం. తను ఇంట్లో కూర్చుని మీచేత నీళ్ళు మోయిస్తోందా" అందింకో ఆమె బుగ్గలు నొక్కుకుంటూ.

"అబ్బే నేనే వద్దన్నాను. బరువుపన్లు చెయ్యొచ్చా మరి? సామెత జెప్పినట్లు కూడనే కూడదు."

"అయితే అన్నగారూ మీనా నెలతప్పిందా?"



"ఔనమ్మా అవును...అంతా ఆ శ్రీరామచంద్రమూర్తి దయ." లేచి రెండు బిందెలు చేత పట్టుకుని, రామనామతారకం భక్తి ముక్తి దాయకం అనుకుంటూ ఇంటివేపు వెళ్లాడాయన. రాముడు, ఆయనని తరించనివ్వలేదు. కాలు మడతపడి కిందపడ్డాడాయన. బిందెలు గుభేలుమన్నాయి. 'రామా రక్షకా మోచిప్ప' అన్నాడు రామదాసుగారు.



"దెబ్బ తగిలిందా నాన్నా?" అంటూ మీనా లోపలినించి పరుగెత్తుకొచ్చింది.

"ఆ శ్రీరామచంద్రుని దయవల్ల దెబ్బ తగల్లేదు కానీ, మోచిప్ప అదిరింది" అంటూ, నెమ్మదిగా కూతురు చేయూతతో లేచాడు తండ్రి.



"నీ కెందుకు నాన్నా, ఈ అలవాటు లేనిపని. నే తెచ్చేదాన్నిగా" అంది మీనా నొచ్చుకుని.

"నువ్వేలా తెస్తావమ్మా, సామెత చెప్పినట్టు నువ్వు వట్టి మనిషివికావాయె."

"నీదంతా చాదస్తం, పంపునీళ్ళగా, తోడాలా చెయ్యాలా, నువ్వు లోపలికెళ్ళి రామకోటి రాసుకో, నే తెస్తాలే" అంటూ బిందెలు పట్టుకుని కొళాయి దగ్గరకు నడిచింది మీనా.



అప్పుడే అక్కడ ఐదారుగురు లోకులు చేరాయి.

**- (ఇంకావుంది)**



**ధనవంతుడైన నాగేశ్వరరావుగారు తన కారుతో సిటీలో వెళ్ళే దృశ్యం షూట్ చేయాలి, దానికి అబిడ్స్ సరైన లోకేషన్ అనుకున్నారు. కెమెరామన్ సెల్వరాజ్‌గారు, తాజ్‌మహల్ హోటల్‌కు వచ్చి వీధి దీపాలు వెలుగుతున్నపుడు ఆకాశం కూడా బాగా తెలిసే సమయంలో టైమ్ చూసుకున్నారు. అది సుమారు 20 ని॥ మాత్రం వుంది. ఆ సమయానికి నాగేశ్వరరావుగార్ని - ముందుసీట్లో కూచోమని, వెనుక సీట్లో కెమెరాతో ఆయన కూచుని నాగేశ్వరరావుగారి ముఖం తెలిసేలా - ఒక లైటును పెట్టారు. అది బేటరీతో వెలుగుతుంది. ఆ దృశ్యం చూసిన పరిశ్రమ ప్రముఖులు ఆ షాట్ ఎలా తీశారని అడిగారు. వివరాలు తెల్సుకుని ఆశ్చర్యపోయారు.**

**- స్వామి చిత్రానంద (కె.వి.రావు), చెన్నై**




ఇంటికి వచ్చిన అతిథికిమర్యాద చేస్తూ ఇంటాయన అడిగాడు.
" మీకు భోజనంలో ఏ వంటకం ఇష్టమో శలవివ్వండి"

"నాకు చేపల కూర ఇష్టం" అన్నాడు అతిథి.

"మా ఆవిడకు చేపల కూర చేయడం రాదు. మీరు కనుక అదెలా వండాలో కాయితం మీద రాసి ఇస్తే ఆమె చేత వండించే భారం నాది" అన్నాడు ఇంటాయన.

అలాగేనని అతిథి రాసిచ్చాడు.

ఇంటాయన బజార్నుంచి చేపలు తెస్తుండగా ఓ గద్దవచ్చి సంచిలో చేపను ముక్కున కరుచుకు ఎగిరిపోయింది. ఇంటాయన గద్దను చూసి జాలిపడ్డాడు."దాన్ని అలా పట్టుకెళ్ళి ఏం చేసుకుంటావే పిచ్చిముండా? వండే విధానం రాసిన కాగితం నా దగ్గరే వదిలేసేవుగా!"





ప్రొఫెసరు గారు కాలేజీకి బయలు దేరారు.

పక్కింటాయన : సార్! మీరు ప్యాంటు ముందుది వెనక్కు, వెనకది ముందుకు తొడుక్కున్నారు!

ప్రొఫెసరు చిరాకుపడ్డాడు. - 'పెద్ద తెలుసున్నట్టు మాట్లాడుతున్నావే నేను ఏ వైపుకు వెళుతున్నానో నీ కేమైనా చెప్పానా?'

ఒకావిడ బాధపడుతోంది పక్కింటావిడ సంగతేమిటని అడిగింది.

ఇంటావిడ : "ఏం చెప్పను, మా వాడు పావలా మింగేసాడు."

పక్కింటావిడ తేల్చేసింది. "ఓస్ఇంతేనా! దానికి ఇంత బాధపడిపోవడం ఎందుకు? ఈ రోజుల్లో పావలాకు ఏం వస్తుంది కనక!."





పోలీసు భార్య రాత్రి నిద్రలోంచి లేచి భర్తను లేపింది. "ఏమండోయ్ లేవండి, దొంగ వచ్చాడు పట్టుకోండి."

పోలీసు : "విసిగించక పడుకోవేబాబూ! డ్యూటీలో లేనప్పుడు కూడా పనేమిటి?"



గవర్నమెంటు ఆస్పత్రివరండాలో స్పృహతప్పి పడివున్న రోగిని చూసి చచ్చి పడివున్నాడనుకున్నాడు డాక్టరు. "ఈ శవాన్ని ఇక్కడే వుంచారేం, లాగి పారేయండి" అని నర్సును తిట్టేసి రౌండ్స్ కెళ్ళిపోయాడు.

పావం నర్సు చేయిచేసుకుని ఈడ్చేడానికి ప్రయత్నిస్తూండగా రోగికి స్పృహవచ్చింది. "అదేంటి? నేను బతికేవున్నా. ఇలా బయటపారేస్తారేం?" అని మొత్తుకున్నాడు.

నర్సు మండిపడింది. "పెద్ద.. ఎంబీబియస్ చదివాననుకుంటున్నావా? డాక్టరు కన్నా ఎక్కువ తెలుసా నీకు?"

ఇంటాయన : "నేను ఎప్పుడూ దుబారా ఖర్చు పెడతానని నా మీద ఊరికే అరుస్తావు గాని నేనెప్పుడైనా అనవసరంగా ఒక్క వస్తువైనా కొన్నానా?"

ఇల్లాలు : చాల్లెండి. నిప్పులార్పే ఆ సిలిండరు కొని రెండు సంవత్సరాలైంది. ఒక్కసారి కూడా వాడనేలేదు. అది దుబారా కాదూ!"



చదువురాని నౌకరు యజమాని దగ్గరకు ఉత్తరం తెచ్చాడు. "ఇంటికాడనుండి మా యావిడ రాయించిందండయ్యా, కాస్త చదివి చెబుదురూ" అని బతిమాలేడు.

"సరేకానీ" అన్నాడు యజమాని. ఉత్తరం అందుకుని చదవ నారంభించబోయేడు కానీ నౌకరు వెనగ్గా వచ్చి చెవులు మూసేయడంతో తెల్లబోయాడు.

"మొగుడూపెళ్ళాల విషయం కదయ్యా, పరాయోళ్ళు వింటే బాగోదు" అని సంజాయిషీ యిచ్చాడు నౌకరు.



ఈ జోకలను
పంపినవారు
జి.బి.లక్ష్మి
హైదరాబాద్




ఎప్పుడో దెబ్బలాడుకున్న కారణంగా రమేష్‌కి, కిషోర్‌కి అప్పట్నించి మాటల్లేవు.
తన పుట్టిన రోజు పార్టీకి కిషోర్‌ని తప్ప మిగతా స్నేహితులందరినీ ఆహ్వానించాడు రమేష్ .
"అది తప్పు. కిషోర్‌ని కూడా ఆహ్వానించు" అన్నాడు రమేష్ వాళ్ల డాడీ.
రమేష్‌కి యిష్టం లేకపోయినా తండ్రి మాట జవదాటలేదు.
కిషోర్ ఇంటికి వెళ్లి ఉత్తరం రాసి పెట్టాడు.
"రేపు నా పుట్టినరోజు. సాయంత్రం పార్టీ. దమ్ములుంటే రా"
అని రాసి ఉందా ఉత్తరంలో.



తనెంతో అందగత్తెగా ఫీలయ్యే మమత తన స్నేహితురాలు తులసితో గర్వంగా చెప్పకుంది.
"నేను పెళ్లి చేసుకుంటే ఎంతమంది అబ్బాయిలు బాధపడతారో తెలుసా?"
"మరి అంతమందిని పెళ్లిచేసుకోడానికి మీ మమ్మీ, డాడీ ఒప్పుకుంటారంటావా అసలు"
ఆశ్చర్యపోయింది తులసి.



ఇద్దరు చిన్న పిల్లలు మాటాడుకుంటున్నారు.
"ఏరా! మగవాళ్ళు ఆడవాళ్లనే ఎందుకు పెళ్లిచేసుకుంటారు? మగవాళ్లని ఎందుకు పెళ్లి చేసుకోరు?"
"భలేవాడివిరా! అలా అయితే మరి వంటెవరు చెయ్యాలో ఎలా తెలుస్తుంది?"





"మొన్న ఒకరోజున టికెట్ లేకుండా బస్సెక్కేనని కండక్టర్ మధ్యలోనే నన్ను బస్ దింపేశాడు. నేను ఊరుకోలేదులే. ఈ రోజు వాడికి తగిన శాస్తి చేశాను"
"ఏం చేశావురా?"
"ఈరోజు టిక్కెట్ కొని కూడా బస్ ఎక్కలేదు"



రష్‌గా ఉన్న బస్‌లోకి ఎనిమిదేళ్ల కొడుకుతో ఎక్కిందొకావిడ.
"నాకో సీటివ్వండి చాలు" అడిగింది కూర్చున్న వాళ్లని.
"మరి మీ అబ్బాయికో"
"వాడికేం పరవాలేదులెండి. వాడు రక్తం వచ్చేలా కొరకడంలో ఆరితేరినవాడు" అందామె ధీమాగా.

**ఈ జోక్‌లను పంపినవారు: కోనే నాగవెంకట ఆంజనేయులు, ఉక్కునగరం,విశాఖపట్టణం.**



అటెండర్ : "సార్ ... మేనేజర్ గారు మిమ్మల్ని 'రమ్మ'న్నారు!"
గుమస్తా : "అంత మాటన్నారా, అయితే నేను ఆయన్ని బ్రాందీ అన్నానని చెప్పపో!"



శ్రీను : "ఒరే ప్రసాద్ నీకు ఫోనొచ్చింది."
ప్రసాద్ : "ఎక్కడ్నుంచి"
శ్రీను : "వైర్లోంచి"
ప్రసాద్ : ?!?!

**ఈ జోక్‌లను పంపినవారు బాజ్జీ సంగడాల, ధవళేశ్వరం.**

# అర్థం చేసుకుందాం ఆస్వాదిద్దాం



## 'జానే కైసే సప్నో మేఁ ఖోగయీఁ అఖియాఁ'

చిత్రం : అనూరాధా (1960)
రచన : శైలేంద్ర
సంగీతం : పండిట్ రవిశంకర్
గానం : లతా మంగేష్కర్
అభినయం : లీలానాయుడు, బల్‌రాజ్ సాహ్నీ

జానే కైసే సప్నోం మేఁఖోగయీఁ అఖియాఁ
మైఁ తో హూఁ జాగీ, మోరీ సో గయీఁ అఖియాఁ ॥జానే కైసే॥

అజబ్ దీవానీ భయీ, మోసే అంజానీ భయీ (2)
పల్ మేఁ పరాయీ దేఖో హోగయీఁ అఖియాఁ
మైఁ తో హూఁజాగీ, మోరీ సో గయీఁ అఖియాఁ ॥జానేకైసే॥

బరసీ యే కైసీ ధారా, కాంపే తన్‌మన్ సారా (2)
రంగ్ సే అంగ్ భిగో గయీఁ అఖియాఁ
మైఁ తో హూఁ జాగీ, మోరీ సో గయీఁ అఖియాఁ ॥జానేకైసే॥

మన్ ఉజియారా ఛాయా, జగ్ ఉజియారా ఛాయా (2)
జగ్‌మగ్ దీప్ సంజో గయీఁ అఖియాఁ
మైఁ తో హూఁ జాగీ, మోరీ సోగయీఁ అఖియాఁ ॥జానేకైసే॥

పండిట్ రవిశంకర్ భారతీయ సంగీతాన్ని అంతర్జాతీయ శ్రోతలకు చేరువగా తీసుకువెళ్ళి మన ఘనత చాటిన మహానుభావుడు, లివింగ్ లెజెండ్. పాశ్చాత్య సంగీతంలో పేరుగాంచిన బీటిల్స్ మొదలుకొని హిప్పీ కల్చర్ ప్రభావంలో పడిన యువత వరకు అందరినీ ఆకట్టుకున్న విశ్వసంగీతం ఆయనది. నృత్య కళాకారుడిగా, స్వరకర్తగా, సితార్ వాద్యకారుడిగా బహుముఖ ప్రజ్ఞ కనబరిచిన 'భారతరత్న'మాయన. తబలా విద్వాంసుడు ఉస్తాద్ అల్లారఖా ఖాన్‌తో కలిసి ఆయన ప్రపంచ వ్యాప్తంగా చేసిన కచేరీలు భారత శాస్త్రీయ సంగీతాన్ని ప్రపంచ సంగీత పటంలో సమున్నత స్థానంలో నిలబెట్టాయి.

1920 ఏప్రిల్ 7న జన్మించిన పండిట్ రవిశంకర్ అసలు పేరు రబీంద్ర శంకర్ చౌదరి. ఆయన తండ్రి జోధ్‌పూర్ మహారాజా ఆస్థానంలో మంత్రిగా పనిచేసేవారు. చిన్నతనంలోనే అన్న ఉదయ్‌శంకర్ నృత్య బృందంలో నృత్య కళాకారుడిగా ప్రతిభ కనబరిచారు పండిట్‌జీ. 1935లో ఉస్తాద్ అల్లాఉద్దీన్ ఖాన్ స్వరకర్తగా ఆ బృందంలో చేరారు. ఆయన శిష్యరికంలో పండిట్‌జీ సంగీతం అభ్యసించారు. తన సితార్ వాద్యంతో యావత్ ప్రపంచాన్ని ఉర్రూతలూగించారు. బీటిల్స్ బృందం తమ పాటల్లో ఆయన సితార్ బిట్లను వాడుకుంది. సంగీతంలో ఫ్యూషన్ ప్రక్రియలో ప్రయోగాలు చేసి సంగీతానికి ఎల్లలు లేవని నిరూపించారు. తన సంగీతాన్ని కూతురైన అనూష్కాకు వారసత్వంగా ఇచ్చారు. మరో కూతురైన నోరాజోన్స్ తన తొలి ఆల్బమ్ 'కమ్ ఎవే విత్ మీ'తో ఆల్బమ్ ఆఫ్ ద ఇయర్ అవార్డుతో పాటు మొత్తం నాలుగు గ్రామీ అవార్డులు గెలుచుకుని సంచలనం సృష్టించింది.

రవిశంకర్ ఇటీవల వార్తలో మళ్ళీ ఎక్కడానికి నోరాజోన్స్ విజయం కూడా ఒక కారణం అయింది. నోరా తల్లి స్యూజోన్స్ ఒక నర్స్. రవిశంకర్ అభిమాని. ఆయనకు చేరువైందది. వారి ప్రేమ ఫలితంగా 1979 మార్చిలో ఒక పాప పుట్టింది. ఆమెకు గీతాళి నోరాజోన్స్ శంకర్ అని పేరు పెట్టారు.

రవిశంకర్ జీవితంలోకి సుకన్య రెండో భార్యగా ప్రవేశించడంతో స్యూ ఆయన జీవితం నుంచి తప్పుకుంది. బిడ్డను తనే సాకింది. తన గురించి పట్టించుకోని తండ్రిపై అలిగి కాబోలు నోరా 16వ యేట తన పేరులో నుండి గీతాళి, శంకర్ పదాలు తొలగింపచేసి నోరాజోన్స్‌గా కుదించుకుంది.

సుకన్య చొరవ తీసుకుని నోరా 18వ యేట ఆమెను, రవిశంకర్ ఇంటికి



రప్పించారు. ప్రముఖ రికార్డ్ లేబుల్ ఇ.ఎం.ఐ.కి నోరాను పరిచయం చేసింది సుకన్య. పియానో టీచర్ లిజిల్ బార్నెట్‌కు పరిచయం చేసినది రవిశంకరే.

నోరాజోన్స్ ఈనాటి విజయానికి ఒక సోపానం తల్లి పెంపకం అయితే రెండోది రవిశంకర్ జీన్స్!

పండిట్ రవిశంకర్ 40 దశకంలో హెచ్.ఎం.వి. మ్యూజిక్ డైరెక్టర్‌గా పనిచేశారు. 1948 నుండి 56 దాకా ఆలిండియా రేడియోలో పనిచేశారు. సత్యజిత్ రాయ్ రూపొందించిన చిత్రరాజం 'పథేర్ పాంచాలి'కి సంగీతం అందించారు. ఆ తరువాత 'అనూరాధా' 'మీరా', 'గోదాన్' చిత్రాలకు సంగీతం అందించారు. రిచర్డ్ అటెన్‌బరో తీసిన 'గాంధీ'కి కూడా సంగీతం అందించారు. 'అనూరాధా' చిత్రంలో నాయిక సంగీత కళాకారిణి. ఆ పాత్రకు తగ్గట్టుగా పండిట్‌జీ మలచిన పాటలు గాయని లతా మంగేష్కర్‌కు 'సంగీత సరస్వతి' అనే పేరును మరోసారి సార్థకం చేశాయి.

తన తొలి చిత్రం 'ముసాఫిర్' (1957) నుంచే ఆఫ్‌బీట్ బాటలో నడిచిన హృషీకేశ్ ముఖర్జీ నిర్మించి దర్శకత్వం వహించిన మరో కళాత్మక చిత్రం 'అనూరాధా'. హీరోగా వేసిన బలరాజ్ సహానీ 'ఇప్టా'కు చెందిన రంగస్థల, సినీ నటుడు. వామపక్షాభిమాని కావడం వల్ల సినిమా కెరియర్ సవ్యంగా సాగలేదు. గురువు బిమల్‌రాయ్ తన 'దో బిఘా జమీన్'లో బలరాజ్ సహానీచే పేదరైతు పాత్ర వేయిస్తే, శిష్యుడు హృషికేశ్ ఈ సినిమాలో విద్యాధికుడైన డాక్టర్ పాత్ర వేయించాడు. ఏ పాత్రనైనా హుందాగా పోషించడం బలరాజ్ సహానీ సొత్తైతే అతని సోఫిస్టికేషన్‌కి ఏమాత్రం తీసిపోని నటీమణి లీలానాయుడు. ఈ ఆంగ్లోఇండియన్ సుందరి 'యే రాస్తే హై ప్యార్ కే' (1963) వంటి సినిమాలో హైక్లాస్ లేడీగా నెగటివ్ పాత్రలు వేయడానికి కూడా జంకలేదు.



మర్చంట్-ఐవరీ వారు భారత్ నేపథ్యంలో నిర్మించిన ఆంగ్ల చిత్రాలలో శశికపూర్ సరసన నటించింది. ఆమెను అసలుసిసలు భారతీయ గృహిణి పాత్రలో ... నటింపచేసి... ఇండో-ఆంగ్లియన్ అయిన లీలానాయుడును పూర్తి భారతీయ పాత్రలో నటింపచేసి పండిట్ రవిశంకర్ అద్భుత సంగీతంతో రూపొందించిన ఈ చిత్రం 1960వ సంవత్సరపు ఉత్తమ చిత్రంగా జాతీయ పురస్కారం అందుకుంది. అనూరాధ అనే ప్రఖ్యాత గాయని ఒక డాక్టర్‌ని ప్రేమించి తండ్రిని ఎదిరించి పెళ్ళి చేసుకుంటుంది. ఆమె సంగీతాన్ని కూడా ఇష్టపడిన డాక్టర్ పెళ్ళయిన తర్వాత పేదల సేవలో భార్యను నిర్లక్ష్యం చేస్తాడు. ఆమెను తెలియకుండానే ఇంటికి పరిమితం చేస్తాడు. ఫలితంగా ఆమె అసంతృప్తికి గురై అతన్ని వదిలి వెళ్ళాలని నిర్ణయించుకుంటుంది. ఇంతలో కథానాయకుడి ప్రొఫెసర్ వీరింటికి అతిథిగా రావడంతో వీరిద్దరూ ఆయన ముందు సఖ్యత నటిస్తారు. విషయం గ్రహించిన ప్రొఫెసర్ హితవు పలకడంతో భార్య ఆవేదనను భర్త, భర్త ఔన్నత్యాన్ని భార్య అర్థం చేసుకోవటంతో కథ సుఖాంతమవుతుంది.

చిత్రం ప్రారంభంలో 'సావరే సావరే' పాట రేడియోలో వినిపిస్తుంటుంది. పాట వినగానే నాయిక ఎంత చక్కని గాయకురాలో అర్థమయ్యే విధంగా పండిట్‌జీ స్వరపరిచిన తీరు, హృషీకేశ్ ముఖర్జీ దర్శకత్వ ప్రతిభ ఆకట్టుకుంటాయి. అదేవిధంగా 'జానే కైసే సప్నోం మేఁ ఖో గయీ అఖియాఁ' కూడా ఎంతో ప్రాముఖ్యం ఉన్న పాట. నాయిక



మొదట తన ప్రియుడి కోసం పాడే పాట. కలల లోకంలో విహరిస్తూ పాడే పాట. తర్వాత తాను కలల్లో తేలిపోయి వాస్తవాన్ని మరిచానని గుర్తించినపుడు వినిపించే పాట. తనని, తన సంగీతాన్ని ఒకప్పుడు అమితంగా ప్రేమించిన తన భర్తకి ఆపాటలోని రెండోలైను కూడా గుర్తు లేకపోవడంతో అతని నిర్లక్ష్యాన్ని తెలిపే పాట. ఒకే పాటని అన్ని సందర్భాలకు సరిపోయేటట్లు రాయడం శైలేంద్ర ప్రతిభకు నిదర్శనం. అవధి హిందీభాష మాండలి కాలంలో ఒకటయిన 'అవధి' (అవధ్/ప్రాంతంలో మాట్లాడే యాస) మాండలికంలో రాసిన ఈ పాట కేవలం ఒక ప్రేమ గీతంలా కాక ఒక జానపదగీతంలా కూడా వినిపిస్తుంది.

ఖో గయీఁ అంటే తప్పిపోయాయి అని. అఖియాఁ అంటే కనులు. జాగే అంటే జాగృతం. సోగయీఁ అంటే నిదురించాయి.

**'ఏ కలలలో విహరిస్తున్నాయో కనులు**
**నే మేలుకొనే ఉన్నా నిదురస్తున్నా యీ కనులు'**

మెలకువలో కూడా ఏవో ఊహల్లో తేలిపోతోంది ఆమె. కనులు కలల ప్రపంచంలో తప్పిపోయినట్టు పరధ్యానంగా ఉన్నాయి. ప్రేమలో పడినపుడు ఒక అర్థం స్ఫురించే ఈ మాటలు తర్వాత 'వాస్తవం చూడలేకపోయాయి ఆ కనులు' అనిపించేటట్టు చేస్తాయి. కలానికి రెండు వైపులా పదునుండటం అంటే ఇదేనేమో!

అజబ్ అంటే 'అజీబ్'కు మరోమాట. వింత అని అర్థం. దీవాని అంటే వెర్రిది. భయీ అంటే 'హుయీ'కి మరో రూపం. అంజానీ అంటే తెలియనిది. పల్ అంటే క్షణం. పరాయీ అంటే పరాధీనమైనది.

**'వింత పిచ్చి ఇది, మైమరచిపోయాను**
**రెప్పపాటులో పరాధీనమయ్యాయి కనులు'**



ప్రేమ అనే పిచ్చిలో తనను తానే మరచిపోయి తన్మయత్వంలో ఉంది ఆమె. ఆమె కనులు ఇక అతని కొనవే. అతన్ని చూసేందుకే.

బరసే అంటే కురుస్తోంది. ధారా అంటే ధార, జల్లు. కాంపే అంటే వణికింది. తన్‌మన్ అంటే తనువూ మనసూ, అంగ్ అంటే తనువు. భిగోగయీఁ అంటే తడిపాయి.

**'ఏమి జల్లిది, తనువూ మనసూ వణికింది**
**రంగులతో తనువంతా తడిపాయి కనులు'**

అతని ప్రేమ ధారలో తడిసిన ఆమె అణువణువూ చలించిపోయింది. అతని కనులు, చూపులు ఆమెను ఆనందంలో ముంచెత్తాయి. ఆనందానికి ప్రతీకగా వసంతానికి చిహ్నమైన రంగులను ప్రస్తావించారు.

ఉజియారా అంటే ఉజాలాకు మరో రూపం. కాంతి అని అర్థం. ఛాయా అంటే పరచుకుంది. జిగ్‌మగ్ అంటే మిలమిల. సంజోగయీఁ అంటే అలంకరించాయి అని.

**'మనసున వెలుగు నిండె, జగమున వెలుగు నిండె.**
**మిలమిల దివ్వెలు వెలిగించాయి కనులు'**

మనసంతా ప్రేమ నిండితే జగమంతా ప్రేమమయంగా కనిపిస్తుంది. కన్నులలో వింత వెలుగు కనిపిస్తుంది. 'మనం వెతుక్కునే ఆనందం ఎక్కడో లేదు, మన మనసులోనే ఉంది. ఆ మానసికానందం మన సొంతమైతే జగదానందం పొందినట్లే' అని వేదాంతులు, ఆధ్యాత్మికవాదులు చెప్పే మాటలను సంక్షిప్తంగా 'మన్ ఉజియారా ఛాయా, జగ్ ఉజియారా ఛాయా' అని చెప్పిన మేటి కవి శైలేంద్ర.

**- పి.వి.సత్యనారాయణ రాజు**



నలభై ఏళ్లుగా సినీ పరిశ్రమ
తీరుతెన్నులపై అధ్యయనం
చేసిన రచయిత, జర్నలిస్టు, నటుడు

## రావి కొండలరావు

రాసిన వ్యాసమిది



# దటీజ్ సుబ్బారావు దిసీజ్ మారుతిరావు

కాలం : ఏళ్లక్రితం

స్థలం : విశాఖపట్నంలో ఒక వీధి.

సమయం : ఉదయం.

ఒక మిత్రుడు, నేనూ రోడ్డు పక్కనే నిలుచుని పిచ్చాపాటీ కొట్టుకుంటున్నాం. ఆ మిత్రుణ్ణి పలకరిస్తూ అతని మిత్రుడు అక్కడికొచ్చాడు. సన్నగా రివటలా వున్నాడు. ముఖం కోలగా వుంది. పొడుగ్గా వున్న ముక్కు మాత్రం ముఖంలో ప్రామినెంట్‌గా కనిపిస్తోంది. నేను అదోలా చూసినా, అతను మాత్రం నన్ను అదోలా చూడలేదు. నన్ను పరిచయం చెయ్యగానే నవ్వు మొహంతో చూశాడు.

"మీరు రాసిన 'స్వయంవరం' నాటికలో రఘునాథ్‌షా వేషం వేశాను; వేస్తున్నాను" అన్నాడు బింకంగా నవ్వి. నేను సంతోషం ప్రకటించడానికి చెయ్యి కలిపాను. అతను ఆ మిత్రుడితో రెండు మూడు మాటలు మాట్లాడి వస్తానని చెప్పి వెళ్లిపోయాడు. అతను చదువుకుంటున్నాడని, నాటకాలు వేస్తాడనీ భావికాలంలో మంచి నటుడవుతాడనీ నా మిత్రుడు జోస్యం చెప్పాడు. అయితే, తర్వాత తర్వాత అతనొక జర్నలిస్టు అవుతాడనీ, రేడియోలో ఉన్నత పదవిలో వుంటాడనీ, నాటకాలు, కథలు, నవలలూ రాస్తాడనీ, గొప్ప రచయిత అనిపించుకున్నాక సినిమాలకి కూడా రాస్తాడనీ, దరిమిలా గొప్ప సినిమా యాక్టరు కూడా అవుతాడనీ నా మిత్రుడు జోస్యం చెప్పలేకపోయాడు. చెప్పగలిగివుంటే, ఆ క్షణంలోనే అతన్ని నేను ఆరాధనాభావంతో చూసేవాణ్ణి. అలా చూడకుండా నాటకాల మీద ఉత్సాహం గల ఒక విద్యార్థిని చూసినట్టు చూశాను. ఆ విద్యార్థి గొల్లపూడి మారుతిరావని తెలిసిపోయి వుంటుంది.

సీరియస్ నాటకాలు హాస్యనాటికలూ రాశారు మారుతిరావు. 'కళ్లు' లాంటివీ రాశారు. సినిమా రచయితగా ఎన్నో సినిమాలు.

"ఒక చిన్న పాయింటు ఇస్తే దాన్ని అప్పటికప్పుడే ఓ కథని చేసి డైలాగుల్తో సహా చెప్పగల సత్తా ఉంది ఆయన దగ్గర" అని నిర్మాత పూర్ణచంద్రరావు అన్నారొకసారి. సినిమా రచయితగా అంచెలంచెలుగా ఎదిగినా, స్టార్‌గా, 'స్టావ్‌బ్లాక్'లో ప్రత్యక్షమైనట్టు ఎదగడం ఆయనకే సాధ్యమైంది. ఒక సినిమాతోనే - స్టార్స్ అయినవాళ్లు ఎక్కువ మంది కనిపించరు. ఆ తక్కువ మందిలో ఒకరు గొల్లపూడి. తనలో వున్న రచయితని డామినేట్ చేసింది పాత్ర ధారణ. విలన్ లాంటి పాత్రల్లో కొంత వహ్యం, హాస్యం పాళ్ల లో వున్న దుష్టపాత్రలూ మారుతిరావుని పలకరించాయి; వరించాయి; వర్షించాయి.



'గిరీశం' పాత్రలో

అయితే, మారుతిరావు ఎలాంటి వేషం వేసినా అందులోంచి ఆ విశాఖపట్నం భాషాశైలి తొంగిచూస్తూనే వుంటుంది. "అలాంటప్పుడే సహజంగా వుంటుంది నటన" అంటారాయన.

ఆయన రచయితగా ప్రసిద్ధుడైన తర్వాత కూడా నేను రాసిన "కుక్కపిల్ల దొరికింది" చాలా సార్లు ఆడితే "ఈ నాటిక నేనే రాశాననుకుంటున్నారు అంతా" అన్నారొసారి మారుతిరావు. అంటే, ఆయన అనాటికని అన్నిసార్లు ఆడినట్టు. హాస్యనాటికలు రాసినా, సీరియస్ మనిషే. రిజర్వుడు; నిగర్వుడూ. ఎక్కువగా మాట్లాడే అలవాటు లేదు. మాట అందుకుంటే మాత్రం చాలా కన్విన్సింగ్‌గా తొడకొట్టకపోయినా టేబుల్ మీద కొట్టి చెప్పగల సామర్థ్యం కనిపిస్తుంది ఆయన దగ్గర. మంచి వక్త. అందులో సందేహం లేదు. ఏ సబ్జెక్టు మీదయినా, పాయింటు విరిగిపోకుండా కచ్చితంగా, క్లుప్తంగా మాట్లాడగల నేర్పు మారుతిరావుది. సాధారణంగా సభలకీ, సన్మానాలకీ ఒప్పుకోరు. మాట్లాడ్డానికి ఒప్పుకుంటే మాత్రం మాటదాటరు; మాట దాటించరు. నాటకాలు ప్రాణం. వెయ్యడం మాట ఎలా వున్నా చూడడం. ఏ దేశమేగినా ఎందుకాలిడినా, అక్కడి నాటకాలు చూడడం, విశ్లేషించడం ఆయనకే చేతనవును. అలాగే సినిమాలు. మంచి సినిమాలనిపించుకున్నవి అన్నీ ఆయన దగ్గరున్నాయి.

"ఆ సినిమాలు చూసి మన సినిమాలు రాయాలనుకోవడం పెద్ద పొరపాటు. అవి చూడ్డం వరకే. మనకి సినిమాలు రాయాలంటే మన ప్రేక్షకులు, మన నిర్మాతల్నీ దృష్టిలో పెట్టుకోవాలి. అది ఎకడమిక్ పాయింటయితే, ఇది కమర్షియల్ పాయింటు" అన్నారు మారుతీరావు ఒకసారి.

మొదట్నుంచి మారుతీరావుని చూసినప్పుడల్లా నాకొకటి అనిపించేది. ఆ మొహం, ఆ ముక్కు, ఆ చూపు, మాట్లాడే విధానం అవన్నీ చూస్తుంటే, కన్యాశుల్కం గిరీశానికి సరిగ్గా సరిపోతాడు కాబోలు అని. ఒకటి రెండుసార్లు ఆ మాట అన్నాను కూడా.

"మీరెలా అనుకున్నారు? మహామహులు ఆ వేషం వేశారు గదా, నేనేపాటి?" అన్నారాయన.

ఆ పాత్ర, ఆ పాత్ర చిత్రణ, తీరు చదివిన తర్వాత, గిరీశాన్ని ఊహించుకోవలసిందే. ఆరుద్రగారి వంటి పరిశోధకుడు, బాపుగారి లాంటి పరిశీలకుడూ ఊహించిన గిరీశాన్ని ఊహించుకుంటే మారుతిరావుతో పోలికలు కనిపిస్తాయని నేనన్నాను. సినిమాల్లో ఆయన వేసిన వేషాలు, బాడీ ఫ్లెక్సిబిలిటీ, డైలాగు చెప్పే విధానం, గిరీశానికి ఒప్పుతాయి. దానికి తోడు అప్పారావుగారు రాసిన విశాఖపట్నం, విజయనగరం మాండలికం, యాసా.

"అలాంటి పాత్ర ధరించడానికి పెట్టి పుట్టాలి. వెయ్యగలిగితే, చెయ్యగలిగితే అంతకంటె అదృష్టం ఏముంది?" అన్నారు ఆలోచిస్తూ మారుతిరావు. గిరీశంలో కావలసినంత హ్యూమరుంది. సీరియస్ హ్యూమరు. ఆ హ్యూమరు ఇతనిలో వుంది.

మద్రాసు తెలుగు అకాడమీ ఉగాది ఉత్సవంలో "కన్యాశుల్కంలోని మొదటి సీను వెయ్యండి బావుంటుంది" అన్నాను. "నాకూ మీకూ బావుంటుంది. ఆ నాటకం మీద అధికారం వున్నవాళ్లకీ, ప్రేక్షకులకీ ఎలా వుంటుందో'' అన్నారు. అంతకుముందే ఆరుద్రగారు మారుతిరావు మీద ముద్ర వేశారు. "మీరు పక్కన వుంటే వేస్తాను" అన్నారు నన్ను. నేను పక్కనే వున్నాను. ఆయన స్టేజిమీద నటించారు. ప్రేక్షకులు మెచ్చుకున్నారు. ముఖ్య ప్రేక్షకులుగా కూచున్న అక్కినేని నాగేశ్వరరావు గారు, కె.విశ్వనాథ్‌గారూ అప్పటి కప్పుడే పైకి వచ్చి 'గిరీశాన్ని' అభినందించే సరికి, ధైర్యం వచ్చింది." అన్నారు వినయంగా.

కన్యాశుల్కాన్ని పూర్తిగా టీవీకి చెయ్యాలన్న ఆలోచనకి మరో నాలుగు రెక్కలొచ్చాయి. అంతకుముందు ఆరుద్రగారి పర్యవేక్షణలో చెయ్యాలనుకున్నదే. అప్పుడు కుదరలేదు. విశాఖపట్నంలో మేము అక్కడా అక్కడా సభల్లో కనిపిస్తున్నప్పుడు 'కేబుల్ విజన్' వెంకట్రావుగారు "మీరు ఈ ఊళ్లో వున్నారు. ఏదైనా టీవీకి చెయ్యకూడదా? నేనున్నాను" అన్న మాట మీద 'కన్యాశుల్కం'మాట ఎత్తి ఆయన చేత, అవుననిపించాం. ఇక మొదలైంది పరిశీలన. గిరీశం పాత్ర మీద వచ్చిన పెద్దల వ్యాసాలు, కన్యాశుల్కం మీద వచ్చిన విశ్లేషణలూ అధ్యయనం చెయ్యడం ఆరంభమైంది.

గిరీశం చేస్తున్నప్పుడు- "అబ్బ! ఎంత తృప్తిగా వుంది! ఏం రాశాడండీ మహానుభావుడు! డైలాగు మొదలైతే ప్రవాహంలా వెళిపోతుంది. పురాణ



పాత్రలు వెయ్యడానికి పూర్వజన్మ సుకృతం వుండాలంటారు. అలాగే గిరీశం వెయ్యడానికీ కావాలి. ఆ సుకృతం నాకుంది." అంటూ వుండేవారు - మారుతిరావు.

ఎలక్ట్రిసిటీ, బంగళా పెంకులేని గ్రామాలు, ఇళ్లు కావాలని లొకేషన్ల కోసం తిరిగినప్పుడు ఆయనా వచ్చారు. ఎంత మారుమూలకి వెళ్లినా సిమెంటు రోడ్లు, ఎలక్ట్రిక్ స్తంభాలూ ప్రత్యక్షం. "అప్పారావు గారికి ముందు చూపులేదు'' అన్నారు మారుతీరావు నిశ్శబ్దాన్ని చీలుస్తూ.

"ఏం?"

"ఈ నాటకాన్ని ముందు తరాల వాళ్లు వేస్తే గ్రామాలు అభివృద్ధి అయిపోతే ఏంకాను? అని ఆలోచించలేదు. ఈ విధంగా గ్రామీణాభివృద్ధి అయిందని, ఇంకా అవాలనీ మనం సంతోషించాలా? మనకి కావలసిన నాటి ఇళ్లు దొరకడం లేదని విచారించాలా? బోధపడ్డం లేదే!" అని చమత్కారం చేశారు.

కన్యాశుల్కాన్ని యథాతథంగా తీశాం. అంటే గురజాడ వారు నాటకం ఎలా ఆరంభించారో అలాగే ఆరంభించి, అదే సీనిక్ ఆర్డర్లో - ఒక్క వాక్యం తీసేయకుండా, ఒక వాక్యం గాని మాట గాని కలపకుండా చిత్రీకరించాను. ఆయన అన్నారు : "మీరు నేనూ ఇద్దరం రచయితలమే. అక్కర్లేదనుకుని ఉన్న డైలాగులు తీసేయగలం. మనకి కావలసినట్టు రానుకోగలం. అప్పారావుగారి మీద భక్తితో మనం ఏదీ ముట్టుకోలేదు. ఇంకో రైటర్లయితే ఖచ్చితంగా మార్పులు చేసేసేవారండీ" అని చురక విసిరారు మారుతిరావు ఒక సందర్భంలో - మాడర్న్ రైటర్స్‌ని దృష్టిలో పెట్టుకుని.

గిరీశం చేస్తున్నపుడు పేజీలకొద్దీ వున్న డైలాగులు చెబుతున్నప్పుడూ మారుతిరావు మథన, తపన చెప్పడానికి లేదు. ప్రపంచ భాషల నాటకాల పాత్రలకి దీటుగా నిలిచే గిరీశం పాత్రని సజీవంగా నిలబెట్టాలి కదా! ఏమైనా, నేనో మాట చెప్పగలను. ఎన్నో నాటకాల్లో, సినిమాల్లో ఎన్నో రకాల పాత్రలు ధరించి మారుతిరావు పేరు సంపాయించి ఉండవచ్చు, చప్పట్లు కొట్టించుకునీ ఉండొచ్చు. కాని గిరీశం పాత్రధారణ మాత్రం అన్నింటినీ మించిపోయి కనిపిస్తుంది. ఆ మాటే ఆయనతో అన్నప్పుడు - "ఏ నటుడికైనా ఇలాంటి పాత్ర ఒకటిచాలు, డబ్బు కోసం ఎన్ని వేషాలు వేస్తే యేం గనక" అన్నారు "కన్యాశుల్కం చూసిన తర్వాత ఖచ్చితంగా ఆయన పేరు "మారుతి"ంది. గొల్లపూడి గిరీశం! ■

**అలనాటి ఆణిముత్యాల గురించి**
**నేటి తరానికి అనువైన శైలిలో తెలిపే**

# నవ్వుటద్దాలు

క్లాసిక్స్ రీటోల్డ్

## అల్లుడే అల్లుడు!

**- ఆచార్య తిరుమల**

మానవ సంబంధాల విషయంలో అల్లుళ్ల మీదున్నంత అపకీర్తి మరెవ్వరి మీదాలేదు. అల్లుళ్ల తర్వాత దాయాదులు నిలుస్తారు. అల్లుడంటే-దశమగ్రహం, శని, నల్లి, నల్లత్రాచు అంటూ తిట్టుకున్న వైనం సాహిత్యంలో చాలావుంది.

అల్లుణ్ని దశమ గ్రహమంటూ ఒక కవి-

సదా వక్రః సదా క్రూరః సదా పూజా మపేక్షతే
కన్యారాశి స్థితో నిత్యం జామాతా దశమో గ్రహః!!

అంటూ సంస్కృతంలో చిరాకుపడ్డాడు. మనకి నవగ్రహాలున్నాయి. వాటిలో సూర్యుడు తప్ప మిగిలినవన్నీ అప్పుడప్పుడు వక్రిస్తాయి.




జామాత అంటే అల్లుడు మాత్రం ఎప్పుడు వక్రంగా వుంటాడు. శని గ్రహం కూడా ఒక్కోప్పుడు క్రూరంగాను, ఒక్కోప్పుడు శుభకరం గాను ఉంటుంది - కానీ అల్లుడెప్పుడూ క్రూరుడే. నవగ్రహాలకి నిర్ణీత సమయాల్లో పూజలుంటే అల్లుడు నిత్యపూజను కోరుకుంటాడు. అలాగే యితరగ్రహాలు రాశులు మారుతూ తిరుగుతాయి కానీ అల్లుడెప్పుడూ కన్యారాశి (కూతురు)లోనే వుంటాడు. ఈ విలక్షణతని బట్టి అల్లుడు పదో గ్రహమవుతున్నాడు. అని శ్లోక భావం.

ఒక కవి దశమ గ్రహాన్ని గూర్చి-

**గ్రహము లన్నింటికిని శాంతి కలుగుచుండు**
**జపములం దాన ధర్మాలఁ దపము చేత**
**అల్లుడన్నౌ దశమ గ్రహంబు గాన**
**శాంతిఁ బొందునె యేదాన జపము చేత?**

అని- **"గడ్డిపోచ దెబ్బ కన్య నిచ్చిన యంత**
**నిగిడి గంట మగుచు నిలుచునంట"**అనీ వాపోయాడు. సూరకవి తన రామలింగేశ శతకంలో "ఎరుడనే అల్లుఁ డత్తవారింటి లేమి" అన్నాడు. మహాకవి శ్రీనాథుడు కూడా కాశీఖండంలో-

**పేదలయ్యును గడు బిర్ర బిగిసియుంద్రు**
**వట్టి యభిమానములను గర్వములబట్టి**
**యల్లు వారికి నెల్ల నీ యవగుణంబు**
**వెన్నతో బెట్టినది యింత విసువ నేల?**

అని అల్లుడి తల బిరుసుతనాన్ని ప్రస్తావించాడంటే అల్లుడెంత అభాసుపాలయ్యాడో అర్థమవుతుంది.

అత్యాధునిక పద్యకవి బ్రహ్మం తన సరస్వతీ శతకంలో అల్లుణ్ని మత్కుణం (నల్లి) అంటూ-

వరకట్నంబని మామ నెత్తురును ద్రావంగోరు పైశాచికో
దరు నల్లున్ దశమ గ్రహంబనుట సార్థంబౌను, యోచించినన్
నరరూపాకృతి మత్కుణంబనుటయే న్యాయంబుగా దోచెడిన్
వరగల్ క్షేత్ర సరస్వతీ! భగవతీ! వాగేశ్వరీ! భారతీ!!

అని అల్లుని మీద కసి వెల్లడించాడు.

వరకట్నం మాట వచ్చినప్పుడు కాళ్లకూరి నారాయణరావు గారి 'వర విక్రయం' నాటకాన్ని ప్రస్తావించకపోతే తప్పిదమే అవుతుంది. కాళ్లకూరి ఆ నాటకంలో-

అప్పొసంగిన వాడును, అల్లు, డద్దె
యింటి యజమానుడు, జీతమిచ్చువాడు
కుల వినోదియు, పన్నులు కూర్చువాడు
పుస్తె కట్టని మగలె పో పూరుషులకు!!

అప్పిచ్చినవాడు, అల్లుడు, అద్దింటి యజమాని, జీతమిచ్చేవాడు. కులవినోది, పన్నులేసేవాడు  మగాళ్లకే తాళికట్టని మొగుళ్లుట! వీళ్లల్లో అల్లుళ్లు పెట్టే బాధలెలా వుంటాయంటే-

నీటైన యింగ్లీషు మోటారు సైకిలు
కొనిపెట్ట వలెనను కూళయొకడు
రిష్టువాచియు, గోల్డు రింగును, బూట్సును
సూట్లు గావలెనను శుంఠయొకడు
బియ్యే బియల్ వరకయ్యేడు ఖర్చు భరింప
వలెనను దరిద్రుడొకడు
భార్యతోడను చెన్న పట్టణంబున నుంచి
చదివించవలెనను చవటయొకడు
సీమ చదువులు చాల సింపులు నన్నట
కంపవలయు ననెడి యజ్ఞుడొకడు
ఇట్లు కొసరు క్రింద నిష్టార్థముల్ వరుల్
దెలుపుచున్నవారు తెల్లముగను!!

కట్నకానుకల రూపంలో అల్లుళ్ల కోరికలిలా వుంటాయి. "ఆడపడుచుల, నల్లుర, నాటకత్తియల నెవండేని తనియింపగలడె?" అంటూ-

అప్పిడినవాని నధికారి నతిశయించి
అల్లు రొందించు బాధల నెల్లగాంచి
అడలి నిజముగా హరిహరులంతవారు
కూతులం గంటయె మానుకొన్నవారు!!

అల్లుళ్ల తడాకా చూసి హడలెత్తిపోయి శివకేశవులంతవారే నిజంగా కూతుళ్లని కనటం మానుకున్నారని చమత్కరించాడు.

వెలయాలు, శిశువు, అల్లుడు
నిలయేలిక, యాచకుండు నేగురు ధరలో
కలిమియు లేమియు దలపరు
కలియుగమున కీర్తికామ! కాటయ వేమా!!

అని ఒక చాటువు వుంది. అవతల వారికి ఉందా లేదా అని ఆలోచించకుండా వేశ్య, శిశువు, అల్లుడు, ప్రభువు, ముష్టివాడు అనే ఐదుగురూ ఏదోటి అడుగుతూనే వుంటారట- ఆశించటం,అడగటం వాళ్ల జన్మహక్కయినట్టు! ఈ జాబితాలో మిగిలినవాళ్ల సంగతి ఫర్వాలేదు అల్లుడి విషయంలో మామగారు లేదంటే ఏమైపోవాలి?!? 'కలి విడంబన' శతకంలో ఇటువంటి జాబితాతో ఓ శ్లోకముంది చూడండి:

జామాతరో భాగినేయా - మాతులా దారబాంధవాః
అజ్ఞాతా ఏవ గృహిణాం - భక్షయం త్యాఖువత్ గృహే!!

అంటే అల్లుళ్లు, బావమరదులు, మేనమామలు, భార్యవైపు చుట్టాలు తెలియకుండానే ఎలుకల్లా ఇంటి యజమాని సంపాదన తినేస్తూవుంటారని భావం.

అల్లుళ్ల దెబ్బకి తట్టుకోలేక కాబోలు తమ అంత్యదశలో జీవితాన్ని సమీక్షించుకుంటూ ఆసూరి మరింగంటి నరసింహాచార్యులు గారు- "పెద్దల్లుండొక నల్లత్రాచు ప్రియమౌ పెండ్లాము నా పోలికే
జిద్దూఖోరయె, కన్నతల్లెపుడు నా చేటే నిరీక్షించు-"అని బాధపడ్డారు.

పోలిపెద్ది వేంకటరాయ కవి తన వేణుగోపాల శతకంలో "అబ్బ మేలోర్చలేనట్టి వాడైనను, మోహంబుగల తల్లి మూగదైన, ఆలు రాకాసైన, అల్లుడనాథైన, కూతురు పెనురంకు పోతుదైన" సంసారం విడిచి సన్యసించటం మంచిదంటాడు. అంటే సన్యాసానికి అల్లుడు కూడా కారణం కాగలడని ఆంతర్యం.

అల్లుని మంచితనంబును
గొల్లని సాహిత్య విద్య కోమలి నిజమున్
పొల్లున దంచిన బియ్యము
తెల్లని కాకులును లేవు తెలియర సుమతీ!!

సుమతీ శతకంలో బద్దెనకవి తెల్లని కాకులు లేనట్టే అల్లుని మంచితనం కూడా వుండదని తీవ్రంగానే తీర్మానం చేశాడు. ఇటువంటి పద్యాలకి కవి కాలాన్ని, సంఘాన్ని, స్వభావాన్ని బట్టి విలువను గుర్తించివలసి వుంటుందని వేరే చెప్పవలసిన పని లేదనుకుంటాను.

అల్లుడికి మామగారిల్లు స్వర్గంలాంటిదైనా ఎలావుంటే ఏమవుతుందో యీ శ్లోకం తెల్పుతూ వుంది చూడండి:-

శ్వశుర గృహ నివాసః స్వర్గతుల్యో నరాణాం
యది భవతి వివేకః పంచభి షడ్ దినై ర్వా
దధి మధు ఘృతలోపో మాసమేకం నరాణాం
తదుపరి దినమేకం పాదరక్ష ప్రయోగః!!

స్వర్గం లాంటి మామగారింట్లో అల్లుడు ఐదారు రోజులు కంటె ఎక్కువ వుంటే క్రమంగా పాలు, పెరుగు, నెయ్యి, స్వీట్లు మాయమైపోతాయి.

నెల్లాళ్లు దాటితే చెప్పుదెబ్బలు తప్పవని భావం. సంస్కృతంలో 'కిరాతార్జునీయ' మనే నాటకాన్ని రాసిన మహాకవి భారవి చిన్ననాటి జీవితం ఈ శ్లోక భావం లాగే వుంటుంది.

అల్లుణ్ని మెచ్చుకుంటూనే అల్లుడిచేత ఏ పనులు చేయించవచ్చునో ఒక కవి యిలా చెప్తున్నాడు చూడండి:

అల్లుడు బహుమానస్తుడు
అల్లునకొక పనియు చెప్పనైనం గానీ
చెల్లును మూడు పనులకై
ఇల్లలుకను, పేడచేయ, నెంగిళ్లెత్తన్!!

ఎంత వాళ్లు మండకపోతే ఇలా ఇల్లలికి, పేడచేసి, ఎంగిళ్లెత్తటానికి అల్లుణ్ని వాడుకోవచ్చంటాడు చెప్పండి? ఇటువంటి పద్యాల్ని పల్లెటూరి మామ-అల్లుళ్ల సరదాలుగా భావించవచ్చు.

అవధానాల్లో సమస్యా పూరణలుంటాయి. ఒకసారి ఒక సభలో కరుణశ్రీ జంధ్యాల పాపయ్యశాస్త్రి గారికి ఒక పృచ్ఛకుడు "భామయు భామయున్ గలియ బాలుడు పుట్టెను సత్యభామకున్" అనే సమస్య యిస్తే ఆయన దాన్నెంత రసరమ్యంగా పూరించారో చూడండి:-

శ్రీమతి లేఖ పంపినది, చేయడు కార్యము మామ, తా నట
గ్రామణియైన యల్లుఁ డొక రాతిరి చెల్మికత్తెయై
మామ గృహంబుజేరి తన మానిని గూడెను ఆ యసత్యపుం
భామయు భామయున్ గలియ బాలుడు పుట్టెను సత్యభామకున్!!

నటుడైన అల్లుడు చెలికత్తె వేషంలో వచ్చి భార్యను కూడితే బాలుడు పుట్టాడని భావం. ఇందులో పుంభామ, సత్యభామ శబ్దాలకు మొగుడూ - పెళ్లామని అర్థం.

మహావధానులు శ్రీ మిన్నికంటి గురునాథ శర్మ గారు ఒకానొక సభలో తమ కిచ్చిన "అల్లుడనయ్యెదన్ మగడనయ్యెద నే మనుమండనయ్యెదన్" అనే సమస్యని-

ఎల్లసురల్ వినంగ హరి యిట్లనె- భూసుత సీతబొందితిన్
నీళ్లను మున్గినట్టి ధరణీ సతిఁ గౌగిట గ్రుచ్చి యెత్తితిన్
తల్లికి తల్లియౌ సతి నెదన్ ధరియించితిగాన భూమికిన్
అల్లుడ నయ్యేదన్ మగడ నయ్యెద నే మనుమండ నయ్యేదన్!!

అని మనోహరంగా పూరించారు. రామావతారంలో భూసుత సీతకు భర్త కాబట్టి భూమికి విష్ణువు అల్లుడు. వరాహావతారంలో హిరణ్యాక్షుని చంపి ప్రళయ సముద్ర జలాలనుండి భూమిని తన కోరలతో పట్టి ఉద్ధరించటం చేత భూమికి మగడు. విష్ణు పాదాల నుండి పుట్టిన గంగ విష్ణువుకే కాదు భూమికి కూడా కూతురే, గంగ సముద్రునికి భార్య కాబట్టి సముద్రం నుండి పుట్టిన లక్ష్మికి తల్లి కాబట్టి భూమికి మనమరాలు. మనమరాలి భర్త కాబట్టి భూమికి విష్ణువు మనవడు. అంటే విష్ణువు భూమికి- భూమిని బట్టి అల్లుడు, సీతను బట్టి మగడు, లక్ష్మిని బట్టి మనవడు అవుతున్నాడని భావం. అవధానాల్లో అల్లుళ్లిలా వుంటారు.

భోగరాజు నారాయణమూర్తి గారు తమ 'పండుగకట్నం' కావ్యంలో సూర్యునిలో అల్లుణ్ని చూపించారు. చూడండి:

అగల యత్తవారు తొలి చెప్పిన రీతిని కట్నమీయమిన్
జేగురుమోముతో నలిగి చివ్వున నేగెడు కొత్త యల్లుడో
నాగ, నిజారుణ ప్రభలనంతముగా దిశలన్ వెలుంగ దా
నేగె దివాకరుండు జగమెల్ల దమంబున దుస్తమమ్ముగాన్!!

అత్తారు, చెప్పిన కట్న మియ్యలేదని కొత్తల్లుడు, చీకట్లు మిగిల్చి వెళ్లే సూర్యునిలా, మొహం ఎర్రగా చేసుకుని వెళ్లిపోయాడట! అంత దురుసుతనంతో ఏం సాధించాలనో! పాపం!

అల్లుడు - సమాజంలోను, సాహిత్యంలోను ఇంత భ్రష్టుపట్టటానికి, అపకీర్తి పొందటానికి కేవలం అతని స్వభావమే కారణం కాదు. అతన్ని కనిపెంచిన తల్లిదండ్రుల స్వార్థం, దురాశలు, అక్కాచెల్లెళ్ల అసూయలు, అవివేకాలు, అసంతృప్తులు, రాక్షసానందాలూ, తన నిస్సహాయత, అస్వతంత్రత, తెచ్చిపెట్టుకున్న పౌరుషం - వంటి యెన్నెన్నో అవలక్షణాలు కూడా కారణాలవుతాయనుకుంటున్నాను. కాళ్లు కడిగి కన్యాదానం చేసిన మామగారు, కన్న కొడుకుకంటె ఎక్కువగా చూసుకునే అత్తగారు శత్రువులనుకుని వారికి మనస్తాపాన్ని కలిగించే అల్లుడు, మామ హోదాలో తానెలా వుంటాడో కూడా ఊహించుకుని జాగ్రత్తపడటం మంచిది.

కన్నతల్లిలోనే పిల్లా - పిల్లాళ్ల మధ్య వ్యత్యాసం కనిపిస్తుంది.

పిల్లవానిని గని విర్ర వీగెడు తల్లి
పిల్లను గని వినయ వల్లియగును!!

అని నేనో చోట రాశాను. పిల్లాడో, పిల్లదో - ఏదో వీళ్లనుకుంటేనే పుట్టినట్టు బడాయిలు. తల్లిదండ్రుల మిడిసిపాటు, అవివేకాలతో పిల్లల బతుకులు భ్రష్టుపడుతున్నాయి.

ఏది యెలావున్నా, ప్రాచీన కాలం అల్లుళ్ల కంటె ఆధునిక అల్లుళ్లు చాలా మెరుగు. చదువుల వల్ల, లోకజ్ఞానం వల్ల చాలా సడలింపులొచ్చాయి కానీ యెంత నిషేధించినా కట్నకానుకల విషయంలో ఇంకా మూర్ఖ వ్యాపార ధోరణే సాగుతూవుండటం వల్ల, హృదయ పూర్వక బాంధవ్యాలు కనిపించటంలేదు.

అత్తారింట ఆత్మబంధువుగా అల్లుకుపోయేవాడే అల్లుడు. అతడు అత్తమామలకి చట్టబద్ధమైన కొడుకు. Lawfully Son కాబట్టి Son - in - law అవుతున్నాడు. ఆ విధానం తారుమారైతే అల్లుడు దశమ గ్రహమో, శనో, నల్లో, నల్లత్రాచో ఏదోలా కనిపించక తప్పదు. అలా ఇతరులు భావించటంలో తప్పులేదు.

చివరగా రెండు జోకుల్తో యీ వ్యాసం ముగిస్తాను. "అల్లుడూ! అమ్మాయిని గారాబంగా పెంచాను. నీ చేతుల్లో పెడుతున్నాను. పువ్వుల్లో పెట్టి చూసుకో" అని మామగారనగానే ఆ అల్లుడు చిరునవ్వు నవ్వి-"అలాగే మావగారూ! రెండెకరాలు రాసివ్వండి పూలతోట వేయిస్తాను" అన్నాడట.

ఓ పెద్దమనిషి దిగులుగా వుండటం చూసి ఆయన స్నేహితుడొకడు- "అలా దిగులుగా వున్నావేం? ఈ మధ్యనేగా అమ్మాయి పెళ్లి చేసేశావ్?" అని అడిగాడు.

"ఏం చెప్పను. మా అల్లుడికి పేకాట్టం రాదు, త్రాగటం రాదు."

"మంచిదేగా! దిగులెందుకు?"

"ఏం మంచి? సరిగ్గా పేకాట్టం రాదు.

ఎంతవరకు తాగచ్చో తెలీదు." అని ఉస్సురు మనగానే స్నేహితుడు నోరెల్లబెట్టాడు.

ఇదంతా అల్లుడి మీద పద్యాల అల్లుడే అల్లుడు! అల్లుళ్లూ! ఆలోచించండి!

**మార్కెట్లో ఉన్న కొత్త క్యాసెట్లు**




విడుదల : హెచ్.ఎం.వి.
వెల : రూ|| 40/-




విడుదల : హెచ్.ఎం.వి.
వెల : రూ|| 45/-

# తెలుగు సినీ గీతకోసం

| నెం. | పాట | చిత్రం పేరు | సం॥ | సంగీత దర్శకుడు | రచన | గానం |
|---|---|---|---|---|---|---|
| 244 | అల వైకుంఠపురంబులో | భక్తపోతన (గుమ్మడి) | 1966 | ఎస్.రాజేశ్వరరావు | బమ్మెర పోతన | పి.బి.శ్రీనివాస్ |
| 245 | అంబా నవాంబుజో జ్వాలా | భక్తపోతన (గుమ్మడి) | 1966 | ఎస్.రాజేశ్వరరావు | బమ్మెర పోతన | పి.బి.శ్రీనివాస్ |
| 246 | అమ్మా సీతమ్మా | భక్తపోతన (గుమ్మడి) | 1966 | ఎస్.రాజేశ్వరరావు | సీ॥ సముద్రాల | పి.లీల |
| 247 | అందెలు పలికెనులే | భక్తపోతన (గుమ్మడి) | 1966 | ఎస్.రాజేశ్వరరావు | సి.నారాయణరెడ్డి | ఎస్.జానకి |
| 248 | బాల రసాల సాల | భక్తపోతన (గుమ్మడి) | 1966 | ఎస్.రాజేశ్వరరావు | బమ్మెర పోతన | బాలమురళీ కృష్ణ |
| 249 | దీనార టంకాల్ | భక్తపోతన (గుమ్మడి) | 1966 | ఎస్.రాజేశ్వరరావు | శ్రీనాధుడు | ఘంటసాల |
| 250 | ఘన యమునా నదీ (పద్యం) | భక్తపోతన (గుమ్మడి) | 1966 | ఎస్.రాజేశ్వరరావు | శ్రీనాధుడు | ఘంటసాల |
| 251 | జన నాదోత్తమా | భక్తపోతన (గుమ్మడి) | 1966 | ఎస్.రాజేశ్వరరావు | శ్రీనాధుడు | ఘంటసాల |
| 252 | జయము జయము మనకు | భక్తపోతన (గుమ్మడి) | 1966 | ఎస్.రాజేశ్వరరావు | కొసరాజు | పి.బి.శ్రీనివాస్ |
| 253 | జ్యోతి భారతి (పద్యం) | భక్తపోతన (గుమ్మడి) | 1966 | ఎస్.రాజేశ్వరరావు | శ్రీనాధుడు | ఘంటసాల |
| 254 | కార్తీక దీపమై | భక్తపోతన (గుమ్మడి) | 1966 | ఎస్.రాజేశ్వరరావు | ఆరుద్ర | సుశీల |
| 255 | కాశీక విశ్వేసు (పద్యం) | భక్తపోతన (గుమ్మడి) | 1966 | ఎస్.రాజేశ్వరరావు | శ్రీనాధుడు | ఘంటసాల |
| 256 | కాటుక కంటి నీరు | భక్తపోతన (గుమ్మడి) | 1966 | ఎస్.రాజేశ్వరరావు | బమ్మెర పోతన | పి.బి.శ్రీనివాస్ |
| 257 | కవిరాజా కాంతంబు (పద్యం) | భక్తపోతన (గుమ్మడి) | 1966 | ఎస్.రాజేశ్వరరావు | శ్రీనాధుడు | ఘంటసాల |
| 258 | కుళ్ళాయుంచితి (పద్యం) | భక్తపోతన (గుమ్మడి) | 1966 | ఎస్.రాజేశ్వరరావు | శ్రీనాధుడు | ఘంటసాల |
| 259 | నగ రాజకన్య | భక్తపోతన (గుమ్మడి) | 1966 | ఎస్.రాజేశ్వరరావు | ఆరుద్ర | ఘంటసాల, సుశీల |
| 260 | నీ దయ రాదా నిరుపమ రామా | భక్తపోతన (గుమ్మడి) | 1966 | ఎస్.రాజేశ్వరరావు | జూ॥ సముద్రాల | పి.బి.శ్రీనివాస్ |
| 261 | పలికెడిది భాగవతమట | భక్తపోతన (గుమ్మడి) | 1966 | ఎస్.రాజేశ్వరరావు | బమ్మెర పోతన | పి.బి.శ్రీనివాస్ |
| 262 | పట్టి విడువ రాదు | భక్తపోతన (గుమ్మడి) | 1966 | ఎస్.రాజేశ్వరరావు | సముద్రాల | పి.బి.శ్రీనివాస్ |
| 263 | రారా శతకోటి మన్మధాకారా | భక్తపోతన (గుమ్మడి) | 1966 | ఎస్.రాజేశ్వరరావు | సముద్రాల | సుశీల |
| 264 | శారద నీరదేందు (పద్యం) | భక్తపోతన (గుమ్మడి) | 1966 | ఎస్.రాజేశ్వరరావు | బమ్మెర పోతన | పి.బి.శ్రీనివాస్ |
| 265 | సర్వ మంగళ నామ | భక్తపోతన (గుమ్మడి) | 1966 | ఎస్.రాజేశ్వరరావు | సీ॥ సముద్రాల | పి.బి.శ్రీనివాస్ |
| 266 | సర్వజ్ఞ నామధేయ | భక్తపోతన (గుమ్మడి) | 1966 | ఎస్.రాజేశ్వరరావు | శ్రీనాధుడు | ఘంటసాల |
| 267 | శ్రావణ మేఘాలు కూరిమి భావాలు | భక్తపోతన (గుమ్మడి) | 1966 | ఎస్.రాజేశ్వరరావు | ఆరుద్ర | సుశీల |
| 268 | శ్రీ కైవల్య పదంబు (పద్యం) | భక్తపోతన (గుమ్మడి) | 1966 | ఎస్.రాజేశ్వరరావు | బమ్మెర పోతన | పి.బి.శ్రీనివాస్ |
| 269 | శ్రీ మన్మహా మంగళాకారా | భక్తపోతన (గుమ్మడి) | 1966 | ఎస్.రాజేశ్వరరావు | బమ్మెర పోతన | పి.బి.శ్రీనివాస్ |
| 270 | ఘనా ఘన సుందరా | భక్త తుకారాం | 1973 | పి.ఆదినారాయణరావు | దేవులపల్లి | ఘంటసాల |
| 271 | కలియుగం కలియుగం | భక్త తుకారాం | 1973 | పి.ఆదినారాయణరావు | ఆత్రేయ | ఎస్.పి.బాలు, బృందం |
| 272 | మాలక్ష్మి వచ్చింది | భక్త తుకారాం | 1973 | పి.ఆదినారాయణరావు | వీటూరి | సుశీల |
| 273 | మనసున నీవే నిలచిన వేళ | భక్త తుకారాం | 1973 | పి.ఆదినారాయణరావు | దాశరథి | రామకృష్ణ |
| 274 | భలే భలే అందాలు | భక్త తుకారాం | 1973 | పి.ఆదినారాయణరావు | వీటూరి | ఘంటసాల |
| 275 | వేయకురా చిందులు | భక్త తుకారాం | 1973 | పి.ఆదినారాయణరావు | వీటూరి | ఘంటసాల |
| 267 | కరుణామయా దేవా | భక్త తుకారాం | 1973 | పి.ఆదినారాయణరావు | దాశరథి | రామకృష్ణ |
| 268 | పాండురంగ నామం | భక్త తుకారాం | 1973 | పి.ఆదినారాయణరావు | వీటూరి | రామకృష్ణ |
| 269 | పిలుపు వినగలేవా | భక్త తుకారాం | 1973 | పి.ఆదినారాయణరావు | దాశరథి | రామకృష్ణ |
| 270 | పూజకు వేళాయేరా | భక్త తుకారాం | 1973 | పి.ఆదినారాయణరావు | సి.నారాయణరెడ్డి | సుశీల |
| 271 | సరి సరి వగలు తెలిసెరా | భక్త తుకారాం | 1973 | పి.ఆదినారాయణరావు | సి.నారాయణరెడ్డి | సుశీల |
| 272 | శ్యామ సుందరా ప్రేమ మందిరా | భక్త తుకారాం | 1973 | పి.ఆదినారాయణరావు | దాశరథి | రామకృష్ణ |
| 273 | ఉన్నావా అసలున్నావా | భక్త తుకారాం | 1973 | పి.ఆదినారాయణరావు | ఆత్రేయ | ఘంటసాల |
| 274 | పరమయోగులు చూడని | భక్త తుకారాం | 1973 | పి.ఆదినారాయణరావు | వీటూరి | రామకృష్ణ |
| 275 | రంగని సేవ జేయుచు | భక్త తుకారాం | 1973 | పి.ఆదినారాయణరావు | వీటూరి | ఘంటసాల |

# తెలుగు సినీ గీతకోసం

| నెం. | పాట | చిత్రం పేరు | సం॥ | సంగీత దర్శకుడు | రచన | గానం |
|---|---|---|---|---|---|---|
| 276 | వనిత కవితయు వలచి రావలగాని | భక్త తుకారాం | 1973 | పి.ఆదినారాయణరావు | వీటూరి | ఘంటసాల |
| 277 | వన్నె తరుగని వజ్రాలు | భక్త తుకారాం | 1973 | పి.ఆదినారాయణరావు | వీటూరి | ఘంటసాల |
| 278 | గాత్రము కల్గెనేని | భక్త తుకారాం | 1973 | పి.ఆదినారాయణరావు | వీటూరి | ఘంటసాల |
| 279 | అందమంతా | భలేబావ | 1957 | ఎస్.దక్షిణామూర్తి | ఆనిసెట్టి | ఘంటసాల |
| 280 | చిదిమిన పొల్గరు (పద్యం) | భలేబావ | 1957 | ఎస్.దక్షిణామూర్తి | From పాదుక | ఘంటసాల |
| 281 | హై చిన్నదానా | భలేబావ | 1957 | ఎస్.దక్షిణామూర్తి | గోరా శర్మ | పిఠాపురం, సత్యవతి |
| 282 | జీవితం జీవితం | భలేబావ | 1957 | ఎస్.దక్షిణామూర్తి | ఆనిసెట్టి | జిక్కి |
| 283 | కడుపు చూస్తే జానెడు | భలేబావ | 1957 | ఎస్.దక్షిణామూర్తి | గోరా శర్మ | సుసర్ల దక్షిణామూర్తి |
| 284 | నా అందాల రాణి నీవేగా | భలేబావ | 1957 | ఎస్.దక్షిణామూర్తి | ఆనిసెట్టి | ఘంటసాల, పి.సుశీల |
| 285 | కలల బాల కదలిరావా | భలేబావ | 1957 | ఎస్.దక్షిణామూర్తి | ఆనిసెట్టి | పిఠాపురం, పి.సుశీల |
| 286 | నా నోముల ఫలమేమో | భలేబావ | 1957 | ఎస్.దక్షిణామూర్తి | ఆనిసెట్టి | పిఠాపురం, పి.లీల, సత్యవతి |
| 287 | ఓ బావయ్యో | భలేబావ | 1957 | ఎస్.దక్షిణామూర్తి | గోరా శర్మ | జిక్కి |
| 288 | ఓ సాయిబాబా ప్రభో | భలేబావ | 1957 | ఎస్.దక్షిణామూర్తి | - | పి.లీల |
| 289 | శ్రీ జానకి వనవాస చరిత్ర | భలేబావ | 1957 | ఎస్.దక్షిణామూర్తి | ఎమ్.డి.నాజర్ (గుంటూరు) | గుంటూరు నాజర్ |
| 290 | అందమైన చిన్నవాడు | భలే దొంగలు | 1976 | సత్యం | ఆరుద్ర | ఎస్.పి.బాలు, సుశీల |
| 291 | చూసానే ఓ లక్ష్మి | భలే దొంగలు | 1976 | సత్యం | దాశరథి | ఎస్.పి.బాలు, సుశీల |
| 292 | పండంటి చిన్నదిరా | భలే దొంగలు | 1976 | సత్యం | కొసరాజు | ఎస్.పి.బాలు, బృందం |
| 293 | రెక్కల కష్టం చెయ్యండి | భలే దొంగలు | 1976 | సత్యం | గోపి | ఎస్.పి.బాలు, సుశీల, బృందం |
| 394 | వచ్చాడు చూడు వరసైన వాడు | భలే దొంగలు | 1976 | సత్యం | ఆరుద్ర | ఎస్.పి.బాలు, సుశీల, బృందం |
| 395 | మనిషి తలుచుకుంటే | భలే మొనగాడు | 1968 | ఎస్.పి.కోదండపాణి | సి.నారాయణరెడ్డి | ఘంటసాల |
| 396 | కవ్వించే తారా జువ్వను లేలేరా | భలే మొనగాడు | 1968 | ఎస్.పి.కోదండపాణి | సి.నారాయణరెడ్డి | సుశీల. జిక్కి |
| 397 | సిన్నదాన్నిరా | భలే మొనగాడు | 1968 | ఎస్.పి.కోదండపాణి | దాశరథి | సుశీల |
| 398 | ఏ ఊరు నీ పయనం | భలే మొనగాడు | 1968 | ఎస్.పి.కోదండపాణి | ఆరుద్ర | ఘంటసాల, సుశీల |
| 399 | ఏలుకోను రాజు | భలే మొనగాడు | 1968 | ఎస్.పి.కోదండపాణి | దాశరథి | సుశీల, బృందం |
| 300 | యింద యింద తీసుకో | భలే మొనగాడు | 1968 | ఎస్.పి.కోదండపాణి | ఆరుద్ర | సుశీల |
| 301 | భారతంలో మన భారతంలో | భారతంలో ఒక అమ్మాయి | 1975 | ఎస్.రాజేశ్వరరావు | శ్రీశ్రీ | వాణిజయరాం, కోరస్ |
| 302 | చీకటైతే భలే సరదా | భారతంలో ఒక అమ్మాయి | 1975 | ఎస్.రాజేశ్వరరావు | సి.నారాయణరెడ్డి | ఎస్.పి.బాలు, ఎస్.జానకి |
| 303 | గాలిలో గాలినై ఉన్నాను | భారతంలో ఒక అమ్మాయి | 1975 | ఎస్.రాజేశ్వరరావు | ఆరుద్ర | వాణిజయరాం |
| 304 | మాయదారి మగాళ్లు | భారతంలో ఒక అమ్మాయి | 1975 | ఎస్.రాజేశ్వరరావు | కొసరాజు | ఎస్.పి.బాలు, ఎల్.ఆర్.ఈశ్వరి |
| 305 | నిన్ను ఏనాడు ప్రేమించలేను | భారతంలో ఒక అమ్మాయి | 1975 | ఎస్.రాజేశ్వరరావు | ఆరుద్ర | ఎస్.పి.బాలు |
| 306 | జోరుగా హుషారుగా | భార్యాభర్తలు | 1961 | ఎస్.రాజేశ్వరరావు | శ్రీశ్రీ | ఘంటసాల |
| 307 | మధురం మధురం ఈ సమయం | భార్యాభర్తలు | 1961 | ఎస్.రాజేశ్వరరావు | శ్రీశ్రీ | ఘంటసాల, సుశీల |
| 308 | చూచి చూచి కనులు | భార్యాభర్తలు | 1961 | ఎస్.రాజేశ్వరరావు | కొసరాజు | ఘంటసాల, జిక్కి |
| 309 | కనకమా చిట్టి కనకమా | భార్యాభర్తలు | 1961 | ఎస్.రాజేశ్వరరావు | కొసరాజు | సత్యం, స్వర్ణలత |
| 310 | ఓ సుకుమారా | భార్యాభర్తలు | 1961 | ఘంటసాల | శ్రీశ్రీ | ఘంటసాల, సుశీల |
| 311 | రంగ రంగేళి సుఖాలను తేలి | భార్యాభర్తలు | 1961 | ఎస్.రాజేశ్వరరావు | ఆరుద్ర | సుశీల |
| 312 | విరటుని రాణి వాసమున (పద్యం) | భార్యాభర్తలు | 1961 | ఎస్.రాజేశ్వరరావు | శ్రీశ్రీ | సుశీల |
| 313 | ఏమని పాడెదనో | భార్యాభర్తలు | 1961 | ఎస్.రాజేశ్వరరావు | శ్రీశ్రీ | సుశీల |

**సేకరణ: పున్నమరాజు శేషగిరిరావు, విశాఖపట్నం.**

వచ్చే సంచికలో మరికొన్ని

# అంతేరా... బామ్మర్ది

ఆదివిష్ణు



**భా**గ్యనగరం!

భాగ్యనగరం అనగానే ఆ నగరంలో బతికే వాళ్లంతా భాగ్యవంతులనుకోవడం పొరపాటు! పేరుకది భాగ్యనగరమే గాని- అది భాగ్యవంతులు మాత్రమే వుంటున్న నగరం కాదు.

ఆ నగరానికి భాగ్యనగరమని పేరొచ్చిన కారణం వేరేవుంది. అది ఈ కథకి అప్రస్తుతం.. వదిలేయండి!

భాగ్యనగరంలో కొందరు భాగ్యవంతులు కూడా వున్నారు!

వాళ్లల్లో ఒకానొక మనిషి పేరు బసవరాజు!

బసవరాజు చెప్పుకోతగ్గ పారిశ్రామికవేత్త!

బసవరాజు టైర్సు, బసవరాజు ట్యూబ్స్, బసవరాజు టైర్సుండ్ ట్యూబ్స్‌కి - రాష్ట్రంలోనే గాకుండా పొరుగు రాష్ట్రాల్లో కూడా మంచి గిరాకీ వుంది!

ఆ గిరాకీ ప్రభావంతోనే బసవరాజు చాలా బరువుగా వుంటాడు!

హైదరాబాద్ చివర్లో అతనికి ఒక అందమైన బంగళా వుంది. ఆ బంగళా కూడా ఎంతో ఖరీదుగానూ మరెంతో అందంగాను వుంటుంది! చాలా విశాలంగా కూడా వుండి అబ్బో అనిపిస్తుంది!

ఆ ఉదయం-

బసవరాజు తన గదిలో ముస్తాబు చేసుకుంటుండగా అతనికి పద్మ కాఫీ తెచ్చింది.

పద్మను చూస్తూ బసవరాజు అన్నాడు-

"ఏమ్మా? కాఫీ నువ్వు తెచ్చేవే? మీ అత్తయ్య ఏం చేస్తోంది?"

ఆమె కాఫీ యిస్తూ అన్నది-

"అత్తగారు పూజలో వున్నారండి!"

బసవరాజు కాఫీ చప్పరించి అన్నాడు-

"పతియే ప్రత్యక్ష దైవమన్నారు! ఈ పతి దేవుడ్ని గాలికొదిలేసి ఏ రాతి దేవుడ్ని కొలుస్తుందో?"

"అత్తమామలు కూడా దైవ స్వరూపులే కదా మావయ్య గారూ?"

"అవునమ్మా! సాక్షాత్తూ దేవుళ్లే! బాగా జ్ఞాపకం పెట్టుకో!"

"అంచేత - ప్రతిరోజూ మీకు కాఫీ యిచ్చే అవకాశం నాకివ్వమని అత్తగారిని నేనే కోరుకున్నానండి!"

ఆ మాటకి బసవరాజు మురిసిపోయేడు. మురిసిపోతూనే అన్నాడు-

"సెభాష్! మీ నాన్నకంటె నువ్వే బెటరు! మంచీ మర్యాదా బాగా తెలిసిన పిల్లవి. కోడలంటే నీలాగా వుండాలి. అత్తమీద ఈగ వాలకుండా జాగ్రత్త పడుతున్నావ్! ఇప్పుడే కాదు - ఇక ముందు కూడా - నా కాఫీ ఏర్పాట్లు నువ్వే చూడు!"

సరిగ్గా అప్పుడే-

ఆ గదిలోకి డాక్టర్ మురళి వచ్చేడు. వచ్చి బసవరాజుతో అన్నాడు-

"హాస్పిటల్‌కి వేళయింది నాన్నా!"

"నీ హాస్పిటల్‌కి టైమైతే నాతో ఎందుకు చెప్పడం? నాకు చెప్పకుండానే వెళ్ళచ్చు!"

డాక్టర్ మురళి పద్మతో అన్నాడు-

"ఒకసారి యిల్లా వస్తావా?"

"ఇప్పుడు ఆ పిల్లెందుకురా? నీ కారు డ్రైవ్ చేయాలా?"

"అలాంటిదే!" అన్నాడు డాక్టర్ మురళి నసుగుతూ!

"నీ భార్యకి డ్రైవింగు రాదు!"

"అల్లాంటిదే అన్నాను గానీ - డ్రైవ్ చేయమనలేదుగా!"

బసవరాజు పద్మతో విసుగ్గా అన్నాడు-

"ఏమిటమ్మా వీడు? నన్ను కన్ఫ్యూజ్ చేస్తాడేమిటి? నన్నే యింత కన్ఫ్యూజ్ చేస్తున్నవాడు - నిన్ను నీళ్లు కూడా తాగనివ్వడు కాబోలు!"

"మనీ పర్సు అడుగుతున్నారండి!" అంది పద్మ.

"ఓహో! మనీపర్సా! అలాంటిదే అంటె మనీ పర్సన్నమాట! మంచి కోడే! అవునొరేయ్ మురళీ! మనీపర్సు నీదగ్గరించుకోవా?"

పద్మ నసిగింది-

"నా దగ్గర దాచుకుంటారండి!"

"వామ్మో! అదొకటుందా? అయితే వెళ్లమ్మా! ఆ పర్సు పనేదో చూడు! మగాడి జేబులో పర్సు లేకపోతే - పల్సు పనిచేయదని శాస్త్రం! వెళ్లెళ్లు!"

పద్మ ఆ గదిలోంచి వెళ్లిపోయింది. మురళి కూడా వెళ్లబోయేడు. అతన్ని ఆపే ప్రయత్నంలో బసవరాజు అతన్ని పలకరించాడు-

"ఒరే మురళీ! కొంచెం ఆగు!"

మురళి ఆగిపోయేడు. బసవరాజు మురళి దగ్గరకొచ్చి అన్నాడు

"నీతో ఒక జీవిత సత్యం చెప్పాలనుకుంటున్నాను!"

"ఇప్పటికే చాలా సత్యాలు చెప్పేవు నాన్నా!"

"ఇది కొత్త సత్యం రా! సరికొత్త సత్యం. జాగ్రత్తగా విను! భార్య చేతికి ఏమిచ్చినా పర్లేదు. పర్సు మాత్రం ఇవ్వకు!ఎందుకు ఇవ్వవద్దంటున్నానో గమనించేవా?"

"లేదు!"

"నీ పర్సు మీ ఆవిడ చేతిలో పెడితే నీ పరువు గంగపాలవుతుంది! భర్తవై వుండి కూడా - ప్రతి చిన్న బేవార్సు ఖర్చుకీ భార్యని అడుక్కోవాలి!"

డాక్టర్ మురళి - తండ్రికి తాను తెలుసుకున్న సూత్రం చెప్పే ఉద్దేశంతో-

"భర్తలు భార్యల్ని అడుక్కుంటుంటే - భార్యలు ఆనందిస్తారు నాన్నా! ఆడవాళ్లు అల్పసంతోషులు!"

బసవరాజు ఆశ్చర్యపోతూ అన్నాడు-

"వామ్మో! నాకు - అంటే - ఈ బసవరాజు ది గ్రేట్‌కి తెలీని సూత్రం చెబుతున్నావే?"

"నువ్వు ది గ్రేట్‌వే కావచ్చు నాన్నా! అంతమాత్రాన అన్ని సూత్రాలూ క్షుణ్ణంగా తెలియాలనే రూలు ఏవైనా వుందా?"

"అఫ్‌కోర్స్..."

"పర్సు మన జేబులో పెట్టుకుని ఆఫ్టరాల్ అయిదు నోటు ఖర్చు చేసినా - ఆడవాళ్లు అమ్మో అంటారు!"

"అఫ్‌కోర్స్. అది వాళ్ల లక్షణం!"

"అదే పర్సు ఆడవాళ్ల చేతికిచ్చేసి - వంద అడుక్కుని తీసుకున్నా ఆఫ్టరాలనుకుని ఆనందంగా యిస్తారు!"

"ఈ పాయింటు పూర్తిగా అర్థం కాలేదు. కొంచెం వివరించి చెప్పు!"

"వెరీ సింపుల్ నాన్నా! చెట్టంత మొగుడు చిట్టెలుక లాటి పెళ్లాన్ని అడుక్కుంటున్నాడంటె - ఆ వైఫ్ ఎంత ఆనందిస్తుందో తెలుసా? జస్ట్ సైకలాజికల్ ఫీలింగు. సాక్షాత్తు విష్ణుమూర్తి - భక్తుడ్ని



బీడీ ముక్క దానం చేయమని అడిగినట్టవుతుందన్నమాట!"

"ఛీ వెధవ బతుకు! ఇంత మంచి పాయింటు నాకింతవరకు తట్టనందుకు నన్ను నేను చెప్పుతో కొట్టుకోవాలి!"

అన్నాడు బసవరాజు బెంగపడిపోతూ. మురళి తండ్రి రియాక్షన్ పట్టించుకోలేదు.

"ఇప్పుడు చెప్పు నాన్నా - పర్సు మన దగ్గిరే పెట్టుకుని అయిదు రూపాయల్తో సరిపెట్టుకోమంటావా? పర్సు వాళ్ల చేతికిచ్చి వందకి ప్లాన్ వేయమంటావా?"

ఆ మాటకి బసవరాజు సమాధానం చెప్పకుండా - బోలెడు ఆశ్చర్యాన్ని మొహాన్న పులుముకుని అడిగేడు-

"ఇంత గొప్ప అయిడియా ఎట్లా తట్టిందిరా నీకు?"

"సంసారం - సంసారం అనే పుస్తకంలో ఇల్లాంటి అయిడియాలు అనేకం వున్నాయి నాన్నా!"

అని వెళ్లిపోతున్నాడు. అతను వెళ్లిపోతే తెలుసుకోవలసిన విషయం పూర్తిగా తెలుసుకునే అవకాశముండదనే ఉద్దేశంతో 'ఒరే మురళీ' అని పిలిచేడు. మురళి ఆగిపోయేడు. బసవరాజు గబగబా మురళి దగ్గరికొచ్చి-

"ఆ పుస్తకం పేరేమిటన్నావ్?" అని కుతూహలంగా అడిగేడు.

"సంసారం - సంసారం!" అన్నాడు మురళి.

"అది నీదగ్గిరుందా?"

"ఎందుకు?"

"పుస్తకం ఎందుకని అడుగుతావేమిట్రా వెర్రి నాయనా! చదవడానికి. నేను చదవడానికి. ఉందా?"

"లేదు!"

"ఏమైంది? పోయిందా?"

"మా ఫ్రెండుకిచ్చా!"

"మీ ఫ్రెండుకిచ్చేవా? ఫ్రెండుకంటె తండ్రే ఖచ్చితంగా గొప్పవాడు! గుర్తుపెట్టుకో!"

"ఆ మాటకొస్తే పుస్తకం కంటే ఎంతో విలువైన గ్రంథం - తండ్రి!"

"అని ఎవరన్నారు?"

"వేదవాక్కు నాన్నా! వేదాల్లో చెప్పేరు! పుస్తకాల్లో అక్షరాలు మాత్రమే వుంటాయి. తండ్రి దగ్గర పచ్చిఅనుభవాలుంటాయి. అక్షరం గొప్పదా? అనుభవం గొప్పదా?"

"అనుభవమే గొప్పది!"

"మరింకే?"

"కానీ - నీ తండ్రికి పర్సు అనుభవం బొత్తిగా లేదుగా! అదన్నమాట! 'సంసారం - సంసారం' చదివి ఆ రూల్సుని నేనుకూడా అమల్లో పెట్టుకుంటా!"

"ఈ వయసులో ఆ చిట్కాలు పని చెయ్యవు!"

అని డాక్టర్ మురళి ఆ గది నుంచి వెళ్ళిపోయేడు.

అతను వెళ్ళిన వేపు కళ్లింతవి చేసుకుని చూస్తూ నిలబడిపోయేడు బసవరాజు.

నిలబడిపోయి నోటికొచ్చినట్టు గొణుక్కుంటున్నాడు-

"ఈ వెధవ వేలడంతలేడు! నాకు చెబ్తున్నాడేమిటీ పాఠాలు? అంతేమరి! తండ్రయ్యేదీ తాతయ్యేదీ- చెప్పేవాడికి అడిగేవాడు లోకువ! అంచేత - ఇకముందు- వీడినేమీ అడక్కూడదు!"

బసవరాజు తీసుకున్న కొత్త నిర్ణయం యింకా పచ్చిపచ్చిగానే వున్న సమయంలో - అతని కుమార్తె ఉమ అతని గదిలోకి 'నాన్నా' అని పిలుచుకుంటూ వచ్చింది!.

ఆమె ఎందుకు వచ్చిందో తెలీక అడిగేడు-

"ఏమ్మా ఉమా! మీ అన్నలాగా నువ్వుకూడా ఏదైనా వేదవాక్కు చెప్పడానికి వచ్చేవా? చెప్పుతల్లీ! గుడ్డొచ్చి పిల్లని వెక్కిరించిందని ఊరికే అన్నారా? చెప్పు!"

"మా ఫ్రెండ్ పెళ్లి నాన్నా!"

ఫ్రెండనగా ఎవరు? ఆడ ఫ్రెండా మగ ఫ్రెండా అని ఖచ్చితంగా అడగాలనుకుని- అడిగితే వేదవాక్కు చెబుతుందేమోనన్న భయంతో ఏమీ అడగలేక 'మీ ఫ్రెండా' అన్నట్టు చూసేడంతే!

తండ్రి పాయింటును ఉమ అర్థం చేసుకుందికాబోలు. అందుకే చాలా స్పష్టంగా చెప్పింది.

"వనజ నాన్నా! మా వనజ పెళ్లి!"

ఆ మాటవిని బసవరాజు కొంచెం రిలాక్సయ్యాడు.

ఉమ చెబుతూనే వుంది-

"ఈ పక్క ఊళ్లోనే పెళ్లి!"

"ఈ పక్క ఆ పక్క వద్దు! ఊరుపేరు చెప్పు!"

"వరంగల్!"

"పక్కఊరేనంటావే! కొంచెం దూరమే!"

"కారులో వెడతాంగదా! దగ్గిరే అవుతుంది! రాత్రి పెళ్లి. సాయంత్రం వెళ్లి - మళ్లీ రేపు మార్నింగ్‌కల్లా వచ్చేస్తా!"

"ఒంటరిగా వెడుతున్నావా?"

"ఊహు! సునీత, సుశీల, సుందరి - అందరం కలిసే వెడుతున్నాం! పెళ్లివారు మా కోసం రెండు కార్లు పంపిస్తున్నారు!"

"కార్లు పంపకపోతే - కాలినడకన రమ్మంటారా? నేను అడగదలుచుకున్నది అది కాదు! పెళ్లి కూతురు నీకంటె పెద్దదా చిన్నదా - అది చెప్పునాకు!"

"వనజనాన్నా! వనజ! రెండు జడల వనజ! వనజ తెలీదూ?"

"తెలీదు. మనింటికి వచ్చే ఆడపిల్లల జడల్ని లెక్కపెట్టడం నాకిష్టంలేదు! వనజా తెలీదు. వనజ వయస్సూ తెలీదు. ఆ పిల్ల వయస్సెంత?"

"నా క్లాస్‌మేట్ నాన్నా! మా యిద్దరిదీ ఒకటే వయస్సు"

ఆ సమాధానం వినగానే బసవరాజు వళ్ళుమండిపోయింది. ఉమకి సమాధానం చెప్పకుండా - జానకీ... జానకీ అని పిలుచుకుంటూ ఆ గదిలోంచి బయటపడుతున్నాడు. అమ్మనెందుకు పిలుస్తున్నాడో ఉమకి అర్థం కాలేదు.

అంచేత తండ్రి వాలకానికి తాత్పర్యం చెప్పుకోలేక తండ్రి గదిలోనే నిలబడిపోయింది ఉమ!

(ఇంకావుంది)



# రాజా ఆడియో రివ్యూ




**విడుదల : సుప్రీమ్**
**వెల : రూ.38/-**

ప్రభాస్, అన్షు జంటగా సురేష్ కృష్ణ దర్శకత్వంలో శ్రీ శ్రీ చిత్ర పతాకంపై నిర్మాత బి.శ్రీనివాసరాజు నిర్మించిన 'రాఘవేంద్ర' సినిమా ఆడియో విడుదలయింది. మణిశర్మ ఈ చిత్రానికి సంగీత దర్శకుడు.

తొలిగీతం -'నమ్మిన నా మది మంత్రాలయమేగా' అనే పల్లవితో మొదలవుతుంది. వేటూరి రాసిన ఈ గీతాన్ని 'దేవదాస్' ఫేమ్ శ్రేయ గోషాల్, కల్పన బృందం ఆలపించారు. దేవాలయాల్లోనూ, ఆధ్యాత్మిక హృదయాలలోనూ, భజన బృందాలలోనూ మారుమ్రోగ పోబోయే ఈ గీతానికి ఆయుష్షు ఎక్కువ. యమన్‌రాగం ఆధారంగా సాగిన ఈ గీతంలోని - మనసు తెల్లని హిమవంతా/భవము తీర్చవా భాగవంతా/ మహిని దాల్చిన మహిమంతా/ మరల చూపుమా హనుమంతా - అనే వాక్యాలకు జతపడ్డ ట్యూన్ వింటుంటే లోగడ మణిశర్మ సంగీతాన్ని అందించిన 'మనోహరం' సినిమాలో 'సరి సరినటనల ఓ చెలియా బెళుకుల బెట్టుసరి' అనే తెలుగు కవ్వాలీ గీతంలోని నడక గుర్తొస్తుంది. ఇంత మంచి గీతంలో కొన్ని పదాలు సరిగ్గా వినిపించకపోవటం ఓ రకంగా దురదృష్టం. ముఖ్యంగా 'తుంగా జలాల సేవ' అని ఉండాలి. వేటూరి గారు రాసింది కూడా అదే! కానీ 'తుంగా దళాల సేవ' అని వినిపిస్తున్నట్టు వుంటుంది. లోపం ఎక్కడుంది..? రచయిత రాసిన పదాలను పాడే వారికి అందించే ప్రక్రియలోని భాగమైన ఫెయిర్ చేసేవారిలో వుందా? పాడేవారిలో వుందా? పాడించుకునేవారిలో వుందా? రికార్డింగ్‌లో వుందా? మిక్సింగ్‌లో వుందా? రికార్డ్ అయిన పాటను ఆడియోకు ట్రాన్స్‌ఫర్ అందించే డాట్ టేపుల క్వాలిటీలో వుందా? తయారయి వచ్చిన ఆడియో టేపుల క్వాలిటీలో వుందా? శ్రోత వింటున్న మ్యూజిక్ సిస్టమ్స్‌లో వుందా లేక అతని శ్రవణేంద్రియాలలోనే వుందా? మన భాషకు పట్టిన ఈ 'చిత్ర' హింసా కార్యక్రమం ఇంకెన్నాళ్ళు పాటు కొనసాగాలని రాసిపెట్టుందో ఆ దేవుడికే తెలియాలి.

వేటూరి రాయగా కార్తిక్, కల్పన, ప్రేమ్‌గీ పాడిన 'సారిగామ పదనీసా సందుచూసి వలవేశా' సంగీత పరంగా హుషారైన పాట, సాహిత్యపరంగా తమాషా అయిన పాట. సారిగామ పదనీసా - సందు చూసి వలవేశా/ డోరెయ్ మీల స్వరమేశా - డోరు అందుకే మూశా/ పార్వతీశ పరమేశా - పాలబుగ్గ అడిగేశా/వెంకటేశ కలినాశా - వెన్నెలొస్తే గొడుగేశా అంటూ శబ్ద సౌందర్యంతో చమత్కారాలు చెయ్యటంలోనూ; ఆ (మహమ్మద్) రఫీ తిరిగొస్తే త్యాగరాజ కృతి పాడిస్తానని, ఆ మడోన్న ఇటువస్తే కూచిపూడి ఆడిస్తానని ఊహించటంలోనూ - వేటూరి చెడుగుడు ఆడేస్తే - హాంటింగ్ ట్యూన్ ఇవ్వడంలోనూ ఆర్కెస్ట్రయజేషన్‌లో అదర గొట్టడంతోనూ మణిశర్మ కబడ్డీ ఆడేశాడు. మనం సరిగమ పదనిస అన్నట్టు వెస్ట్రర్న్స్‌లో 'డో-రెయ్-మి-ఫ-సో-లా-టి-టు'అని అంటారు. ఆ స్వరాలలో 'డో-రెయ్-మి' లను తీసుకొని వేటూరి రాస్తే వాటిని శ్రోతకు అర్థం కాకుండా పాడడంలో కల్పనకి - పాడిస్తా, ఆడిస్తా, ఆ రఫీ' అనే మాటలను 'పాడొస్తా, ఆడొస్తా, అరఫి' అంటూ శ్రోతకు వినిపించేలా అస్పష్టంగా పాడడంలో కార్తిక్‌కి - తెలుగు ప్రజలు 'చెయ్యెత్తి, నమస్కరించాల్సిందే! కొత్త కంఠాలు రావాలి... రావల్సిందే... అప్పుడే ఫ్రెష్‌నెస్ వుంటుంది! అంత మాత్రంచేత పటుత్వం ఏమాత్రం సడలని పాత కంఠాలను పక్కన పెట్టెయ్యాల్సిన అవసరం లేదు కదా!? లేదా యూత్ చేతే పాడిద్దాం అనుకుంటే స్పష్టంగా పాడగలిగిన చరణ్, మల్లిఖార్జున్ ఉన్నారు కదా...! వైవిధ్యం కోసం భాషను బలి చేసే హక్కు ఎవరికీ లేదు కదా... ఈ వాక్యం ఎవరైనా నొప్పిస్తే క్షమించాలి. మన భాషకు పట్టిన దౌర్భాగ్యానికి మనసు చేసిన ఆక్రందన యిది.

సుద్దాల అశోక్‌తేజ రాయగా హరీష్ రాఘవేంద్ర, సుజాత పాడిన 'నీ స్టయిలే నాకిష్టం నీ స్మయిలే నా ప్రాణం' పాట ఓ గుడ్ మెలొడీ! పల్లవి, చరణాల స్వరరచన విడివిడిగా, కలివిడిగా చెవికి హాయిగా వున్నాయి.

వెన్నెలకంటి రాయగా మనో, బృందం పాడిన 'బూతులు తిట్టకురా నువ్వు బూతులు తిట్టకురా' పాటకి ట్యూన్ పరంగా ఆకర్షణీయమైన క్యాచీ ట్యూన్‌ని మణిశర్మ అందించాడు. అంతవరకూ ఓకే! సాహిత్యపరంగా చూస్తే - ఈ పాటలోని కొన్ని కొన్ని వాక్యాలను వింటున్నప్పుడు నిజంగా భాధని కంట్రోల్ చేసుకోవడం చాలా కష్టం అనిపిస్తుంది. వెన్నెలకంటి వంటి సంస్కారమున్న రచయిత కలం నుండి వెలువడవలసిన మాటలు కావవి. ఇప్పుడిప్పుడే బుద్ధి వికసిస్తున్న మనింట్లో పిల్లలు 'దీనికి అర్థం ఏమిటి?' అని అడిగితే వారికి ఏ ముఖం పెట్టుకుని ఎలా సమాధానమిస్తాం? 'తెలుగు భాషను ఇటాలియన్ ఆఫ్ ది ఈస్ట్ అంటారని మీ భాషను నేను కష్టపడి నేర్చుకుంటున్నాను... ఈ పదాలకు, ఈ ఎక్స్‌ప్రెషన్‌లకు అర్థం చెప్పరూ?' అని ఓ తెలుగేతరుడు ఈ పాటలోని వాక్యాలను చూపించి అడిగితే వారి ముందు ఎలా తలెత్తుకోగలం? పాట రాసేముందు ఏ రచయితైనా ఈ రెండు సందర్భాలనూ కళ్ళముందు నిలుపుకోగలిగితే ఆ రచయితను అభిమానించే వారు తలదించుకోవలసిన అవసరం వుండదు. కేవలం డబ్బు కోసం గాని, లేక కొన్ని మొహమాటాలకు, ఒత్తిడులకు లొంగి గాని వెన్నెలకంటి గారికి పాటలు రాయాల్సిన అవసరం ఇవాళ లేదని ఈ సమీక్షకుడు అనుకుంటున్నాడు కాబట్టి దయచేసి ఇటువంటి ఎక్స్‌ప్రెషన్‌లను భవిష్యత్తులో తన పాటలలో రానివ్వద్దని సవినయంగా చేసుకుంటున్న ఈ మనవిని వెన్నెలకంటి గారు అర్థం చేసుకోగలరనే ఆశ!

వేటూరి రాయగా మల్లిఖార్జున్, గోపికా పూర్ణిమ పాడిన 'అడుగులోన అడుగువేస్తా' పాట కూడా ఓ గుడ్ మెలొడీ... చరణాలలో 'బిగువులెందుకే ఓఓఓ తగవు మానవే ఓఓఓ మా సొగసు దాచకే ఓఓఓ' వంటి వాక్యాలకు జతపడ్డ ట్యూన్, ఆ ట్యూన్‌ని కరెక్ట్‌గా తమ గళాలతో గాయనీ గాయకులు ప్రాజెక్ట్ చేసిన పద్ధతి బావున్నాయి.

సుద్దాల అశోక్‌తేజ రాయగా శంకర్ మహదేవన్, చిత్ర పాడిన 'కలకత్తా పానేసినా చూసుకో' పాట కేవలం మాస్ ఓరియంటేషన్ సాంగ్ కనుక సంగీతం, సాహిత్యం, గానం, తాళం అన్నీ ఆ దిశగానే పయనించాయి... ఆ గమ్యాన్ని చేరుకున్నాయి కూడా! ■

# దిసీజ్ ఖర్మ... దట్సాల్...!

సత్యమూర్తి BV



మీ ఆరోగ్యం బాగుపడాలని మీ స్నేహితులు 'గెట్ వెల్ సూన్' అంటూ ఫ్లవర్ బొకేలు తెస్తారు...



ఆ పువ్వులు, ఆకులు మీకు పడక ఎలర్జీతో రియాక్షన్ వచ్చింది కనుక మరి కొన్నాళ్ళు హాస్పిటల్లో ఉండాలంటారు మీ డాక్టరు గారు.



ఎదురుగా మనోహర దృశ్యం. సముద్రం కనిపిస్తూ ఉంటుంది. ఈశాన్యం పల్లం. వాస్తు ప్రకారం బాగుందని ఇల్లు కట్టుకుంటారు.



వెంటనే, ఆ సముద్రం, అవీ కనిపించకుండా, మీ బిల్డింగ్‌కి ముందు ఇంకోడు 10 అంతస్థుల బిల్డింగ్ కడతాడు.



మిమ్మల్ని ఫోన్ ముట్టుకోనివ్వకుండా 24 గంటలూ మీ అబ్బాయి ఫోన్లో మాట్లాడుతూనే ఉంటాడు...



ఇంకలాభం లేదు... అర్జెంటు పనులకి వేరే ఫోన్ అవసరమని మీరు ఒక సెల్‌ఫోన్ కొనుక్కుని, రహస్యంగా ఇంట్లో దాచుకున్నా ఇదీ పరిస్థితి...




విడుదల : సుప్రీమ్
వెల : రూ.38/-

# రాజా ఆడియో రివ్యూ

రాఘవేంద్రరావు-కీరవాణి కాంబినేషన్ అంటే శ్రోతలకు పండగే! ఇక రాఘవేంద్రరావు వారి 100 సినిమా, అల్లు అరవింద్ గారి అబ్బాయి (అర్జున్) హీరో, ఆర్తీ అగర్వాల్ చెల్లెలు (అదితి అగర్వాల్) హీరోయిన్ అనగానే క్రేజి ప్రాజెక్ట్‌గా రూపొందే అవకాశం కచ్చితంగా ఉంటుంది. అటువంటి క్రేజీ ప్రాజెక్ట్‌కి, గతంలో తమ కాంబినేషన్ పట్ల అంచనాలకు - తగ్గ హిట్‌సాంగ్స్‌ని ఇవ్వాల్సిన బాధ్యత సంగీత దర్శకుడి మీద ఎంతో వుంది. ఆ ఎక్స్‌పెక్టేషన్స్‌కు తగ్గ ఫలితాలనే 'గంగోత్రి' సినిమా పాటల ద్వారా అందించారు కీరవాణి. ఇందులోని 7 పాటలలో 6 పాటలను చంద్రబోస్, ఒక పాటను వేటూరి రాశారు.

ఆడియో క్యాసెట్‌లో తొలుత వినిపించే 'నువ్వునేను కలిసుంటేనే నాకెంతో ఇష్టం' పాటను బాలు, మాళవిక పాడేరు. గాలిపటం ఎగరటం ఎదలోతుకే చేరటం, కాకి ఎంగిళ్ళ రుచి అభిరుచులను కలపటం, కాలవగట్లు కథ మలుపులు తిప్పటం, గుజ్జెన గూడు ఆటలు ఒక గూటికి చేర్చటం - ఇలా తను చెప్పాలనుకున్న విషయానికి తగ్గ విశేషాలను ఎన్నుకోవటంలో చంద్రబోస్ స్కీమింగ్ వెనుక నున్న తపన అభినందించదగ్గది. కీరవాణి అందించిన ట్యూన్‌కి బాలు, మాళవిక పాడిన విధానం అన్నీ కలిసి పాటని చెవికి హాయిగా చేరవేశాయి.

ఎస్.పి.చరణ్, మాళవిక పాడిన 'ఒక తోటలో ఒక కొమ్మలా ఒక పువ్వు పూసింది' పాట - కథలో సారాంశాన్ని ఇముడ్చుకున్న పాట. అంచేత కథాగమనం పూర్తిగా తెలిసివింటే ఈ పాట మరింత హత్తుకునే అవకాశం వుం(టుం)ది.

కౌసల్య, డి.ఐశ్వర్య కలిసి పాడిన 'వల్లంకిపిట్ట వల్లంకిపిట్ట మెల్లంగ రమ్మంట' పాట చాలా ఆకర్షణీయంగా రూపొందింది. సంగీతం, సాహిత్యం, గానం మూడూ ముప్పేట గొలుసులు పెనవేసుకుని పోయాయి పాటలో. ఎదిగే పిల్లకు ఒక్కొక్క తరుణంలో కలిగే దిష్టిని, ఆ దిష్టి పరిహారాలను పేర్కొనటంలో చంద్రబోస్ దృష్టిని చాలా చక్కగా నిలిపాడు. అలాగే ఆకలేయగా బుల్లి బొజ్జలో బువ్వనవుతా/ఎక్కెక్కి ఏడ్చే వేళ కన్నీళ్ళవుతా వంటి వాక్యాల ద్వారా మంచి ఎక్స్‌ప్రెషన్స్ ఇవ్వగలిగాడు. ఈ పాటలో చిన్నపిల్ల గొంతు డి.ఐశ్వర్యది. జంట నగరాలలో లిటిల్ మ్యుజిషియన్స్ అనే సంస్థ ద్వారా ప్రాచుర్యం పొందిన గాయకుడు సంగీత దర్శకుడు అయిన రామాచారి యొక్క చెల్లెలి కూతురే ఈ ఐశ్వర్య. ఈ పాటకు ఆమె ఓ ప్రత్యేక ఆకర్షణ.

యస్.పి.చరణ్, శ్రీవర్ధిని, డి.ఐశ్వర్య కలిసి పాడిన - రైలు బండి రైలుబండి కూతలోనే పాట వుంది - పాట చంద్రబోస్ కెరీర్‌లో చెప్పుకోదగ్గ పాట. ముఖ్యంగా పాటలోని రెండవ చరణం చూస్తుంటే చంద్రబోస్ తన పాటలలో శాశ్వతత్వం ఉండడానికి కావలసిన లోతైన అవగాహన, నిబద్ధత కలిగిన పదాల పొందికపై లక్ష్యాన్ని చాలా సీరియస్‌గా నిలిపాడనిపిస్తోంది. ఈ పాటకు ఎంతో క్యాచీగా వుండే ట్యూన్ జతపడింది. 'ఆగ్రా సౌధం చూపించి/సిమ్లా ఆపిల్ అందించి/హరిద్వారులో అడుగేసి/హృషికేశ్‌లో తిప్పించి' అనే వాక్యాలను వింటుంటే 'లాహిరి లాహిరి లాహిరిలో' సినిమాలో 'మన వీరవెంకట సత్యనారాయణ పెళ్ళి' పాట నడక గుర్తొస్తుంది (ఈ ఇన్ఫర్మేషన్ కీరవాణి గారు ఇచ్చిందే- ఈ సమీక్షకుడి సొంత తెలివితేటలు కావు. 'ఈ లైన్లు వింటుంటే ఏదో గుర్తొస్తోందండీ... ఎంత తన్నుకుంటున్నా ఒరిజినల్ దొరకటం లేదు' అంటూ కీరవాణి గారికి ఫోన్ చేసి అడిగితే 'మీరు పట్టుకోలేకపోయారంటే నేను సక్సెయినట్టు లెక్కన్నమాట' అని అసలు రహస్యం చెప్పారాయన.)

ఇక - తెలుగువారు గర్వంగా చెప్పుకోదగ్గ పాట - గంగోత్రి టైటిల్‌సాంగ్! గుండెను పట్టేసి, కుదిపేసి, కళ్ళనుంచి కన్నీళ్లు తెప్పించే వరకు ఊరుకోదీ పాట. ఈపాటకు సంబంధించిన వివరణ 16-31 మార్చి 2003 సంచికలో వేటూరి గారు తెలిపారన్నది పాఠకులకు విదితమే. ఈ పాటలో ఆయన ఉపయోగించిన భాషను వింటుంటే 'శంకరాభరణం' సినిమాలో సోమయాజులు గారి పాదాలను మంజుభార్గవి రక్తంతో అభిషేకించినట్టు - గుండెల్లో పుట్టిన స్పందన కన్నీళ్ళ రూపంలో పొంగగా ఆ రసగంగతో వేటూరికి అంగుళీయార్పన చేయాలనిపిస్తుంది- ఇటువంటి పాట రాయటానికి ఎంతో అనుభవం కావాలి. ఆ అనుభవ సాంద్రత పాటంతా పరచుకుని కనిపిస్తుందీ పాటలో...! వేటూరికి ఈ పాట ద్వారా అవార్డు రావాలి - అప్పుడే మనల్ని మనం గౌరవించుకున్నట్టు లెక్క! ఇంతటి అనుభూతి శ్రోతలకు కలగడానికి సంగీత దర్శకుడిగా, గాయకుడిగా కీరవాణి కూడా కారకుడు. ఈ సాహిత్యానికి కీరవాణి తప్ప మరొక సంగీత దర్శకుణ్ణి ఊహించుకోలేమన్నంత గొప్పగా ఇచ్చారాయన ట్యూన్‌ని. అలాగే పాడుతున్నప్పుడు కూడా - ఈ పాటకు బాలూ అయితే ఎలా వుంటుంది - అనే ఆలోచనకి తావివ్వనంత అద్భుతంగా పాడారాయన. తెలుగు సినీ సంగీత చరిత్రలో వచ్చిన గొప్ప పాటలలో కచ్చితంగా ఇదొకటి.

చంద్రబోస్ రాయగా మనో, సునీత 'మామయ్యది మొగల్తూరు' పాట కేవలం మాస్ ఓరియంటేషన్ సాంగ్. మావయ్య చిరంజీవిది మొగల్తూరు, తండ్రి అల్లు అరవింద్‌ది పాలకొల్లు కాబట్టి ఈ పాట-ఈ చిత్ర కథానాయకుడైన అల్లు అర్జున్‌ని దృష్టిలో పెట్టుకుని రాసిందని తెలుస్తోంది. అయితే ఈ వరసలన్నీ స్త్రీ స్వరం ద్వారా వినబడడం వల్ల బహుశా కథానాయక పాత్రధారికి ఓ మారువేషం ఉందేమోనన్న అనుమానం కలుగుతుంది. రెండవ చరణం నిశితంగా గమనిస్తే ఆ ఆలోచనకు తగిన పునాది కనిపిస్తుంది. వీటన్నింటిని గమనించి చూస్తే ఈ పాట అభిమానుల ఆదరణకు నోచుకునే అవకాశం ఉంది.

చంద్రబోస్ రాసిందే మరో పాట - 'గంగా నీ ఉరుకులె రాగంగా నా గుండెల మోగంగా'....! గంగోత్రి టైటిల్‌సాంగ్ తరువాత వరుసక్రమంలో ఎన్నదగిన పాట యిది. పాట వింటుంటే బాలూయే పాడారా అన్నంత గొప్పగా పాడేడు చరణ్...! సునీత కూడా ప్రాణం పెట్టి పాడింది. ఇక సంగీత దర్శకుడిగా కీరవాణి సరేసరి... బృందావన సారంగ రాగంలోని జీవస్వరాల్ని పిండడంలోనూ, ఆర్కెస్ట్రయిజేషన్‌లో సన్నాయిని, వీణని ఉపయోగించటంలోనూ శ్రోతల హృదయాల్ని తన గుప్పిట్లోకి తెచ్చేసుకున్నాడనిపిస్తుంది. ముఖ్యంగా రెండవ చరణం ముందు వీణతో నడిపిన ఫాస్ట్ మూమెంట్ విన్న కొద్దీ వినాలనిపిస్తుంది.

కేవలం పరభాష గాయకులతో పాడిస్తేనే ఆడియో హిట్ అవుతుందనుకునే వారికి ఈ ఆడియో ఓ కనువిప్పు. ఈ సంప్రదాయం మున్ముందు ఇలాగే కొనసాగితే తెలుగు ప్రజలు హాయిగా ఊపిరిపీల్చుకుంటారు. తెలుగుతల్లి సంతోషిస్తుంది. ■

రచన: వేటూరి ① గానం : శ్రేయగోషల్, కల్పన

హే... మంత్రాలయ దీపా
శ్రీ రాఘవేంద్ర గురునాథా...
ప్రభో పాహిమాం...
శ్రీ రాఘవేంద్ర గురునాథా॥౨॥
నమ్మిన నా మది మంత్రాలయమేగా ఓ...
నమ్మని వారికి తాపత్రయమేగా...
శ్రీగురు బోధలు అమృతమయమేగా... ఓ...
చల్లని చూపులు సూర్యోదయమేగా...
గురునాథ రాఘవేంద్రా శ్రీకృష్ణ పారిజాతా
హనుమంత శక్తిసాంద్రా హరినామ గాన గీతా
నీ తుంగభద్ర మా పాపాలే కడగంగా...
తుంగాజలాల సేవ తులసీదళాల పూజ... అందుకో...
నిరాశమూగే వేళా మా దురాశ రేగే వేళా
నీ భజనే మా బ్రతుకై పోనీవా...
పదాలవాలే వేళ నీ పదాలు పాడే వేళ
నీ చరణం మా శరణం కానీవా...
మనసు తెల్లని హిమవంతా
భవము తీర్చవా భగవంతా
మహిని దాల్చిన మహిమంతా
మరల చూపుమా హనుమంతా
నీ వీణతీగలో యోగాలే పలుకంగా..
తుంగాజలాల సేవ తులసీదళాల పూజ... అందుకో.. ॥నమ్మిన॥
వినాశ కాలంలోన ధనాశ పుడితే లోన
నీ పిలుపే మా మరుపై పోతుంటే...
వయస్సు పాడే వేళా వసంతమాడే వేళా
నీ తలపే మా తలుపే మూస్తుంటే
వెలుగు చూపరా గురునాథ
వెతలు తీర్చరా యతిరాజా
ఇహము బాపెనే హితబోధ
పరము చూపెనే ప్రియ గాథ
నీ నామ గానమే ప్రాణాలై పలుకంగా...
తుంగాజలాల సేవ తులసీదళాల పూజ... అందుకో.. ॥నమ్మిన॥

వలపుతోనై వచ్చిపోవే వెచ్చగా
ఆ: పరువమంటు పరుగులొద్దు
పరుగుకన్నా పరువు ముద్దు
దరికిచేరి దరువులొద్దు పచ్చగా
అ: బ్రహ్మచారినీ ఓఓఓ భయము దేనికి ఓఓఓ
పట్టువదలవే ఓఓఓఓ...
ఆ: కన్ను తెరువని ఓఓఓ కన్నెపిల్లని ఓఓఓ
కాస్త బతకనీ ఓఓఓఓ...
అ: హే హే హే హే ॥అడుగు॥

రచన: సుద్దాల అశోక్‌తేజ ⑤ గానం : శంకర్ మహదేవన్, చిత్ర

అ: కలకత్తా పానేసినా చూసుకో నా పెదవులు నీ పెదవులతో రాసుకో
ఆ: దిల్ పత్తా తప్పింది నీ పాటలో నడుం పట్టుకొని ముట్టుకునే ఆటలో
అ: పొగిడి ఎక్కించకు ఇలా ములగాచెట్టు
ఆ: ఒకే పిడికిలి పోటు పది పిడుగుల పెట్టు
అ: పూల సన్నాయిలే మరి నీలో ఉన్నాయిలే..
ఆ: గాలి తుఫానులే అదే నీలో చూసానులే ॥కలకత్తా॥
అ: చాటుమాటు లేని మొగ్గలు చీర రైక లేని బుగ్గలు
ఆ: అడ్డువుంటే అందం అందునా ముద్దు మురిపెం నీకు చెందునా
అ: ముద్దులుండేవి చెంపలోనా ముచ్చటైనా పెదవుల్లోనా
ఆ: ఎల్లా తెలిపేది మందిలోనా ముద్దులు ఊరేది గుండెల్లోనా
అ: ముద్దు తినిపిస్తావా లేక తాగిస్తావా
ఆ: ఇచ్చి మురిపించనా మురిసి అందించనా
అ: పోటీ బాగుందమ్మో ఇగ ఆటే మిగిలిందమ్మో
ఆ: ఆడుకోవాలయ్యో నేనోడి గెలవాలయ్యో ॥కలకత్తా॥
ఆ: ఒళ్లు మొత్తం ఏదో వేడిరా... ఒళ్లోకొస్తా పట్టి చూడరా...
అ: చల్లలోన కలిపి చక్కెరా కల్లోకొచ్చి ఇంక వెల్లిరా...
ఆ: కొంగు సాచాను పువ్వులాగా రంగులేసి నవ్వించరా..
అ: హే... హోళీ పండక్కి వచ్చి చూడే చోళీ నింపి పంపిస్తానే..
ఆ: వరస కలిపేందుకు వాయిదాలెందుకు...
అ: ఉరుము కావాలమ్మో వాన కురిసేందుకు
ఆ: నీలో మెరుపుందయ్యో అది నాలో మెరవాలయ్యో
అ: దసరా కావాలంటే... హోయ్... దశమి రావాలమ్మో...
ఆ: దిల్ పత్తా తప్పింది నీ పాటలో
నడుం పట్టుకొని ముట్టుకునే ఆటలో ॥కలకత్తా॥



① గానం : ఎ.ఆర్.రహమాన్

అ:కో: కొలంబస్ కొలంబస్ ఇచ్చారు సెలవు
ఆనందంగా గడపడానికి కావాలొక దీవి... మామోయ్ ॥కో॥
సెలవు సెలవు సెలవు కనుగొను క్రొత్త దీవి నీవు ॥సెలవు॥ ॥కో॥
శని, ఆది వారాల్లేవని అన్నది ఓ మనుషుల్ని మిషన్లు కావొద్దన్నది
చంపే సైన్యము అణు ఆయుధం ఆకలి పస్తులు డర్టీ పాలిటిక్స్
పొల్యూషన్ ఏమీ చొరబడలేని దీవి కావాలి ఇస్తావా కొలంబస్
వారం ఐదునాళ్లు శ్రమకే జీవితం వారం రెండునాళ్లు ప్రకృతికంకితం
ఈచే గాలిగ మారి పూలను కొల్లగొట్టు మనసును చక్కబెట్టు
మళ్లీ పిల్లలమవుదాం మొదలంట ఆడి
పక్షుల రెక్కలు అద్దెకు దొరికితే ఒంటికి తొడిగీ పైకెగురూ
పక్షులకెన్నడూ పాస్‌పోర్ట్ లేదు ఖండాలన్నీ దాటెళ్లు
నేడు విరామమేదో వచ్చు అయినా విశ్రమించలేదు
నేడు ఇంపాలా చేపలల్లే ఈదుదాం కొలంబస్
హైలెస్సా... కొలంబస్...హా హైలెస్సా
నడిచేటి పూలనుకొంచెం చూడు నేడైనా వడివడిగాను లెఫ్టో రైటో మేలు
అల నురుగులు తెచ్చి చెలి చీరే చెయ్యరారాదా
నెలవంకను గుచ్చి చెలి మెడలో వెయ్యరారాదా
వేకెండు ప్రేయసి ఓకే అంటే ప్రేమించు
టైమ్‌పాసింగ్ ప్రేమలా పూటైన ప్రేమించు
వారం రెండునాళ్లు వర్ధిల్లగా కొలంబస్ ॥కొలంబస్॥

②

అ: రావేనా చెలియా రావేనా చెలియా రయ్యంటు రావె చెలి
వారెవ్వా చెలియా వయసైన చెలియా ఊరంతా గోల చెయ్యి
ఆ: మమతకు నువ్వు ప్రతిబింబం తల్లికన్నా గారాబం
చిననాటి అనురాగం వయసైతే అనుబంధం
ఏ అవ్వా నా గువ్వా నువ్వింకా అందం దోచెయ్యి ॥రావేనా॥
అ: జీన్స్‌పాంటు వేసుకో లిప్‌స్టిక్కు పూసుకో
నిజమైన తలనెరుపు డై వేసి మార్చుకో... యే..
ఆ: ఓలమ్మో... ఏమి చోద్యం... నా వయసే సగమాయే...
అ: క్లింటన్ నంబరు చేసిస్తాను గలగమంటూ ఐలవ్‌యూ నువ్ చెప్పెయ్యి
ఆ: నువ్వెవరంటే మిస్‌వరల్డ్ కాదు మిస్ ఓల్డని చెప్పేయి ॥రావేనా॥
ఆ: ఓ... కంప్యూటర్ పాటలకు పులివేషం నువ్వాడు
అ: ఎంటీవీ ఛానెల్లో శక్తి స్తోత్రం నువ్‌పాడు

మమగగ మమసస గగససగగనిని సగగ సమమ సగగ
సపప సగగ సనిని సగగససా నిదపమగా గమపని
సగా రిసా సానిదపా మగారీ సగమ ॥కన్నులతో॥
పపనినిసాస గగమమ పపనిని సాస నిసగమపని
దపమ గామ పని సగరిప నిసమగరిసనిద ॥కన్నులతో॥
రీరీసనిస రిరిస సరిరినిని సాస గరిస నిసగరిసని
దప పాప నిదప మగరిస నిసగా, సగమ గమపా
నిదపప మపనీ పపని సగరిస
గరిసని సానిదపా మగమపమ ॥కన్నులతో॥

⑥ గానం : ఉన్నికృష్ణన్, సుజాత

పువ్వుల్లో దాగున్న పళ్లెంతో అతిశయం
ఆ సీతాకోకచిలక ఒళ్లెంతో అతిశయం
వేణువులో గాలి సంగీతాలై అతిశయం
గురువెవ్వరులేని కోయిలపాటె అతిశయం
అతిశయమే అచ్చెరువొందె నీవే నా అతిశయం
ఆ గిరులు ఈ తరులు ఏ ఝరులు లేనపుడు
ముందున్న ప్రేమేగ అతిశయం
ఓ... పదహారు ప్రాయాన పరువంలో అందరికి
పుట్టేటి ప్రేమేగ అతిశయం ॥పువ్వుల్లో॥
ఏ వాసనలేని కొమ్మలకి సువాసన కలిగిన పూలున్నాయి
పూలవాసనతిశయమే
ఆ సంద్రం ఇచ్చిన మేఘంలో ఒక చిటికెడైన ఉప్పుందా
వాన నీరు అతిశయమే
విద్యుత్తే లేకుండా వెలిగే దీపంలా
వెలిగేటి మిణుగురులతిశయమే
తనువున ప్రాణం ఏచోట నున్నదో ప్రాణంలోన ప్రేమ ఏ చోట వున్నదో
ఆలోచిస్తే అతిశయమే ॥ఆ గిరులు॥ ॥పువ్వుల్లో॥
అల వెన్నెలంటి ఒక దీవి ఇరు కాళ్లంట నడిచొస్తే
నీవే నా అతిశయమే
జగమున అతిశయాలు ఏడైనా ఓ మాట్లాడే పువ్వా నువా
ఎనిమిదవ అతిశయమే
నింగిలాంటి నీ కళ్లు పాలుగారే చెక్కిళ్లు
తేనెలూరె అధరాలు అతిశయమే మగువ చేతి వేళ్లు అతిశయమే
మకుటాల్లాంటి గోళ్లు అతిశయమే
కదిలే ఒంపులు అతిశయమే ॥ఆ గిరులు॥ ॥పువ్వుల్లో॥

అ: అందరి తీరుగా నేను తెలుగు కుర్రాణ్ణిగా...
ఎందుకే ఇంతగా పిచ్చి ప్రేమా చాలిక...
ఆ: నీ మగసిరి నడకలలోన తెలియని మత్తేదో ఉందిరా
అది నన్ను తడిపి ముద్ద చేసే...
అ: పగలే కల కంటున్నావో కలవరింతలో ఉన్నావో
ఊహనుండి బయటకు రావమ్మో ఓఓఓ... ॥నీ స్టైలే॥
ఆ: నూటికో కోటికో నీలా ఒక్కరుంటారురా...
నూటిగా చెప్పనా నీలో కోపం నచ్చేరా...
అ: ప్రేమనే గుడ్డిది అంటే నమ్మలేదెన్నడూ...
నమ్మక తప్పదు నిన్నే చూశా ఇప్పుడు
ఆ: నీ కంటిబొమ్మల విరుపు
నీచులపై కొరడా చరుపు
అది నీపై వలపె కలిపెరా...
అ: పూవంటి హృదయంలోన తేనంటి మనసే నీది
నీ ప్రేమకు ఇదిగో జోహారే... ॥నీ స్టైలే॥

రచన: వేటూరి (4) గానం : మల్లికార్జునరావు, గోపికా పూర్ణిమ

అ: అడుగులోన అడుగువేస్తా
అడగరాన్ది అడిగి చూస్తా ఇచ్చుకో
ఆ: అడుగులోన అడుగులొద్దు
అడగరాన్ది అడగవద్దు వెళ్లిపో
అ: అవసరాల అందగాణ్ణి
అడుగుతున్నా అసలు బోణీ అదరకు
ఆ: నవరసాల చిన్నదాన్ని
నడిబజారు మేజువాణి కుదరదు మగసరిపదని ॥అడుగు॥
అ: రాసలీల ఆడువేళ రమణిబాల రగడలేల
మనసుతీర జరుపుకుంటా మస్కరా
ఆ: అదురులేదా బెదురులేదా వలపుకైన పొదుపులేదా
అదుపులేని కుర్రవాడ ఆగరా
అ: బిగువులెందుకే ఓఓఓ తగవుమానవే ఓఓఓ
సొగసుదాచకే ఓఓఓఓ...
ఆ: సగటు సుందరా ఓఓఓ పడకుతొందరా ఓఓఓ
పొగరు వద్దురా ఓఓఓఓ...
అ: హే హే హే హే
అ: చిలిపి ఈడు చిటికె వేసే చిలకపాప అలకమేసే



రచన: వేటూరి (2) గానం : కార్తీక్, కల్పన, ప్రేమ్‌గీ

అ: సారిగామపదనీసా సందుచూసి వలవేశా
అ: 'డోరెయమీ'ల స్వరమేశా డోరు అందుకే మూశా
అ: పార్వతీశ పరమేశా పాలబుగ్గ అడిగేశా
ఆ: వెంకటేశ కలినాశా వెన్నెలొస్తె గొడుగేశా
అ: త్యాగరాజ కృతి పాడిస్తా ఆ రఘేయే తిరిగొస్తే
కూచిపూడి తెగ ఆడిస్తా ఆ మడొన్నా ఇటువస్తే
మల్లెపూల మధుబాలా పిలుపందుకోవె ప్రియురాల
విరజాజి పూల విరహాల కలహాలు ఎందుకే... ॥సారిగామ॥
అ: తెలుగింటి మొగ్గ వలపు తెలవారి ముగ్గు తెలుపు
సిగపువ్వులో చిరునవ్వులో ప్రియరాగాలెన్నో తియ్యగా...
ఆ: నిను కోరి వర్ణమనుకో ఒడిచేరి వలపులనుకో
నను తీయగా పెనవేయగా చెలి ప్రాణాలై దోచెయ్యగా
అ: క్యా దేఖో తుమ్ దేఖో నా గూడు చేరవే చిలుకో...
అ: అది కిక్కో తొలి కేకో నాతోడు నీవు గోరింకో... ॥సారిగామ॥
అ: చిగురించు ఆశలనుకో చిరుగాలి ఊసులనుకో
నడకందుకో.. నడుమందుకో... వయ్యారాలే పండగ..
అ: చిలకమ్మ ముక్కు ఎరుపు చిగురాకు మూతి విరుపు
కులుకెందుకో అలకెందుకో సింగరాలే పండగ
ఆ: తొలిప్రేమా అది ఏమో పుట్టింది కొత్త పులకింత
అ: ఇది హాయో తొలి రేయో పూసింది పూల గిలిగింత
అ.... లడొలసో సవిరిడు లడొరిసో ॥సారిగామ॥

రచన: సుద్దాల అశోక్‌తేజ (3) గానం : హరీష్ రాఘవేంద్ర, సుజాత

ఆ: నీ స్టైలే నాకిష్టం నీ స్టైలే నా ప్రాణం
నువునాకోసం... ఇక సంతోషం..
అ: అంతొద్దు లేమ్మ ఈ స్నేహం చాలమ్మ
నువు నా బంధం.. ఇది ఆనందం..
ఆ: తెలిసి తెలియని నా మనసు
తరముతున్నది నీకేసే
అ: తడిసి తడియని నీ కురులే
పలుకుతున్నది నా పేరే ॥నీ స్టైలే॥
అ: నీవు మాటాడితే ప్రాణం లేచివస్తుందిరా...
అలగకున్నా సరే నీపై మోజు కలిగెలేరా...



మెరుపును తెచ్చి కుంచెగ మలచి రవివర్మ గీసిన వదనమట
నూరడుగుల శిల ఆరడుగులుగా శిల్పులు చెక్కిన రూపమట
భువిలో పుట్టిన స్త్రీలందరిలో నీదే నీదే అందమట
అంతటి అందం అంతా ఒకటై నన్నే చంపుట ఘోరమట ॥ప్రియా॥
ఆ:కో: అందమైన పువ్వా పువ్వా చెలి కురుల సురభి తెలిపేవా
అందమైన నదివే నదివే చెలి మేని సొగసు తెలిపేవా
అందమైన గొలుసా గొలుసా కాలి సొగసు తెలిపేవా
అందమైన మణివే మణివే గుండె గుబులు తెలిపేవా
అ: చంద్రగోళంలో ఆక్సిజన్నంపి అక్కడ నీకొక ఇల్లు కడతా
నీ ప్రాణాలను కాపాడేందుకు నా ప్రాణాలను బదులిస్తా ఆహాహా..
మబ్బులు తెచ్చి పరుపుగా పేర్చి కోమలాంగి నిను జో కొడతా
నిద్దురలోన చెమటలు పడితే నక్షత్రాలతో తుడిచేస్తా
పంచవన్నె చిలక జలకాలాడగ మంచు బిందువులె సేకరిస్తా
ప్రేమతో జలకాడిన జలమే గంగాజలముగ సేవిస్తా ॥ప్రియా॥

(5) గానం : నిత్యశ్రీ

పాపమ పనిపమ పనిపమ గమపా ॥2॥ సగసని పనిపమ గమగసగమ ॥2॥
తకడ తకడ తక ధిమ్, తకడ తకడ తకడ ధిమ్
తకడ తకడ తక ధిమ్, తక ధిమ్ ॥2॥ కన్నులతో చూసేదీ గురువా,
కనులకు సొంతమౌనా కనులకు సొంతమౌనా
కన్నుల్లో కనుపాపై నీవు నను విడిపోలేవూ ఇక ననువిడిపోలేవూ ॥తకడ॥
జల జల జల జల జంట పదాలు
గల గల గల గల జంట పెదాలు ఉన్నవిలే తెలుగులో ఉన్నవిలే
విడదీయుటయే న్యాయం కాదు విడదీస్తే వివరంలేదు రెండేలే రెండు ఒకటేలే
ధినక ధినక ధిన ధిల్లిల్లాన నాదిర్‌తాని తొందిరతాని దినతోం ॥2॥
రేయీ పగలు రెండైనా రోజు మాత్రం ఒకటేలే
కాళ్ళు ఉన్నవి రెండైనా పయనం మాత్రం ఒకటేలే
హృదయాలన్నవి రెండైనా ప్రేమ మాత్రం ఒకటేలే ॥కన్నులతో॥
తకడ తకడ తక ధిమ్, తకడ తకడ తకడ ధిమ్
క్రౌంచ పక్షులు జంటగ పుట్టును
జీవితమంతా జతగా బ్రతుకును విడలేవూ, వీడి మనలేవూ
కన్ను కన్ను జంటగ పుట్టును ఒకటేడిస్తే రెండోదేడ్చును పొంగేనా ప్రేమే చిందేనా
ధినక ధినక ధిన ధిల్లిల్లాన నాదిర్‌తాని తొందిరతాని దినతోం
ఒక్కరు పోయే నిద్దురలో ఇద్దరి కలలను కంటున్నాం
ఒక్కరు పీల్చే శ్వాసలలో, ఇద్దరి జీవనమంటున్నాం
తాళికొరకు మాత్రమే విడివిడిగా వెతుకుతున్నాం ॥కన్నులతో॥



టూ పీసు..డ్రస్ వేసి... సన్‌బాతూ... చెయ్యి బామ్మా
డిస్నీలాండులో కళ్లాపి జల్లి బియ్యపుపిండితో ముగ్గులు వేద్దాం రాబామ్మా
రోడ్డు మధ్యలో కొట్టేపెట్టి గారెలు వేసి అమ్ముదామా ॥రావేనా॥

(3) గానం : ఉన్నికృష్ణన్, ఎస్.పి.పల్లవి

అ: నాకే నాకా ఆ: నాకే నాకా మధుమిత
అ: హాయ్‌రబ హాయ్‌రబ హాయ్‌రబ్బా ॥4॥ ఫిఫ్టి కేజి తాజ్‌మహల్ నాకే నాకా
ఫ్లైటు తెచ్చిన నందవనం నాకే నాకా
ఆ: హాయ్‌రా హాయ్‌రా హాయ్‌రబ్బా ॥2॥
అ: పాకెట్ సైజు వెన్నెలలు నాకే నాకా ఫాక్స్ లొచ్చిన స్నిగ్ధవిక నాకే నాకా
అ: నిన్ను నేను కమ్ముకునేలా పెదవిపైనే పవళించేనా
ఆ: ముద్దుల వానలో నిన్ను తడిపేనా కురులతోటే తడి తుడిచేనా
అ: నిన్ను నేను కమ్ముకునేలా పెదవిపైనే పవళించేనా
పట్టుపువా పుట్టతేనా నీ నడుం సగం తాకనివ్వమ్మా ॥హాయ్॥
ఆ: కలిసి ఇద్దరం చిరునడకలతో అమెరికానే తిరిగొద్దాం
కడలిపై ఎర్రని తివాచి పరచి ఐరోపాలో కొలువుందాం
మనప్రేమనే కవి పాడగా ఢిల్లీకి సమాధి నిద్దరం చెడగొడతాం
ఆ: నీలాకాశమే దాటి ఎగరకు ఏమైనదో నీ మనసుకు ఉల్లాసమో ఉత్సాహమో
ప్రేమ పిచ్చితో గాల్లె తిరగకు ఏమైనదో నీ వయసుకు ఆయాసమో ఆవేశమో
అ: పైరగాలికి వయసాయే నేలతల్లికి వయసాయే
కోటియుగాలైనాగానీ ప్రేమకు మాత్రం వయస్సైపోదు ॥హాయ్॥
ఆ: షెర్రీ పూలను దోచేగాలి చెవిలో చెప్పెను ఐ లవ్ యూ
నైకస్ చెట్లలో పక్షి నాతో అన్నది ఐలవ్ యూ
నీ ప్రేమనే నువ్వు తెలుపగా గాలులు పక్షులు ప్రేమ అర్థమై కుమిలిన వేళ
అ: ఒంటి గాలిలో పూవే నిలిచెను
నీ కురులలో నిలిచెందుకే పూబాలవో పువ్వెట్టగా
చిందె చినుకులు నేలవాలెను నీ బుగ్గనే ముద్దాడగా నేనూ నిన్నూ ముద్దాడనా
ఆ: పెదవి నవ్వుల నిలిచినను ప్రాణముండును ఒక నిముషం
ప్రియా నువ్వు నన్ను వీడితే మరుక్షణముండదు నా ప్రాణం ॥హాయ్॥

(4) గానం : శ్రీనివాస్

అ: ప్రియా ప్రియా చంపొద్దే నవ్వీ నన్నే ముంచొద్దే
చెలీ కన్నులతో హృదయం కాల్చొద్దే
అయ్యో వన్నెలతో ప్రాణం తీయొద్దే ॥ప్రియా॥
చెలియా నీదు నడుమును చూశా అరెరె బ్రహ్మెంత పిసినారి
తల పైకెత్తా కళ్లు తిరిగిపోయె ఆహా అతడే చమత్కారి

## సాంకేతిక నిపుణులు

| | | |
|---|---|---|
| కథ, స్క్రీన్‌ప్లే, మాటలు | : | పోసాని కృష్ణమురళి |
| కెమెరా | : | ప్రతాప్ |
| ఆర్ట్ | : | ఆనందసాయి |
| ఎడిటింగ్ | : | మార్తాండ్ .కె.వెంకటేష్ |
| కాస్ట్యూమ్స్ | : | సాయి |
| స్టిల్స్ | : | శ్రీను |
| పబ్లిసిటి | : | ధని ఏలె |
| సమర్పణ | : | జి.వి.జి.రాజు |
| ఫైట్స్ | : | కణల్ కన్నన్ |
| పి.ఆర్.ఓ. | : | ఎల్.వేణుగోపాల్ |
| సంగీతం | : | మణిశర్మ |
| నిర్మాత | : | బి. శ్రీనివాసరాజు |
| దర్శకత్వం | : | సురేష్‌కృష్ణ |

## తారాగణం

ప్రభాస్, అన్ను, శ్వేత, మురళీమోహన్, కోటశ్రీనివాసరావు, బ్రహ్మానందం, ఎల్బీ శ్రీరామ్, రఘుబాబు,గణేష్, కృష్ణమాయ, షదాబ్, ఆనంద్‌రాజ్, మోహన్‌రాజ్, రమాప్రభ, ప్రభ, ప్రసన్నకుమార్.

పాఠక పుస్తక ప్రియులకోసం సినీ సంగీత విశ్లేషకుడు 'రాజా' పర్యవేక్షణలో 'హాసం' అందిస్తున్న ప్రత్యేక కానుక ఇది.






వేటూరి



బి.శ్రీనివాసరాజు



సురేష్‌కృష్ణ



## సాంకేతిక నిపుణులు

| | | |
|---|---|---|
| మాటలు | : | శ్రీ రామకృష్ణ |
| పాటలు | : | ఎ.ఎం.రత్నం, శివగణేష్ |
| ఆపరేటివ్ కెమెరామెన్ | : | కె.ఆర్.ప్రభాకర్ |
| సౌండ్ ఎడిటింగ్ | : | ఎన్.గణేష్‌కుమార్ |
| పబ్లిసిటీ డిజైనర్ | : | లంకా భాస్కర్ |
| పి.ఆర్.ఓ. | : | జగన్ |
| ప్రొడక్షన్ కంట్రోలర్ | : | ఎ.రఘురామ్ |
| ప్రొడక్షన్ మేనేజర్ | : | పి.రాము |
| కో-డైరెక్టర్ | : | ఆర్.మాదేష్ |
| ప్రొడక్షన్ ఎగ్జిక్యూటివ్ | : | ఆర్.ఉదయ్‌కుమార్ |
| స్పెషల్ విజువల్ ఎఫెక్ట్స్ | : | ఎస్.టి.వెంకి |
| స్పెషల్ ఆప్టికల్ ఎఫెక్ట్స్ | : | ప్రసాద్ ప్రొడక్షన్స్, ఎస్.ఎ.అజీమ్, డి.ఎస్.సత్యనారాయణ |
| కళ | : | తోట తరణి, బాలా |
| డాన్స్ | : | సుందరం, రాజు సుందరం, నాగేంద్రప్రసాద్ |
| ఎడిటింగ్ | : | బి.లెనిన్, వి.టి.విజయన్ |
| కెమెరా | : | అశోక్‌కుమార్ |
| సంగీతం | : | ఎ.ఆర్.రహమాన్ |
| నిర్మాత | : | సూర్యామూవీస్ |
| కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వం | : | శంకర్ |

## తారాగణం

ప్రశాంత్, ఐశ్వర్యరాయ్, లక్ష్మి గౌరవపాత్రలో రాధిక, నాజర్, సెంథిల్, ఎస్.వి.శేఖర్, రాజుసుందరం, గీతా.

పాఠక పుస్తక ప్రియులకోసం సినీ సంగీత విశ్లేషకుడు 'రాజా' పర్యవేక్షణలో 'హాసం' అందిస్తున్న ప్రత్యేక కానుక ఇది.

# జీన్స్



ఎ.ఎం.రత్నం



ఎ.ఆర్.రహమాన్



శంకర్

# న్యూస్ వ్యూస్

తెలుగు సినిమా చరిత్రలోనే తొలిసారిగా ఓ సినిమాకు సంబంధించిన ఆడియోఫంక్షన్ విదేశాలలో జరిగింది. చిత్రం, నువ్వు-నేను చిత్రాల దర్శకుడు తేజ తన స్వీయ దర్శకత్వంలో మహేష్‌బాబు హీరోగా నిర్మిస్తున్న 'నిజం' ఆడియో విడుదల ఫంక్షన్‌ను ఇటీవల దుబాయ్, కువైట్‌లలో ప్రవాసాంధ్రుల నడుమ వైభవంగా నిర్వహించారు.



మెగాస్టార్ చిరంజీవి తొలి క్యాసెట్‌ను ఆవిష్కరించి,ఈ చిత్ర హీరో మహేష్‌బాబుకు, రెండో క్యాసెట్‌ను ఉదయ్‌కిరణ్‌కు, మూడో క్యాసెట్‌ను నితిన్‌కు అందజేసారు.

ముందుగా మహేష్‌బాబు మాట్లాడుతూ ప్రతిహీరోకి ఇలాంటి పాత్ర చేయాలనిపించే విధంగా 'నిజం' రూపొందింది. 'ఒక్కడు' సినిమా చూసి చిరంజీవిగారు నన్ను అభినందిస్తూ బొకే పంపడంతో పాటు స్వయంగా ఓ లెటర్ కూడా రాసారు. ఆయనలాంటి మంచి మనుషులు ఇంకా ఉంటే మన తెలుగు ఇండస్ట్రీ ఎక్కడో ఉంటుంది. ఈ చిత్రం 175 రోజుల ఫంక్షన్ ఇక్కడే జరుపుకుంటామన్నారు.

ఈ వేడుకకు ముఖ్య అతిథి చిరంజీవి మాట్లాడుతూ ఇంటికి, దేశానికి దూరంగా ఉండి ఏదో లక్ష్యంతో ఇక్కడ ఉంటున్న వారికి ఆనందాన్ని కలిగించాలనే తేజ ఈ ఫంక్షన్ ఇక్కడ ఏర్పాటు చేసాడు. చాలా తక్కువ సమయంలో స్వయంకృషితో, సంకల్పబుద్ధితో ఈ స్థాయికి వచ్చిన తేజ నేటి యువతరానికి ఆదర్శ ప్రాయుడు. 'గాజువాక పిల్లా', 'రానురానంటూనే', అలాగే 'సంతోషం' చిత్రంలోని అద్భుతమైన మెలోడిలతో ఆర్పీ అదరగొడుతున్నాడు. నాకు కూడా అతను 'ఇంద్ర'లో 'అయ్యయ్యో' సాంగ్ చేసాడు. నాకే గనక గాజువాకపిల్లా సాంగ్ దొరికివుంటే ఎలా ఉండేదా అనిపించింది. తేజ-ఆర్పీలది చక్కటి కాంబినేషన్. ఆర్పీతో భవిష్యత్తులో తప్పకుండా ఓ సినిమా నేను చేస్తాను. చక్కటి కాంబినేషన్‌లో నిర్మితమైన 'నిజం' చిత్రం తప్పకుండా మంచి హిట్ అవుతుంది. ఇది 'నిజం' అని అన్నారు.

ఇదే కార్యక్రమంలో 'జయం' సిల్వర్‌జూబ్లీ వేడుకలు కూడా జరిగాయి.




'రమణ'చిత్రం ద్వారా సంగీత దర్శకునిగా పరిచయమైన మహారిషి జానపద శైలిలో పూర్తి మెలోడికి ప్రాధాన్యం ఇస్తూ 'ఎవరు మొగుడు నీకు' అనే ప్రైవేట్ ఆడియో ఆల్బమ్‌చేసారు. సోహాన్ మ్యూజిక్ ద్వారా మార్కెట్లో విడుదలైన ఈ క్యాసెట్లో మొత్తం ఎనిమిది పాటలున్నాయి.

'ఎవరు మొగుడు నీకు', 'పచ్చ చీర కట్టుకోవే', 'సందనోరి సీరకట్టి' (రచన : మహారిషి) 'నల్లబావా', 'గోల్కొండ పిల్ల', 'ఎనకేపు సోకు సూసి', (రచన : జీవన సత్యం )'చెట్టు పళ్లే కోసుకోనా', 'మారాము సేసె పిల్ల' (రచన : జి.ఎన్.రావు) అంటూ సాగే ఈ పాటల్ని రాము, డా॥ నారాయణ, హార్షిక, గాయత్రి, సుధ, తెనీసా చౌదరి, లక్ష్మి పాడగా ఖరహరప్రియ, హరికాంభోజీ, శంకరాభరణం, మధ్యమావతి, పుష్పలలిత మొదలైన రాగాలతో వీటిని స్వరపరచటం జరిగిందని సంగీత దర్శకుడు మహారిషి తెలిపారు. అంతేకాక ఒక కొత్త ప్రయోగంగా 'మల్లిక', 'సిరిమల్లిక' అనే రెండు రాగాలను ఉపయోగించడం జరిగిందని,ఈ రెండు రాగాలను డా॥ నారాయణ ద్వారా శాస్త్రీయబద్ధంగా త్వరలో వినిపించడానికి ప్రయత్నాలు చేస్తున్నామని ఆయన అన్నారు. ఈ గొప్ప అవకాశం తనకిచ్చిన దర్శకులు, మిత్రులు ధవళమల్లిక్‌కు, సోహాన్ మ్యూజిక్ అధినేత కలపాల బుజ్జిబాబుకు మహారిషి కృతజ్ఞతలు తెలిపారు.

## ఆర్పీ పట్నాయక్ మ్యూజిక్ క్లాస్



సమయం... ఉదయం ఏడుగంటలు... సాధారణంగా సినీ పరిశ్రమలోని వ్యక్తులలో చాలామంది... ఫోన్‌చేస్తే... దొరికే టైమది... 'నిజం' ఆడియో ఆవిష్కరణకు సంబంధించిన విశేషాల గురించి ఆర్పీ పట్నాయక్‌కి ఫోన్ చేసింది 'హాసం'. స్టూడియోలో ఉన్నారని తెలిసింది. స్టూడియోకి ఫోన్ చేస్తే మ్యూజిక్ క్లాస్‌లో వున్నారని సమాచారం. ఓ గంట గడిచాక తనకు వచ్చిన కాల్స్ చూసుకుని రెస్పాన్స్ ఇచ్చారు పట్నాయక్. "ఏంటి మ్యూజిక్ క్లాసులు కండక్ట్ చేస్తున్నారా?" అడిగింది హాసం. 'లేదండీ మ్యూజిక్ నేర్చుకుంటున్నాను' అన్నారు పట్నాయక్ నిజాయితీగా! 'ఇదేంటీ... కొత్త న్యూసు?' అంటూ ఆశ్చర్యపోయింది 'హాసం'. "నిజం అండీ... హిందుస్థానీ క్లాసికల్ నేర్చుకుంటున్నాను. సంగమేశ్వరరావుగారనీ... హిందుస్థానీ క్లాసికల్ మ్యూజిక్‌లో చాలా గొప్పవారు. గత నలభై అయిదు సంవత్సరాలుగా ఎందరికో నేర్పారు. వారానికి మూడు క్లాసులు తీసుకుంటున్నారు. నా గాత్రానికి సంబంధించి హిందుస్థానీ సంగీతంలో వున్న ఫ్లెక్సిబిలిటీ సరిపోతుందని సిన్సియర్‌గా నేర్చుకుంటున్నాను..." అంటూ వివరించారు ఆర్పీ పట్నాయక్. సో... భవిష్యత్తులో పట్నాయక్ ట్యూన్స్‌లో హిందుస్థానీ పోకడలు కూడా చోటుచేసుకుని మరింత అలరించే అవకాశం వుందన్నమాట.

న్యూస్ ప్యాన్

# 'నవ్వు' నవోన్మేషంగా హాస్యావధానం

మార్చిలో రవీంద్రభారతిలో హాస్యబ్రహ్మ శంకరనారాయణ తెరవెనుక కళాకారులతో నిర్వహించిన హాస్యావధానం ఒక విలక్షణ ప్రయోగం. పరుచూరి బ్రదర్స్ (అధికార భాషా సంఘం పదవి దృష్ట్యా పరుచూరి సోదరులనాలని శంకరనారాయణ చురక) ముఖ్య అతిథులుగా శ్రీయుతులు రావికొండలరావు, తనికెళ్ళ భరణి, మరుధూరి రాజా, జనార్దన మహర్షి, రేలంగి నరసింహారావు, వి.ఎన్.ఆదిత్య, సుద్దాల అశోక్‌తేజ, ఎస్.వి.రామారావు, గంగాధర్, కె.సుచరితా రెడ్డి, లక్ష్మీ మాధవరెడ్డి పృచ్ఛకులుగా వ్యవ హరించారు. ఆనాటి సభలో శంకరనారాయణ విరియించిన కొన్ని నవ్వులు-పువ్వులు:

- ముఖ్య అతిథులు మూలపురుషులు కాబట్టి వేదికకు ఓ మూల నిలబడి మాట్లాడారు. నేను 'సెంటరాఫ్ ఎట్రాక్షన్' కాదలచుకున్నాను కాబట్టి వేదిక మధ్యనుండి మాట్లాడుతున్నాను.



- (భారీ వర్షాన్ని లెక్కచేయకుండా వచ్చిన సభికుల నుద్దేశించి) 'ఎప్పటికైనా సచిన్ 'ఫన్'డూల్కర్ కావాలన్నది నా ఆశయం... అటు వర్షం జోరును, ఇటు క్రికెట్ మాయను తట్టుకుని ఇక్కడికి వచ్చిన అ'మాయ'కులైన మీకందరికీ నా నమస్కారాలు.
- (తనికెళ్ల భరణి ప్రశ్నకు సమాధానంగా) 'ఆలస్యం అమృతం విషం', 'నిదానం ప్రధానం' రెండూ కరక్టే. ఒకటి పెళ్ళికి ముందు. మరోటి తర్వాత. కారణం - పెళ్లి చూపులప్పుడు అమ్మాయి అయస్కాంతంలా కనిపిస్తుంది. పెళ్లయిన క్షణం నుంచి సూర్యకాంతంలా కనిపిస్తుంది. అప్పుడు మల్లెతీగలా, ఇప్పుడు కరెంటు తీగలా కనిపిస్తుంది.
- (చంద్రబాబుకు, వెంకటేశ్వరస్వామికి తేడా గురించి) "ఇద్దరూ చిత్తూరు జిల్లా వాళ్లే. ఎటొచ్చీ వెంకటేశ్వరస్వామి కుబేరుడిలో ప్రపంచబ్యాంకును చూసుకుంటాడు. చంద్రబాబునాయుడు ప్రపంచబ్యాంకులో కుబేరుణ్ణి చూసు కుంటాడు."
- ('చంద్ర'బాబు ఎందుకంత సీరియస్‌గా ఉంటారన్న ప్రశ్నకు) "ఆయన అనుభవాలు ఆయనివి. వినాయకుణ్ని చూసి నవ్వి దెబ్బతిన్నవాడు కదా!"
- (పాత సినిమా పాటల గురించి గంగాధర్ ప్రశ్నకు) - "అబ్బే! అర్థం చేసుకోవడంలో ఉందంతా ! 'నన్నుదోచుకుందువటే వన్నెల దొరసాని' అని పాట వింటే ఆ దొరసాని వీర షాపింగ్ చేసి అతణ్ని ఎన్ని లక్షలకు దోచుకుందో పాపం అనిపిస్తుంది"
- (మీ పేరు మార్చాలని రావికొండలరావు అనగా) "మీరు ఇంత కుండ బద్దలు కొట్టినట్టు చెబుతూంటే మీ పేరు "రావి కుండలరావు"గా మార్చాలేమో అది చూడండి"
- కొసమెరుపు : (సభికులు చాలామంది చేతిలో 'హాసం'ను గమనించి ఎస్.వి.రామారావు 'హాసం'ను నిర్వచించమనగా ) " 'హాసం' 'తెలుగు 'మంద'హాసం, తెలుగువారి మందహాసం- 'హా' అంటే హాస్యం; 'సం' అంటే సంగీతం. ఆంధ్ర జనావళిని అలరిస్తున్న విలువలతో కూడిన అతి కొద్ది పత్రికల్లో 'హాసం' ఒకటి - ఇది మనందరం గర్వించదగిన పత్రిక"

**-ఎన్.ఎల్.బుద్ధా**

---



"హాసం" ఫిబ్రవరి 16-28 సంచికలో ఇందీవర్ వర్ధంతి సందర్భంగా హెచ్.రమేష్‌బాబు గారు వ్రాసిన వ్యాసంలో ఒక చిన్న తప్పు దొర్లినది. 'నదియా చలే చలే రే చందా చలే చలే రే తారా తుఝ్‌కో చల్ నా హోగా' అనే ఇందీవర్ వ్రాసిన పాట "అనోఖీరాత్" లోనిది కాదు. ఆ పాట "సఫర్" చిత్రంలోనిది. "అనోఖీరాత్" చిత్రంలోని ఇందీవర్ పాట యిది "కోహ్ రే తాల్ మిలే నదీ కే జల్ మేఁ నదీ మిలే సాగర్ మేఁ సాగర్ మిలే కౌన్ సే జల్ మేఁ కోయీ జానే నా..." ఈ రెండు పాటలు వేదాంతంలో మునిగితేలుతాయి. ఒకటి మన్నాదే పాడితే, రెండది ముఖేష్ పాడారు.

**-బి.శ్రీనివాసరావు, హైదరాబాద్.**

'హాసం' మార్చి 16-31 సంచికలో 'ఆపాత(ట) మధురం' శీర్షికలో 1955లో వచ్చిన 'ఆలీబాబా 40 దొంగలు' చిత్రంలోని పాటలను విశ్లేషించిన తీరు ప్రశంసనీయంగా ఉంది.

అందులో 'ఖుషీ ప్రప్రంచం నీకే సొంతం సెయర సెయర సెయరా' పాటను పాడినది ఘంటసాలో, పిఠాపురం నాగేశ్వరరావో ఆ వ్యాసకర్తకు సరియైన సమాచారం లభించనందున సందిగ్ధంలో ఉన్నట్టూ, అందుకే స్పష్టంగా పేర్కొన లేనందుకు మన్నించమనీ వ్రాసారు.

నిజానికి ఆ పాటను పాడింది ఆ ఇద్దరు గాయకులు కాదు : స్వర్గీయ ఎ.ఎం.రాజా ఆ పాటను పాడారు. (ఈ విషయం నాకు ఖచ్చితంగా తెలుసు)

ఇక రెండవది -'రావే రావే తారాజువ్వా' పాటను పాడినది పిఠాపురం, జిక్కి అని ప్రచురించారు. కానీ ఆ పాటను పిఠాపురంతో బాటు పాడింది అలనాటి గాయని కె.రాణి(వినోదా వారి దేవదాసు ఫేం) అని గమనించగలరు. **-డాక్టర్.రాచర్ల రాధాకృష్ణ, గోదావరి ఎయిటింక్లయిన్, కరీంనగర్ జిల్లా**

'హాసం' 16-31 మార్చి సంచికలోని వసంత సినీ గీతాలలో "సూర్యుని చుట్టు తిరుగుతోంది భూగోళం" అనే యుగళగీతం ఘంటసాలతో పాడారు అని వ్రాసారు. నాకు తెలిసినంతవరకు పి.బి.శ్రీనివాస్‌గారితో పాడారనుకుంటాను.

**-ఎస్. సూర్యనారాయణ**

16-31 మార్చి సంచికలో పేజి నెం. 74లో వసంత సినీగీతాలు శీర్షికలో ఈడు-జోడు చిత్రంలోని పాట 'సూర్యుని చుట్టూ తిరుగుతుంది భూగోళం' వసంతతో పాటు ఘంటసాలగారు పాడారని వ్రాసారు. ఇది తప్పు.

**-ఎస్. ఈరన్న, ఆదోని, కర్నూలుజిల్లా.**

వసంత(16-31 మార్చి)"ఈడు-జోడు"లో పాడిన యుగళం ఘంటసాలతో కాదు. పిఠాపురంతో అని గుర్తు.

**-డి.ఎస్.శంకర్,వక్కలంక**

**(ఆ పాటను వసంతతో పాడినది పి.బి.శ్రీనివాస్.-ఎడిటర్)**



# కొమ్మ కొమ్మకో సన్నాయి...

## ఆ మౌనాక్షరీ గానవేదం విడిచిన ముద్ర మనల్ని ఎక్కడికో తీసుకువెళ్తుంది



'సరిగమలు' పాట గురించి వేటూరి

సినిమాల్లో ప్రయోగాత్మకమైన సినిమాలు - ఇహానికీ, పరానికి పనికొచ్చే సాహిత్యం సృష్టించడానికి అవకాశం యిచ్చేసినిమాలు - ఎప్పుడోగాని దొరకవు. అటువంటి వాటిలో క్రాంతికుమార్ దర్శకత్వంలో మలయాళ చిత్రం ఆధారంగా తీసిన "సరిగమలు" అనే చిత్రం - సంగీత సాహిత్యభరితమైన చిత్రం. పాటల రచయితగా నాకు ఎంతో తృప్తిని, మనస్ఫూర్తిగా రాశానన్న నమ్మకాన్ని కలిగించిన చిత్రం. దానికి ముఖ్యమైన కారణం-అన్నీ ట్యూన్‌లకి రాసిన పాటలే అయినప్పటికీ - ఆ ఇచ్చిన ట్యూన్‌లు కూడా సందర్భానికి పనికివచ్చేవిగా, సాహిత్యానికి ఉపకరించేవిగా ప్రేరణ కలిగించేవి వుండటం- రాసిన సాహిత్యంలో ఏమాత్రం మార్పులు చేయవలసిన అవసరం లేకుండా సన్నివేశాన్ని చెప్పినప్పుడే నాకు క్షుణ్ణంగా ఎరుకపరుచడం, నాకిచ్చిన స్వేచ్ఛ- ఇవన్నీ కలిసి 'సరిగమలు' చిత్రంలోని పాటల ప్రాదుర్భావానికి దోహదంచేశాయి.

ఒక చిత్రం కమర్షియల్‌గా హిట్ అయినప్పుడే అందులో పాటలు ప్రజల నోళ్ళల్లో పదికాలాల పాటు బతికుంటాయనే విషయం అందరికీ తెలిసిందే. కానీ అందుకు భిన్నంగా కొన్ని పిక్చర్స్ హిట్ అయినా, కాకపోయినా పాటలు మాత్రం హిట్ అయినటువంటి సందర్భాలు లోగడ చాలా ఉన్నాయి. పెండ్యాల నాగేశ్వరరావు గారి సంగీత దర్శకత్వంలో





వచ్చిన 'బావా మరదళ్ళు' 'ఆనంద నిలయం' వంటి చిత్రాలలో పాటలు మాత్రమే మిగిలిపోయాయి. ఈ 'సరిగమలు' అనే చిత్రంలో నేను రాసినటువంటి పాటలు ఆ విధంగా చాలామంది పెద్దలు, సాహితీపరులు, సంగీత విద్వాంసులు అందరికీ కూడా అతి ప్రియమైనవిగా నిలిచిపోవడం నాకు దక్కిన అవకాశాన్ని నేను సద్వినియోగం చేసుకున్నాను అనే నమ్మకాన్ని నామీద నాకు కలిగించాయి.

అందులో ఒకటి '**ప్రవాహమే గంగా ప్రవాహమే, స్వరరాగ గంగా ప్రవాహమే, అంగాత్మ సంధాన యోగమే, ప్రాప్తే వసంతేతి కాలికే పలికే కుహూగీతికా గాన సరసీ రుహమాలిక**' అన్న



వల్లవితో ప్రారంభమైన పాట. దీన్ని కె.జె.యేసుదాస్ గారు పాడటం జరిగింది. ముఖ్యంగా ఈ చిత్రంలోని పాటలు ఇంత ప్రసిద్ధి పొందటానికి మూలకారకుడు మహా సంగీత విద్వాంసుడు, మా అందరికీ పూజనీయుడైనటువంటి రవి. ఆయన ఇచ్చిన ట్యూన్లల్లో ఉన్న శక్తే అటువంటి పాటలు నాచేత రాయించింది. సన్నివేశ బలంతో పాటు, ఆ సన్నివేశానికి తగిన చక్కని ట్యూన్స్ రవిగారు ఇవ్వటం చేత వాటికి నేను రాసినటువంటి సాహిత్యం అక్కరకొచ్చింది. అందరికీ ఆప్యాయంగా చక్కని పాటలు వినడానికి ఆస్కారం కల్పించింది. ఇందులో ఈ పాట పాడేటప్పుడు జీవితంలో ఎదురుదెబ్బలు, ఏడుపుదెబ్బలు ఎన్నో తిన్నటువంటి హీరో క్యారెక్టర్ చాలా కాలంగా మూతపడిపోయిన తన గొంతు విప్పి తనవారి ముందు రాగ ప్రస్తారం చేసి తన హృదయంలో ఉన్నటువంటి ఆవేదనని, ఆక్రోశాన్ని, అనుబంధాన్ని కూడా కలిపి వెల్లడించేటువంటి సందర్భం. వసంతం వస్తే కాని చెట్లు చిగురించవు, కోయిల గళం విప్పి పాడలేదు. "ప్రాప్తే వసంతే కాలే కాకకాకః పికపికః" కాకులేవో కోకిలలేవో తెలిసేటువంటి సందర్భం వసంతకాల ప్రాదుర్భావమే అని మహాలాక్షణికులు చెబుతారు. చరణంలో...

**కుండల లోపల నిండిన నింగిలో ఉరిమెను మేఘం ఇన్నాళ్ళకి**

శూన్యం అయినటువంటిది ఆకాశం. అది సర్వ వ్యాపి. ఈ శరీరాలు కుండలు! వేదాంతంలో మనకు ఆదిశంకరాచార్యులు ప్రవచించినటువంటి ఘటాకాశ సిద్ధాంతం ప్రకారం అన్ని శరీరాల్లోనూ ఎక్కడైతే వ్యాక్యూమ్ ఉందో అక్కడల్లా ఆకాశం ఉంది. ఆకాశం అంటేనే శూన్యం. ఆకాశం శూన్యం గగనం అంటారు కనుక ఈ కుండల లోపల నిండిన మేఘం ఇన్నాళ్ళకి ఉరిమింది. ఆ శూన్యంలో ఒక నీటి మేఘం - అది ఇన్నాళ్ళకి ఉరిమింది. ఒక శబ్దం, ఒక నాదం ఇన్నాళ్ళకి పుట్టింది. ఆకాశంలోంచి శబ్దం కానీ, వెలుగు కాని పుడుతుంది. అదే విధంగా మేఘానికి రాగానికి ఉన్న సంబంధం సంగీత శాస్త్రం చెప్పింది. మేఘమల్హార్ రాగం మనకు తెలిసినటువంటిదే. కనుక శూన్యం అయినటువంటి నాలో నిండిన ఆకాశంలోంచి ఒక మేఘం ఇన్నాళ్ళకి గర్జించింది. అంటే నేను పాడగల్గుతున్నాను అని చెప్పడం. **పిల్లనగ్రోవిలో పిలవని మోవిలో కురిసెను రాగం ఈనాటికీ**, పిల్లనగ్రోవి, మోవి కలిసినప్పుడే రాగం అనే దానికి ఆకృతి ఏర్పడుతుంది. ఇక్కడ పిల్లనగ్రోవి ఆ అమ్మాయి. అమ్మాయి కళ్ళలో ఓ చైతన్యం, ఒక రాగం. ఒక నాదం, ఒక స్పందన, ఒక నాట్యం. ఒక అభినయం తిరుగుతున్నాయి.

ఇన్నాళ్లు పిలువలేదు ఈ మోవి. ఆ పిల్లనగ్రోవికి స్పర్శలేదు. ఈ పాటతో ఆ పిల్లనగ్రోవికి, (పిల్లను పిల్లనగ్రోవితో పోల్చడం అక్షర రమ్యత కోసం ఉపయోగించింది). ఈ నాటికీ ఈ పిల్లన గ్రోవిలో కూడా ఒక రాగం ఏర్పడ్డది అని చెప్పడం. **మట్టింటి రాయే మాణిక్యమై పోయే, సంగీత రత్నాకరాన.** ఈ పొంగి పొరలుతున్నటువంటి అనంతమైన ఈ సంగీత రత్నాకరంలో మట్టిల్లే పుట్టిల్లుగా ఉన్నటువంటి రాయి కూడా మాణిక్యం అయిపోతోంది. ఈ సంగీత సముద్రంలో ఒక రాయి ఈ సంగీత పరమైనటువంటి కెరటాల యొక్క ఒరిపిడిలో ఒక రత్నమైపోతోంది. నిశ్చేతనమైన శరీరంలోంచి సచేతనమైన ఒక అభిసారిక, ఒక అభినేత్రి పుట్టుకొస్తోందని చెప్పడం.

**స్వరసప్తకాలే కెరటాలుగా ఆ గంగ పొంగింది లోన.** ఏడు స్వరాలు మనకి. ఈ ఏడు స్వరాలు కెరటాలు అయినవి ఈ సంగీత రత్నాకరంలో. అయ్యేటప్పటికి ఆ రత్నాకరుని న్వవ్తస్వరాలనే బాహువులలో ప్రవేశించాలని గంగ ఉప్పొంగి పొరలిపొంగి ఆ సంగమం కోసం వస్తోంది అని చెప్పడం.

ఇక రెండో చరణం **చైతన్య వర్ణాలై నీ చైత్రసుమాలై వినిపించు రాగాలనంతాలులే!** చైత్రమాసం బహువర్ణ సముచ్చయం. పూసే పువ్వులు, మెరిసే చిగురుటాకులు ఇవన్నీ కూడా గానకళకు ప్రాణదర్పణాలు. వాటిలో అనేక రకమైనటువంటి రంగులు. అవి చైతన్యానికి గుర్తు. అంతకుముందు లేని రంగులు నిద్ర మేల్కొని ఒక వికాసానికి, ఎక్స్‌ప్రెషన్‌కి మోడులు చిగురించడం, ఆ చిగురించిన కొమ్మలో నుండి పువ్వులు పుట్టుకొని రావడం. సంగీతానికి వర్ణాలు ఉన్నవి. అవి ఆ వర్ణంపై ఉన్నప్పుడు ఆ దేవత, ఆ రంగు ఆ దేవతను పూజించలసిన పువ్వులు, అప్పుడు చదవవలసిన మంత్రం, అప్పుడు ఆచరించవలసినటువంటి క్రతువు, ఇవన్నీ కూడా స్ఫురింప చేసేదే మంత్రశాస్త్రం. కనుక ఈ మంత్రశాస్త్రం కూడా వర్ణానికి ప్రాధాన్యత గలదే. వేదమంత్రం మనం చదివేటప్పుడు సవర్ణంగా చదవాలి అంటారు. సుస్వరంగా చదవాలి అంటారు. దానికొక శృతి ఉంది. వేదగానం, వేదం అనేది అనూచానంగా పరంపరగా తరతరాలుగా వస్తోంది. అది పుస్తకాల్లో నిధిగా ఉండి రావడంలేదు. గురువు శిష్యుడికి సుస్వరంగా చెబితే ఆ స్వరం ఆ శృతిలో ఈ శిష్యుడు నేర్చుకొని అది ఇతనిలో వర్ధిల్లి ఇతని జీవితకాలం చివరికి మరో శిష్యుని దగ్గరికి వెళ్ళి పరంపరగా వస్తున్నటువంటిది కాబట్టి ఈ వర్ణాలు ఏవయితే రాగానికి ప్రేరేపణలో అవి అనంతమయినటువంటివి. సృష్టిలో ఎన్ని వర్ణాలు

ప్రవాహమే గంగా ప్రవాహమే
స్వరరాగ గంగా ప్రవాహమే అంగాత్మ సంధాన యోగమే
ప్రాప్తే వసంతేతికాలికే పలికే కుహు గీతికా
గాన సరసీరుహ మాలికా ॥స్వరరాగ॥
కుండలలోపల నిండిన నింగిలో ఉరిమెను మేఘం ఇన్నాళ్ళకి
పిల్లన గ్రోవిలో పిలవని మోవిలో కురిసెను రాగం ఈనాటికి
మట్టింటి రాయే మాణిక్యమైపోయే సంగీత రత్నాకరాన
స్వరసప్తకాలే కెరటాలు కాగా ఆ గంగ పొంగింది లోనా ॥స్వరరాగ॥
చైతన్య వర్ణాల ఈ చైత్ర సుమ వీధి
వినిపించు రాగాలనంతాలులే
ఈ చక్రవాకాలు ఎగిరే చకోరాలు
జగమంత విహరించు రాగాలులే
పిలిచే శకుంతాలు పలికే దిగంతాలు
పులకింతలా పుష్యరాగాలులే
మలి సందె దీపాలు గుడి గంట నాదాలు
మౌనాక్షరీ గాన వేదాలులే ॥స్వర॥

ఉన్నాయంటే మనం కొన్నింటికే పేర్లు పెట్టుకున్నాం, కొన్నింటికి పేర్లు పెట్టుకోలేదు. ఒకే వర్ణంగా కనిపించే దాంట్లో అనేక వివర్ణాలు ఉన్నాయి. లఘు వర్ణాలున్నాయి. వాటిని మనం షేడ్స్ అంటాం. కలర్స్ అంటే అవే! అవి కలనేత చీరలో రెండు రంగులు కలుసుకుంటే వుట్టే మూడోరంగు ఎటువంటిదో అటువంటి వర్ణాలు అన్నమాట. అదే విధంగా మేళకర్తలలోంచి జన్యమైన రాగాలలో కూడా అనేక రాగాల యొక్క స్పర్శ కలిగి అవి ఇంకొక రాగంగా తయారవడం అనేది ఉంది. నాదానికి, శబ్దానికి మధ్య, రాగానికి, స్వరానికి మధ్య ఇంకొక రాగం ...... ఇది సప్త స్వరాలలో ఇమిడిందయినప్పటికి కొత్త వికాసంతో రాగం పుట్టుకొస్తుంది. ఇలా రాగాలు అనంతాలు అని సంగీత రత్నాకరం చెబుతుంది. మన శక్తి కొద్ది, మన ఊహ కొద్ది మనకి ప్రాప్తమయ్యే వరకు రాగాలు పుడుతూనే ఉంటాయి. అది మనం చేసేటువంటి రాగారాధన మీద నాదోపాసన మీద ఆధారపడి ఉంటుంది. అదే విధంగా సృష్టిలో అన్వేషణ, పరిశోధన చేస్తున్నకొద్దీ కొత్తకొత్త రంగులు, కొత్త కొత్త వికాసాలు కొత్త కొత్త ఎరేంజ్‌మెంట్స్ ఎన్నెన్నో కనిపిస్తాయనేది మనకు తెలిసిన విషయమే. పక్షులను తీసుకుంటే రకరకాల పక్షులు సాయంత్రం గూళ్ళకు చేరేటప్పుడు, ఎన్నెన్ని శృతుల్లో జిలిబిలిగా ఎంత చక్కని స్వరధునిని మనకు వినిపిస్తాయో అందరికి తెలిసిందే. అదే



**'ఈ చక్రవాకాలు ఎగిరే చకోరాలు, జగమంతా విహరించే నాదాలులే'.**

ఒక ఆంగ్ల మహాకవి బహుశ 'షెల్లీ' అనుకుంటాను Art, thou a bird of a wandering voice! అన్నాడు. ఆ పక్షి కనిపించదు. కానీ దాని గానం వినిపిస్తూ ఉంటుంది. ఏ చెట్టు కొమ్మల్లో దాగి ఉంటుందో తెలియదు. ఆ ఎగిరే పక్షిలో ఉందో లేదో తెలియదు. ఎక్కడుంటుందో తెలియదు కానీ అది గానరూపమై, నాదరూపమై చెవిలో నుంచి హృదయానికి, హృదయం నుంచీ ఆత్మకు వెళ్ళిపోయి అక్కడ గూడుకట్టుకుంటుంది. అటువంటి ఎన్నో పక్షులు, వర్షాకాలంలో చక్రవాకాలు, కార్తీక మాసంలో, ఆశ్వయుజ మాసంలో చకోరాలు అవి చేసే వింత వింత ఆలాపనలు, వసంతంలో కోకిలలు చేసే కుహుకుహు రావాలు, మేఘ దర్శనంతో నెమళ్లు చేసే కేంకారాలు. ఆయా వేళలకు ... ఆయా వేదాలని వినిపిస్తూ.... వింత వింత కోరికల్ని విన్నవించుకునేటటువంటి ఎంతో అందమైనటువంటి ఎన్నో స్వరాలతో కూడుకున్నటువంటివే... ఈ చక్రవాకాలు ఎగిరే చకోరాలు జగమంత విహరించు రాగాలు. రాగమే పక్షి రూపంలో విహరిస్తూ ఉంటుంది. నువ్వు పక్షివా లేక ఒక గుప్పెడు రూపం పొందిన రాగానివా? రెక్కలు కట్టుకొని ఎగిరే రాగాలా అన్నట్టుగా ఉన్నటువంటి ఈ సృష్టిని గూర్చి చెప్పటం ఈ చక్రవాకాలు ఎగిరే చకోరాలు. జగమంతా విహరించు రాగాలు. పిలిచే శకుంతాలు పలికే దిగంతాలు, పులకింతల పుష్యరాగాలు, ఒక పక్షి పిలుస్తుంటుంది. అది హొరైజన్‌లోకి వెళ్ళిపోయి ప్రతిధ్వనిగామారి మళ్ళి వెనక్కి వచ్చి ఏదైతే ప్రశ్నగా వెళుతుందో అదే బదులుగా తిరిగి వస్తుంటుంది. 'యద్భావం తద్భవతి' అన్నట్టు ఏది ప్రశ్నో అదే బదులు. అట్లా శకుంత పక్షులు దిగంతాలలో గానం చేస్తుంటే, సంధ్యా రాగాలలో, కొండల్లోంచి, కోనల్లోంచి, లోయల్లోంచి వచ్చి మన ఎద లోయల్లో ప్రతిధ్వని వినిపించడం అనేది జరుగుతుంది. తద్వారా కలిగే పులకింతలు అంటే జీవికి కలిగేటటువంటి జీవ లక్షణమైన జలదరింతలు. అంటే బతికున్న తనానికి... అది బతికున్నాం అన టానికి ఒక నిదర్శనంగా, మిగిలేటటువంటి ఒక అనుభూతి. పులకింతల పుష్యరాగం, పుష్యరాగం అంటే ఇక్కడ గోమేధికమో, పుష్యరాగమో కాదు.

పుష్యమాసంలో నిద్రాణమైనటువంటి ప్రకృతి నుంచి ఒక వికాసం ప్రారంభమవుతుంది. కప్పేసిన మంచులో నుంచి కన్నుతెరిచిచూసే ఒక వికాసం. ఒక మొగ్గ రూపంలో, పువ్వు రూపంలో, పిందె రూపంలో, కాయ రూపంలో, పండు రూపంలో. అదీ ధాన్యంలో కంకి రూపంలో నిద్రాణమైన స్థితి అన్నమాట. ఆ వచ్చేటటు వంటి దాన్ని పుష్య రాగంగా పేర్కొన్నాం. అంటే ఆ పులకింతతో పుష్య రాగం మరొక దానికి, మరొక సృష్టికి పురుడుపోయటం జరుగుతుంది అని చెప్పటం. ఇదొక మౌనరాగం!

మలి సంధ్య దీపాలు... మౌనాక్షరీ గాన వేదాలు, గుడిగంట నాదాలు.... మలిసంధ్యలో హొరైజన్‌లో వెలిగే దీపం అది మహామౌనం. వెలుగెప్పుడూ మౌనమే. వెలుగు కూడా వేదమే నా దృష్టిలో. వేదం వెలుగు కాబట్టి వెలుగునిచ్చేది వేదం కాబట్టి వెలుగు రూపంలోనే ఉంటుంది. అందుకనే దాన్ని అక్షరరూపంలో రాయడం జరగలేదు. అదొక గానరూపంగా నిరక్షరంగా అనుభూతికి దొరకని ఒక అవ్యక్త మాధుర్యంతో వెలిబుచ్చాల్సిందే. మలిసంధ్య దీపాలు అంటే అసురసంధ్య వెలుగులు కావచ్చు, ఆ అసురసంధ్యా సమయంలో పొటమరించే మౌన తారకలు కావచ్చు. ఇక గుడిగంట నాదాలు... ఒక దేవలోకాన్ని ఒక దివ్యానుభూతిని, ఏదో ఒక పుణ్యమైన పురుషార్థ రూపమైన ఒక ఉత్తరస్థితిని ఆ గుడిగంట నాదం వినిపిస్తుంది. కానీ ధ్వని మనలో కలిగించే మౌనం మాత్రం చాలా పెద్దది. ప్రకంపనం ఆగిపోయిన తర్వాత కూడా లోపలికి వెళుతుండగా అది విడిచిన ముద్ర ఎక్కడికో తీసుకునివెళ్తుంది. అంతటి శక్తి దీనికి ఉంది. అదే మౌనాక్షరీ గానవేదాలులే గానం ఎప్పుడూ వినిపిస్తుంది అనుకోవటం కూడా పొరపాటు. గానం ఎప్పుడూ వినిపించదు. కొన్ని గానాలు ఊహాగానాలు అంటాం మనం. అవి వినిపిస్తాయా? వినిపించవు. అట్లాగే ఈ మౌనాక్షరీ గానం. అక్కడ అక్షరాలు ఉండవు. ఏదో ఉంటుంది. అక్షరానికి, అక్షరానికి మధ్య శూన్యం అనగా ఆకాశం అందులో ఏదో ఉంటుంది. అందులో సూర్యుడు ఉండొచ్చు, చంద్రుడు ఉండొచ్చు. తారలుండొచ్చు, మరి ఏమైనా ఉండొచ్చు. అది ఉరమవచ్చు, మెరవనూవచ్చు. అసలు గానం అంటే ఏమిటి నాదం అంటే ఏమిటి. నాదం పుడుతుంది. అది మీలో మీకు మాత్రమే పరిమితం. తద్వారా దాని బాహ్యమైన ఎక్స్‌ప్రెషన్ మాత్రమే గానం. అనంతమైన రాగాల రూపంలో ప్రస్తరించి బయటకు వచ్చేదే గానం. ధ్వనివేరు, శబ్దం వేరు. శబ్దం అంటే నాయిస్. ఈ సరిగమల్లో రాసిన ప్రతి పాటకీ నా మనసులో గూడు కట్టుకున్న భావాలు - అమృతోపమానమైనటువంటి సంగీత ప్రవాహంలో ఈ అక్షరాలుగా పూల పడవల వల్లే తేలిపోతూ మీ హృదయ తీరాలకు చేరాయి.

**- వేటూరి సుందరరామ్మూర్తి**

# ఎలుక వచ్చె ఇల్లు భద్రం



ఇలపావులూరి మురళీమోహనరావు

3

**హెచ్చరిక**

బిరగబడి నవ్వితే గుండె చిక్కబట్టి ఊపిరాడక అవస్థపడేవారు కామెడీ యాక్ట్ 2003 ప్రకారం ఈ సీరియల్‌చదవడం నిషేధం. ఒకవేళ మీ పొట్టచెక్కలైతే పత్రిక నుంచి ఎలాంటి పరిహారం రాదు. ఈ హెచ్చరిక ఈ సీరియల్ పూర్తయ్యేంత వరకు అమలులో ఉంటుంది.





## జరిగిన కథ

వెంకట్రావు, సుందరి భార్యభర్తలు.అనుహ్య వాళ్ల పాప. వాళ్ల ఇంట్లో ఓ ఎలుక దూరింది. రాత్రి చప్పుడయితే దొంగ అనుకుని పోలీసులకు ఫోన్ చేస్తే నానా రభసా అయింది. తెల్లవారి చూస్తే ఎలుక బట్టలన్నీ కొరికేసింది. ఆ ఎలుకను చంపుదామని 'రాటేట్' అని చాక్లెట్ కలర్లో కేకుల్లా ఉండే ఎలుక విషం తెస్తాడు. (ఇక చదవండి)

తొంబై సంవత్సరాల రామారావును హాస్పిటల్లో చేర్పించారు. ఆయన భార్య అంజలిని పరామర్శించడానికొచ్చింది సులోచన.
"ఇరవై నాలుగు గంటలు గడిస్తే గానీ ఏ సంగతీ చెప్పలేమన్నారు" చెప్పింది అంజలి.
"భయపడకండి. పాపీ చిరాయువన్నారు" ఓదార్చింది సులోచన.
ఇలా అసందర్భ ప్రేలాపనలు చేసేవారు ఈ భాగంలో కనిపిస్తారు.

ఎలుక వచ్చె ఇల్లు భద్రం

తెల్లవారింది. బద్ధకంగా వళ్లు విరుచుకుంటూ లేచింది సుందరి. వెంకట్రావు ఆదమరచి నిద్రపోతున్నాడు. ఇద్దరి మధ్య ఉండాల్సిన అనూహ్య లేదు. కంగారు పడి వెంకట్రావును లేపింది.

"చచ్చిందా ఎలుక?" అరుస్తూ లేచాడు వెంకట్రావు.

"బాగుంది. రాత్రంతా దాని గురించే ఆలోచిస్తున్నారా ఏం?" నవ్వుతూ అన్నది సుందరి.

"అవును. మధ్యలో నాలుగుసార్లు మెలకువ వచ్చింది. పద...పద...ముందు ఎలుకను చూద్దాం పద." ఆత్రంగా లేచాడు వెంకట్రావు.

"ఎలుక సరే...ముందు పాపాయి సంగతి చూడండి. అష్టోత్తరాలూ సహస్రనామాలూ చదివినా రోజూ తొమ్మిది గంటల దాకా నిద్రలేవంది ఈ రోజు అప్పుడే లేచి ఎక్కడికి వెళ్ళింది?" ఆశ్చర్యంగా అన్నది సుందరి.

"పద చూద్దాం. మార్నింగ్ వాక్ మంచిదని రాత్రి టి.వీ.లో చెప్పారు గదా! అది విని వాకింగ్‌కు వెళ్ళుంటుంది" నవ్వుతూ అన్నాడు వెంకట్రావు.

ఇద్దరూ కలసి కాంపౌండ్ చుట్టూ తిరిగారు. అనూహ్య ఎక్కడా కనిపించలేదు. చుట్టుపక్కల వారిని అడిగారు. తాము చూడలేదని అందరూ చెప్పారు.

దీర్ఘంగా ఆలోచిస్తూ లోపలికొచ్చింది సుందరి. వెంకట్రావు ఎదురింటాయనతో ఏదో మాట్లాడుతున్నాడు.

కెవ్వుమన్న సుందరి కేక వినిపించి లోపలకు పరిగెత్తుకొచ్చాడు వెంకట్రావు.

"ఏమైంది సుందూ..." అరిచాడు.

గజగజ వణుకుతూ చేయిజావి చూపించింది సుందరి. ఆ దృశ్యం చూసి వెంకట్రావుగావు కేక పెట్టాడు.

అనూహ్య బోర్లా పడుకుని ఎలుకకు పెట్టిన కేకును ఆప్యాయంగా నాకుతున్నది.

"వాయ్యో... వామ్మో...ఎలుకకు పెట్టిన మందును పాపాయి తింటున్నది. చచ్చాంరో దేవుడో..." శోకాలు పెట్టసాగింది సుందరి.

చుట్టుపక్కలవారంతా పరిగెత్తుకుని వచ్చారు.

"ఏమైంది వెంకట్రావుగారూ? ఏమైంది సుందరి గారూ? ఎందుకలా అరిచారు? ఎవరు చచ్చారంటున్నారు? మీ వైపు వాళ్ళెవరైనా పోయారా?" ప్రశ్నల మీద ప్రశ్నలు కురిపించ సాగారు.




జరిగిన విషయం చెప్పింది సుందరి.

"మరి ఇంకా అలాగే ఏడుస్తూ కూర్చుంటారేం? వెంనే డాక్టరు దగ్గరికి తీసుకెళ్ళండి. లేకుంటే తరువాత జీవితాంతం ఏడుస్తూ కూర్చోవలసి వస్తుంది." అన్నదొక పెద్దామె.

"అవును కాంతమ్మ గారూ. మా బాబాయి గారమ్మాయి కూడా ఒకసారి ఇలాంటి కేకునే నాకి నిద్రపోయింది. ఆ పోవడం పోవడం అంతే! మళ్ళీ లేవలేదు." తన అనుభవాన్ని గుర్తు చేసిందొకామె.

అందరూ వరసగా ఫ్లాష్‌బ్యాక్‌లోకెళ్ళి రకరకాల అనుభవాలను ఏకరువు పెట్టసాగారు.

దంపతులకు ముచ్చెమటలు పోశాయి.

"తెల్లారితే మనింట్లో శవం లేస్తుందని ఏ వెధవ నోటితో అన్నారో కానీ అయ్యో నా బంగారు తల్లీ..." శోకాలు పెట్టసాగింది సుందరి.

"ఆపు నీ శోకాలు...ముందు హాస్పటల్‌కు పద..." పిల్లనెత్తుకుని పరుగుదీశాడు వెంకట్రావు. సుందరి కూడా పరిగెత్తింది.

ж ж ж

అశోకా హాస్పిటల్.

పేషెంట్లు కిటకిటలాడిపోతున్నారు.

"మీ టోకెన్ నెంబర్ తొంబై నాలుగు. మీ వరస వచ్చేసరికి సాయంత్రం ఏడౌతుంది. ఏడు నుంచి ఎనిమిది వరకు డాక్టరుగారి భార్య టీవీలో సీరియల్స్ చూస్తారు. ఆ సమయంలో సాక్షాత్తు రాష్ట్రపతే వచ్చినా డాక్టరుగారు పేషెంట్లను చూడరు." చెప్పాడు కాంపౌండరు.

"ఆమె సీరియల్స్ చూడడానికి డాక్టరుగారు పేషెంట్లను చూడకపోవడానికి సంబంధం ఏంటండీ" విసుగ్గా అడిగాడు వెంకట్రావు.

"మరి వంటెవరు చేస్తారండీ? ఎనిమిదిన్నరకల్లా డాక్టరుగారు భోజనం చెయ్యాల్సిందే..లేకపోతే ఆయనకు కడుపులో ఎలుకలు పరిగెడతాయి" చెప్పాడు కంపౌండరు.

"బాబూ...అయ్యా...మీకు పాదనమస్కారం చేస్తాను. మాది అర్జెంటుకేసు. ప్రాణప్రమాదం. తొందరగా డాక్టరుగారిని చూడనివ్వండి" బతిమాలుతూ అన్నది సుందరి.

"అలాగా...అర్జెంటు కేసులైతే అయిదు వందలు ఎక్స్‌ట్రా తీసుకుని చూస్తారు డాక్టరుగారు. సరేనా?" వెంకట్రావు జేబువంక చూస్తూ అన్నాడు కాంపౌండరు.



# ఎలుక వచ్చె ఇల్లు భద్రం

"డాక్టర్... డాక్టర్... పొద్దున మీరు ఇంజక్షన్ ఇమ్మన్న నలుగురు పేషెంట్లలో ముగ్గురు చచ్చిపోయారు"కంగారుగా చెప్పింది నర్సు.
"మైగాడ్! మరి నాలుగో పేషెంట్?" అడిగాడు డాక్టర్.
"అతను బాగానే ఉన్నాడు. అతనికి ఇంజక్షనివ్వడం మర్చిపోయాను." చెప్పింది నర్సు.
ఇలాంటి డాక్టరొకడు ఈ భాగంలో తగుల్తాడు.

"అలాగే...కానివ్వండి" తల ఊపాడు వెంకట్రావు.

"ముందు డబ్బులు" చేయిజాపాడు కాంపౌండరు.

డబ్బులిచ్చాడు వెంకట్రావు.

లోపలికెళ్ళారు. లోపల పేషెంట్లెవరూ లేరు. డాక్టరు విలాసంగా త్రిబుల్ ఫైవ్ కాలుస్తూ ఇంటర్నెట్‌లో సెక్సు వెబ్ సైట్లు చూస్తున్నాడు.

వెంకట్రావును చూసి కంగారుపడి కంప్యూటర్ క్లోజ్ చేశాడు.

"ఇడియట్..స్టుపిడ్" కోపంగా అన్నాడు డాక్టరు.

"ఎవరిని సార్ తిడుతున్నారు?" అడిగాడు వెంకట్రావు.

"సారీ...సారీ... మిమ్మల్ని కాదు. మా కాంపౌండరు గాడిదను. ఎన్నిసార్లు చెప్పినా సడన్‌గా పేషెంట్లను లోపలకు తోల్తాడు. వాడి తోలు వలిచినా పాపం లేదు" అన్నాడు.

"కంప్యూటర్లో ఏదో చూస్తున్నారు?" కోపంగా అన్నాడు వెంకట్రావు.

"ఆఁ...ఆఁ...అదే...అదే...మా హాస్పటలంతా కంప్యూటరైజ్ చేశాం కదా? పేషెంట్ల పేర్లు, వాళ్ళ రోగాలు, వాళ్ళకిచ్చిన మందులు, వాళ్ళకు చెప్పిన డైటింగ్ వివరాలు దీంట్లో ఫీడ్ చేస్తాం. లేకపోతే ఈ సిస్టర్స్ నడిగితే ఒక మందు బదులు మరొక మందు, ఒక పేషెంట్ పేరు బదులు మరొక పేషెంట్ పేరు చెబుతుంటారు. దట్సాల్‌రైట్... ఇంతకూ మీ ప్రొబ్లెమ్ ఏంటి?" అడిగాడు డాక్టరు.

"ప్రొబ్లమ్ మా పాపాయికండీ...ఎలుకల మందు తిన్నది. తొందరగా చూడండి" కంగారుగా చెప్పాడు వెంకట్రావు.




ఆశ్చర్యపోయాడు డాక్టరు.

"ఈ పాప వయసెంత?" అడిగాడు.

"నాలుగేళ్ళు సార్"

"హా...హతవిధి! కలికాలం అంటే ఇదేనండీ! నాలుగేళ్ళ పాపలు సైతం ఎలుకల మందులు, పురుగుల మందులు తిని ఆత్మహత్యా ప్రయత్నాలు చేస్తుంటే ఏం చెప్పాలి?"

"అయ్యయ్యో...మీరు పొరబడుతున్నారు. అలాంటిదేం లేదండీ..."

"ఎలుకలు మందు తిన్నదని మీరే అంటూ మళ్ళీ అలాంటిదేం లేదంటారే? ఏదైనా లవ్ ఎఫైరా? ఇంటర్నెట్ల కాలం కదండీ. చెప్పలేం. ఇంతకీ ఆ కుర్రవాడెవరు?"

"ఖర్మ ఖర్మ...పాపాయి పొరపాటున ఎలుకల మందు తిన్నదండీ..."

"అదేమైనా చాక్లెట్టా తినడానికి? సో...ఇది మెడికో లీగల్ కేసు. ముందు గవర్నమెంట్ హాస్పటల్‌కు తీసుకెళ్ళండి. వాళ్ళు పోలీసులకు ఇన్ఫామ్ చేసి ట్రీట్‌మెంట్ మొదలు పెడతారు. ఇక్కడేమైనా అయిందంటే నా మెడకు చుట్టుకుంటుంది. అందునా ఆడపిల్ల ఆత్మహత్య చేసుకుందంటే డౌరీ కింద పోలీసులు కేసు బుక్ చేస్తారు" స్టెత్‌ను ఊపుతూ చెప్పాడు డాక్టర్.

తలబాదుకున్నారు దంపతులిద్దరూ.

"వార్నాయనో...అది కాదండీ డాక్టరుగారూ... ఇంట్లో ఎలుక చేరిందని కేకులాంటి మందొకటి తెచ్చి నాలుగు రూముల్లో పెట్టాం. దాన్ని కేకు అనుకుని మా పాప కొంచెం తిన్నది. అందుకని తెచ్చాం. మా పాప ప్రాణాలను కాపాడండి. మీ కాళ్ళు పట్టుకుంటాం." ఏడుస్తూ చెప్పింది సుందరి.

"ఇ...సీ...కొంచెం ఫీజు ఎక్కువౌతుంది ఇలాంటి కేసులకు..." కనుకొనలతో చూస్తూ చెప్పాడు డాక్టర్.

"ఫరవాలేదు. ముందు పాప..."

"ఓకె...ఇలా టేబుల్ మీద పడుకోబెట్టండి." లేచాడు డాక్టరు.

స్టెత్‌స్కోపుతో వళ్ళంతా పరీక్షించాడు. మళ్ళీ కుర్చీలో కూర్చుని లెటర్ హెడ్ మీద వ్రాయ సాగాడు.

రెండు పేజీలు నిండిపోయాయి. పేజీలు పరపర చించి వెంకట్రావు కిచ్చాడు.

"ఏంటిదీ?" అర్థంకాక అడిగాడు వెంకట్రావు.

"డాక్టరుగారింట్లోకి ఏవైనా సరుకులు కావాలేమో తొందరగా సూపర్ మార్కెట్‌కు వెళ్ళి పట్రండి" చెప్పింది సుందరి.

చిద్విలాసంగా నవ్వాడు డాక్టరు.

"కాదమ్మా...ఇది పాపాయికి చేయించవలసిన పరీక్షల లిస్టు... గుండె ఎక్స్‌రే, బ్రెయిన్ స్కానింగ్, వెన్నెముక ఎక్స్‌రే, మలమూత్ర పరీక్షలు, రక్తపరీక్షలు, బీపీ, షుగర్ టెస్టులు, బోన్స్ ఎక్స్‌రే వగైరా వగైరా..." చెప్పాడు.

నిర్ఘాంతపోయారు దంపతులు.

"అదేంటిసార్...నాలుగేళ్ళ పసిదానికి బీపీ, షుగర్ టెస్టులా? దానికెందుకుంటాయవన్నీ?" అడిగాడు వెంకట్రావు.

"భలేవారే...కళ్ళు, ముక్కు, చెవులు, కాళ్ళు, చేతులు అప్పుడే పుట్టిన పాపకుంటాయి. మరో



"డాక్టర్‌గా పైకి రావాలంటే ఏం చెయ్యాలి?" వృద్ధ డాక్టరును సలహా అడిగాడు కుర్ర డాక్టర్.
"ప్రిస్క్రిప్షన్ ఏ మాత్రం అర్థం కాకుండా రాయాలి.
బిల్లు మాత్రం ప్రతి అక్షరం, అంకె అర్థమయ్యేలా రాయాలి" చెప్పాడు వృద్ధ డాక్టర్.
ఇలాంటి వాడే డాక్టర్ దుర్యోధన్. కావాలంటే చదవండి.

## ఎలుక వచ్చె ఇల్లు భద్రం

గంటలో చావబోయే ముసలాడికీ ఉంటాయి. అలాగే షుగర్, బీపీ అనేవి మనిషిగా పుట్టిన ప్రతి వాడికీ ఉంటాయి" చెప్పాడు డాక్టరు.

"అది సరేనండీ...ఇలాంటి రోగాలు నలభై, ఏభై దాటిన వారిలో కదా వచ్చేది?" అడిగింది సుందరి.

"కలికాలం అంటే అదేనండీ. గర్భంలో ఉన్న శిశువుకే గుండె ఆపరేషన్లు చేసిన సంఘటనలున్నాయి. అయినా బీపీ, షుగర్లు నలభై దాటిన తరువాతనే వస్తాయని చెప్పిన ఆ గాడిదెవడో రమ్మనండి. నిలదీసి అడుగుతాను. నలభై దాటిన తర్వాతనే తగల బెట్టి బూడిదను విస్కీలో కలుపుకుని తాగుతాను" ఛాలెంజింగ్‌గా అన్నాడు డాక్టరు.

"వద్దులెండి. ఈ చివరో పరీక్ష రాశారు. సరిగ్గా అర్థం కావడంలేదు. ఇదేంటి?" ఒకదాని మీద వేలు పెట్టి చూపిస్తూ అడిగాడు వెంకట్రావు.

డాక్టరు నాలుగైదు సార్లు అటు ఇటు తిప్పి చూశాడు. కళ్ళజోడు తీసి ఒకసారి, కళ్ళజోడు పెట్టుకుని ఒకసారి చూశాడు. పెదవి విరిచాడు.

"ఇదేంటో నాకూ అర్థమై చావడంలేదు. లాబ్‌వాళ్లకు తెలుస్తుంది లెండి మీరేం వర్రీ కావద్దు." అభయమిచ్చాడు.

"సరే... నేను వెళ్ళొస్తాను" లేచాడు వెంకట్రావు.

"ఎక్కడికీ?" అడిగాడు డాక్టర్.

"ఈ మధ్యనే మా ఫ్రెండొకడు దాదాపు ఏభై లక్షల రూపాయల ఖర్చుతో లేటెస్ట్ ఎక్విప్‌మెంట్‌తో డయాగ్నస్టిక్ సెంటర్ పెట్టాడు. అక్కడికెళ్ళి చేయించుకొస్తా..." చెప్పాడు వెంకట్రావు.

"నరినరి...భలేవారు. ఈ పరీక్షలు చేయవలసింది మంచి అనుభవమున్న వాళ్లు కానీ హంగులు, ఆర్భాటాలతో షాపులు నడిపే వాళ్ళు కాదు. వాళ్ళదంతా పైన పటారం లోన లొటారం. రక్తాన్ని చూస్తేనే కళ్ళు తిరుగుతాయి వాళ్ళకు. ఆ కంగారులో పిచ్చి పిచ్చి రిపోర్టులు రాస్తారు. వాటిని చూసి మేము ట్రీట్‌మెంటిస్తాము. దాంతో గోవిందా..." చేతులెత్తి దణ్ణం పెట్టాడు డాక్టరు.

భయమేసింది వెంకట్రావుకు.

"మరెక్కడ చేయించమంటారు?" అడిగాడు.

"అలా అడగండి. విజయవాడ హైవేలో పదహారో నెంబరు మైలురాయి దగ్గర హేట్ అన్ హెడ్ డయాగ్నస్టిక్ సెంటర్ ఉంది. డాక్టరుగా అరవై సంవత్సరాల అనుభవమున్న డాక్టర్ దైవాధీనం గారు దాన్ని నడుపుతున్నారు. అక్కడ




చేయించండి. పర్‌ఫెక్టు రిజల్ట్స్ వస్తాయి" చెప్పాడు డాక్టరు.

"అబ్బో... అది చాలా దూరం కదండీ... ఆటోలో వెళ్ళి రావడానికే మూడొందలు అవుతుంది. ఇక్కడ వేరేవరైనా మంచివిలేవా?" అడిగాడు వెంకట్రావు.

"లేకేం? ఇంజక్షన్ చెయ్యడం చాతైన వాడల్లా వాడకు పది సెంటర్లు పెడుతున్నాడు. ఇది ప్రాణానికి సంబంధించింది కాబట్టి నే చెప్పేది చెప్పాను. ఇక మీ ఇష్టం. ఎక్కడైనా చేయించుకోండి కానీ తరువాత నన్నేం అనద్దు" కోపాన్ని ధ్వనింపజేశాడు డాక్టర్.

సుందరికి విసుగెత్తింది.

"ఎందుకులెండి డాక్టరుగారు చెప్పినచోట చేయిద్దాం. కానీ అంతవరకు పాపకు..." తడ బడుతూ అడిగింది సుందరి.

"ప్రస్తుతానికి రెండు ఇంజక్షన్స్ ఇస్తాను. వీలైనంత త్వరగా టెస్టులు చేయించి పాపను తెండి. ఇంటెన్సివ్ కేర్ యూనిట్లో రెండు రోజులుంచాలి. తరువాత చాలా టెస్టులు చెయ్యాలి వెళ్ళిరండి" చెప్పాడు డాక్టరు.

తమ కర్మానికి తమనే నిందించుకుంటూ ఆటోలో బయల్దేరారా దంపతులు.

జ జ జ

ఆటో సిటీ లిమిట్స్ దాటి పరుగులు తీస్తున్నది. ఆ డయాగ్నస్టిక్ సెంటర్ ఎక్కడ దొరుకుతుందా అని చెరోదిక్కు చూస్తున్నారు దంపతులు. సెకను సెకనుకు మారిపోతున్న మీటర్ రీడింగ్ చూస్తుంటే వెంకట్రావుకు ముచ్చెమటలు పోస్తున్నాయి.

"ఎక్కడుందీ దరిద్రపు సెంటర్... విజయవాడకు పోయినా దొరికేట్లు లేదు. ఛి ఛీ... ముండమోపి ఎలుకతో ఎంత చిక్కొచ్చి పడింది! డబ్బుకు డబ్బు... శనికి శని..." విసుగ్గా అరిచాడు వెంకట్రావు.

"కనుచూపు మేరలో కొండలు గుట్టలు తప్ప ఇల్లు అనేది కనపడటంలేదు. ఇంత దూరం పంపించాడంటే ఆ డాక్టరుకు వీడికి ఏదో లింకు ఉండుంటుంది" అన్నది సుందరి.

"లేకపోతే సిటీలో లక్ష సెంటర్లుంటే ఇక్కడికే ఎందుకు వెళ్ళమంటాడు? అంతా దొంగలు" అన్నాడు వెంకట్రావు.

"దేన్ని గురించి సార్ మాట్లాడుతున్నారు?" అడిగాడు ఆటోవాలా.

"ఇక్కడేదో హేట్ ఆన్ హెడ్ అనే డయాగ్నస్టిక్ సెంటర్ ఉందిట! ఎక్కడా



## ఎలుక వచ్చె ఇల్లు భద్రం

ఇలపావులూరి మురళీమోహనరావు

**డాక్టరంటే ప్రాణాలు కాపాడవలసిన దేవుడు. ప్రతి నిముషానికీ వెల కట్టేవాడు మగ రూపంలో ఉన్న వెలయాలు కాదా? కామాతురుడి బలహీనత క్యాష్ చేసుకుంటుంది వేశ్య. పేషెంట్ ప్రాణ భయాన్ని డబ్బు చేసుకుంటారు డాక్టర్లు. నిజమో కాదో ఈ భాగం చదవండి.**

కనపడిచావదు" చెప్పాడు వెంకట్రావు.

పగలబడి నవ్వాడు ఆటోవాలా.

"ఎందుకలా నవ్వుతావా? నేనేమైనా జోకు వేశానా?" కోపంగా అన్నాడు వెంకట్రావు.

"మిమ్మల్ని డాక్టర్ దుర్యోధన్ పంపించారా?" నవ్వుతూనే అన్నాడు ఆటోవాలా.

"అరె! నీకెలా తెలుసు?" ఆశ్చర్యంగా అడిగాడు వెంకట్రావు.

"అదంతేలెండి..." అంటూనే రోడ్డు నుంచి కుడివైపుకు తిప్పాడు ఆటోను ఆటోవాలా.

"అయ్యయ్యో ఏంటి ఇటు తిప్పావు? ఇటంతా పెంటకుప్పలు చెత్తా చెదారం ఉంటే... కొంపదీసి మమ్మల్ని కిడ్నాప్ చేస్తున్నావా ఏంటి?" కంగారుగా అరిచాడు వెంకట్రావు.

సినిమాలో విలన్‌లా వికటంగా నవ్వాడు ఆటోవాలా.

"మీ ముఖాలు చూస్తుంటే మీరు పాతిక వేలిస్తామన్నా ఎవరూ కిడ్నాప్ చెయ్యరు. మీరు చెప్పిన ఆ సెంటరు ఇటే ఉంది" రయ్‌మని ఆటో పోనివ్వసాగాడు ఆటోవాలా.

కొంచెంసేపు అలా వెళ్ళిన తరువాత నాలుగైదు పూరిపాకలు కనిపించాయి. ఆటోను ఆపాడు డ్రైవర్.

"ఏంటిక్కడాపావు? ఇక్కడేమైనా కల్లు తాగే ప్రోగ్రాం ఉందా ఏంటి?" భయపడుతూ అడిగింది సుందరి.

"లేదు మేడమ్. మీరు వెతికే ఆ సెంటర్ అదే." ఓ పాకను చూపిస్తూ చెప్పాడు ఆటోవాలా.

సుందరి, వెంకట్రావు ఆ పాకలోకి వెళ్ళారు.

లోపల ఒక టేబుల్ మీద పది ప్లాస్టిక్ డబ్బాలు చిన్నవి, ఒక పెద్ద గాజు సీసా, కొన్ని చిన్న గాజు సీసాల్లో రంగు రంగుల ద్రవపదార్థాలు, ఒక పురాతన ఎక్స్‌రే మిషన్ ఒక చిన్న కంప్యూటర్ ఉన్నాయి. ఇవాళో రేపో అన్నట్లున్న తొంభై సంవత్సరాల వృద్ధుడు కుర్చీలో కూర్చుని పేపర్ చదువుకుంటున్నాడు.

"ఇక్కడ డయాగ్నస్టిక్ సెంటర్ ఉందిట! ఎక్కడో మీకు తెలుసా?" వృద్ధుడిని అడిగాడు వెంకట్రావు.

"హి...హి...హి...యస్...ఇదే అది. అయామ్ డాక్టర్ దైవాధీనం. యమ్మ్.బి.యస్. ఇన్ నైన్టీన్ థర్టీ. వాడ్డూ యూ వాంట్?" అడిగాడు దైవాధీనం.

"డాక్టర్. దుర్యోధన్‌గారు పంపించారు...నా పేరు వెంకట్రావు" చెప్పాడు వెంకట్రావు.

"ఓ...చిన్నపాపాయి సూసైడ్ అటెంప్ట్ చేసిందని..." గొణిగాడు వృద్ధుడు.

"నో నో...ఇట్స్ రాంగ్... అయినా మీకెలా




తెలిసింది?" ఆశ్చర్యంగా అడిగాడు వెంకట్రావు.

"డాక్టర్ దుర్యోధన్ ఫోన్ చేశారు. వెరీ నైస్ డాక్టర్. వేరీజ్ ద ప్రిస్క్రిప్షన్?" నవ్వుతూ అన్నాడు దైవాధీనం.

వెంకట్రావు ప్రిస్క్రిప్షన్ తీసిచ్చాడు. రెండు పేజీలను పరిశీలించాడు దైవాధీనం.

"వీటన్నిటికి ఎంతౌతుందండీ?" అడిగాడు వెంకట్రావు.

"జస్ట్ ఎ మినిట్" కాలిక్యులేటర్ తీసుకుని లెక్కలు వేయసాగాడు దైవాధీనం.

"అన్నీ కలిపి తొమ్మిది వేల తొంభై రెండు రూపాయలౌతాయి. టెన్ పర్సంట్ డిస్కౌంట్..." దైవాధీనం చెబుతుండగా ఫోన్ మోగింది.

"హలో...దైవాధీనం...డాక్టర్ దైవాధీనం హియర్..."

"హలో...నేను డాక్టర్ దుర్యోధన్ని..."

"యస్...యస్...డాక్టర్...వాటీజ్ ద మాటర్?"

"ఆ పేషెంట్లు వచ్చారా?"

"వచ్చారు..."

"సీ డాక్టర్...ఆ వెంకట్రావు గవర్నమెంట్ ఎంప్లాయీ...మంచి లంచగొండి కూడా నంటారు. వీలైనంత వరకు బాగా గుంజండి."

"ఓకె. ఓకె...నేనా పని మీదనే ఉన్నాను"

"రిపోర్టులు అరగంటలో ఇవ్వాలంటే నాలుగొందలు ఎక్కువౌతుందని చెప్పండి"

"ఓకె....ఓకె..."

"నిజానికా టెస్టులు ఏవీ అవసరంలేదు. ఏదో ఫ్రెండ్షిప్ కొద్దీ పంపించాను"

"ఐనో...ఐనో...మీ మంచితనం నాకు తెలీదా డాక్టర్? ఎనీ డెంజర్?"

"నథింగ్...ఆ పిచ్చి ముండ ఎలుకల మందు నాకిందట. నిజానికి ఆ మందు మొత్తం నోట్లోకుక్కినా ఎలుకపిల్ల కూడా చావదు. ఇక ఈ పిల్ల ఎక్కడ చస్తుంది? అంతా వాళ్ళ కంగారు. కాసిని నీళ్ళు వుక్కిలించి ఉమ్మేయిస్తే సరిపోతుంది. ఆపని ఇక్కడ నేను చేస్తాను."

"ఓకె డాక్టర్..."

"మీరు డిస్కౌంట్లు లాంటివి వాళ్ళకేం ఇవ్వనవసరంలేదు. బాగా వదిలించి నా ఫిఫ్టీ పెర్సంట్ కమీషన్ మాత్రం మర్చిపోవద్దు. వెంటనే పంపండి ఓకే?"

"అది మీరు వేరే చెప్పాలా డాక్టర్... పేషెంట్‌కే ఇచ్చి పంపించనా?"

"వద్దొద్దు. సాయంత్రం మా కాంపౌండర్‌ను పంపుతా."

"ఓ. యస్..."

"ఉంటాను"

ఫోన్ పెట్టాడు దైవాధీనం.

"చూశారా డాక్టర్ దుర్యోధన్ ఎంత మంచివాడో. చాలా కేర్‌ఫుల్‌గా టెస్టులు చెయ్యమని చెబుతున్నాడు. పేషెంటంటే పంచప్రాణాలు" చెప్పాడు.

"ఏదో డెంజర్ అంటున్నారు?" అడిగింది సుందరి.

"రిపోర్టుల ఆధారంగా మధ్యాహ్నానికి ట్రీట్‌మెంట్ మొదలు పెట్టక పోతే ప్రాణాలకు ప్రమాదం అనీ. అందువల్లన నాలుగొందలు ఎక్కువైనా సరే అరగంటకల్లా రిపోర్టులు పంపమంటాడు."

"ఇందాకేదో డిస్కౌంట్ అన్నారు...?"

"యస్...యస్...డిస్కౌంట్ పోగా తొమ్మిది వేల తొభై రెండు రూపాయలన్నాను. లెటజ్ స్టార్ట్" సిరంజితో రక్తం తీసుకున్నాడు దైవాధీనం.

"ఈ చివర్లో మరో టెస్టేదో రాశారు డాక్టరుగారు. ఇదేంటండీ" అడిగాడు వెంకట్రావు.

పగలబడి నవ్వాడు దైవాధీనం.

"ఎందుకు నవ్వుతున్నారు?" అర్థంకాక అడిగాడు వెంకట్రావు.

"మరేం చెయ్యమంటారు? అది టెస్టుకాదు. డాక్టర్ సంతకం!" నవ్వుతూనే చెప్పాడు దైవాధీనం.

సుందరి, వెంకట్రావులకు కూడా అంత విషాదంలోనూ నవ్వు వచ్చింది.

(ఇంకా వుంది)

1-03-2003 'హాసం' పత్రికలో ఆచార్య తిరుమల గారి 'నవ్వుటద్దాలు' వ్యాసం చాలా బాగుంది. సరళంగా మాట్లాడే తెలుగు భాషలో యిన్ని అద్భుతాలున్నాయా? అని చాలా ఆశ్చర్యం కలిగింది. ఎటునుంచి చదివినా అవే పదాలు వచ్చే పద్యాలు, అర్థగర్భితమైన 'ర'కారఫ శ్లోకం చదివినా మా ఆనందానికి అంతేలేదు. ఆచార్య తిరుమలగారు ఏం రాసిన అద్భుతంగానే ఉంటుంది. ఇంతమంచి విషయాలు పాఠకులకు తెలియచేసిన వారికి మా హృదయ పూర్వక ధన్యవాదాలు! తిరుమల గారంతటి వారికే అర్థం తెలియని "షడ్జ మడ్జ.." పద్యాన్ని కనీసం ఉచ్చరించగలిగితే గొప్ప మాటే అని స్ఫురింపజేస్తున్న ఇలస్ట్రేషన్ చాలా బాగుంది.

**-కె. నారాయణ, హైదరాబాద్.**

1-03-2003 'హాసం' పత్రికలో ఆచార్య తిరుమల గారి 'నవ్వుటద్దాలు' వ్యాసం 'హాసం' పత్రికకే హైలేట్! అలనాటి కవులు అక్షరాలతో చేసిన అద్భుతాల్ని తిరుమలగారు పాఠకలోకానికి తెలిపిన తీరు అద్భుతంగా ఉంది. ఈ వ్యాసం ద్వారా తెలుగు భాషలో ఎన్ని అద్భుత ప్రక్రియలు ఉన్నాయో తెలిసి ఆశ్చర్యానందాలు కల్గాయి. తెలుగుని స్పష్టంగా ఉచ్చరించలేని నేటి యువతరానికి తెలుగు గొప్పదనాన్ని, తీయదనాన్ని ఈ విధంగా తిరుమల గారి వంటి మహానీయులచే చవిచూపిస్తున్న మీకు హార్దికాభినందనలు! తిరుమల గారి వ్యాసాలు సామాన్యులే కాదు నేటి సాహిత్యకారులు కూడా భద్రపరచుకోవలసిన అవసరముందని భావిస్తున్నాను. ఈ పత్రికలోని సీరియల్, కార్టూన్స్, జోక్స్ కూడా చాలా హాస్యాన్ని పంపిస్తూ, ఆనందాన్ని కలిగించాయి.

**-కె. పద్మినీ రంగనాథన్, హైద్రాబాద్.**

మార్చి 1-16 సంచికలో "సినీ గీతకోశం" చాలా చాలా ఉపయోగకరమైనది. పాత, కొత్త సినిమాలన్నింటిని అక్షరక్రమంలో సేకరించి వివరంగా ఇస్తున్నందుకు ఆంధ్ర, ఆంధ్రేతర తెలుగు సినీ అభిమానులు 'హాసం' కు ఋణగ్రస్తులు. కలకాలం భద్రపరచుకొని సందేహాలొస్తే తీర్చే ఒక ప్రమాణ పత్రిక గా 'హాసం' నిలవాలని నా ప్రగాఢ ఆకాంక్ష. "సినీ గీతకోశం" లో సంఖ్యాపరంగా 152 తర్వాత 154 చోటు చేసుకుంది. 'అమ్మకోసం'లో అందాలవలపు జంటకు పాటను ఎల్.ఆర్.ఈశ్వరితో బాలు పాడారు మరి సుశీల పేరు వ్రాశారు. ఇటువంటి దోషాలు ఒక ప్రామాణిక పత్రికగా దాచుకొనే "హాసం"లో వెలువడరాదని నా విన్నపములు.

**-డా॥ సయ్యద్ రహమతుల్లా, పర్లాకిమిడి (ఒరిస్సా).**

'హాసం' పత్రిక సంవత్సర కాలంగా చదువుతూ సమర్థవంతంగా నిర్వహిస్తున్న మిమ్ము అభినందిస్తున్నాను. ఇటువంటి ఆరోగ్యకరమైన




నాపేరు వల్లి. రేడియో వల్లిగా పిలిచేవారు. మీ 'హాసం' పత్రిక నేను రెగ్యులర్‌గా కొంటాను. అందులో మీరు ప్రచురిస్తున్న పాటలు చాలా వరకు నాకు వచ్చినవే. ఇప్పుడు ముఖ్యంగా ఎందుకం రాస్తున్నానంటే మీరు 16-3-2003న ప్రచురించిన పత్రికలో బి.వసంత గురించి పరిచయం చదివాను. ఆ అమ్మాయిని మొట్టమొదట విజయవాడ ఆలిండియా రేడియో పిల్లల ప్రోగ్రామ్‌లో పాడించినదాన్ని నేను. (అప్పుడు నేను రేడియో అక్కయ్య గాను, ఏడిద కామేశ్వరరావు అన్నయ్య గాను వ్యవహరించేవాళ్లం.) వాళ్ళ నాన్న రవిగారు రేడియో నాటికలలో పాల్గొనేవారు. వసంత అంత చిన్న వయసులోనే చాలా తియ్యగా, చక్కగా ధైర్యంగా పాడేది. నేనెప్పుడూ రవిగారితో అనేదాన్ని ఆమెకు మంచి భవిష్యత్తు వుందని. ఈనాడు ఆమె వ్యాసం చదివి చాలా ఆనందించాను. ఆమెకు నా ఆశీస్సులు.

**- జి.వల్లి, హైద్రాబాద్.**

పత్రిక కలకాలం నిలవాలనీ, ఇతోధికంగా అభివృద్ధి చెందాలనీ మనస్ఫూర్తిగా కోరుకుంటున్నాను.

**- డా॥ ఎం.ఎ.రామరాజు, పిఠాపురం.**

16-31 మార్చి 'హాసం' పత్రికలో ఎడిటోరియల్‌లో కళల గురించి, కళాకారుల గురించి, సినీనటుడు చిరంజీవి గారు పత్రికా వార్తకు స్పందించి పేద బాలికకు చేసిన సహాయం గురించి రాశారు. కళాకారులు సమాజ సేవకు ముందుకు రావాలి. 'కొమ్మ కొమ్మకో సన్నాయి'లో గంగోత్రి పాట గురించి, తను గతంలో రాసిన నదుల పాట గురించి, వేటూరి గారు రాసిన ముచ్చట్లు బాగున్నాయి. 'హాసం' పత్రిక అద్భుతంగా ఉంది.

**- బ్రహ్మాజీ గట్టి, అనకాపల్లి.**

ఆ పాత(ట) మధురం శీర్షికలో "ప్రేమలేఖలు" వచ్చిన వెంటనే, "ఆలీబాబా 40 దొంగలు" రావడం అత్యద్భుతంగా వుంది. రెండు డబ్బింగ్ చిత్రాల పాటలు యింత బాగా విశదీకరించిన 'రాజా' వారికి హాట్సాఫ్. ఎన్నో తెలియని విషయాలు తెలుసుకున్నాను. ప్రత్యేకంగా 'ఆలీబాబా 40 దొంగలు'' చిత్రంలోని పాత్రధారుల గురించి! ఇటువంటి జి.కె. ఇంప్రూవ్ చేసుకోవడం అంటే నాకు చాలా ఇష్టం.

**- బి.శ్రీనివాసరావు, హైద్రాబాద్.**

గత సంవత్సర కాలంగా 'హాసం' చదువుతున్నాను. కొత్త సంచిక కోసం 15 రోజులు ఎదురుచూడటం బాగా ఇబ్బందిగా ఉంది. వార పత్రికగా 'హాసం'ను చూడాలనివుంది. బాలు గారంటే నాకు బాగా ఇష్టం. ఆయనచే ఓ మంచి శీర్షికను ప్రచురించవలసినదిగా కోరుతున్నాను. 'హాసం'కు ఉగాది శుభాకాంక్షలు తెలియజేస్తూ....

**-కృష్ణారావు, కరవంజ**

మా అభిమాన పత్రిక 'హాసం'ను హాస్య సంగీతాభిమానులైన మా బంధుమిత్రులకు పరిచయం చేసే భాగ్యాన్ని మాకు కలిగించినందుకు ధన్యవాదములు.

'హాసం' దినదిన ప్రవర్ధమానమై వెలుగొందాలని మనసారా కోరుకుంటూ ఉగాది శుభాకాంక్షలతో...

**-కేతా శ్రీనివాస్, ఆచంట**

మేము 'హాసం'కు అభిమానులం, ఆత్మ బంధువులం. నేను ప్రయాణం చేసేటప్పుడు 'హాసం' పాత పత్రికలు 3,4 తీసుకుని వెళ్తూ ఉంటాను. తోటి ప్రయాణికులు ఖచ్చితంగా అడిగి తీసుకుంటారు. కొంచెం పరిచయంకాగానే 'హాసం' గురించి, శీర్షికలు గురించి చెబుతూ ఉంటాను. పరిచయస్తులందరికీ 'హాసం' కొని చదవమని ఉచిత సలహా పారేస్తూ ఉంటాను. ఇలా చేయటం నాకు చాలా సంతోషంగా ఉంటుంది.

**-ఫులవర్తి సోమనాగేశ్వరరావు, మల్లీశ్వరి, కాకినాడ**

'హాసం' రెగ్యులర్ రీడర్‌గా నా అనుభవం-నేను ఉద్యోగరీత్యా ఏదో ఒక ఊరు తిరుగుతూ ఉంటాను. ఎక్కడ ఉంటే అక్కడే 'హాసం' కొని చదువుతాను. దానితోపాటే వెంటనే ఆ రోజు ఏ తారీఖో మీ పుస్తకం చెబుతుంది. అంత ఖచ్చితంగా విడుదల చేయడం హాసానికే చెల్లింది. ఒకటవ తారీఖున జీతమైనా తీసుకోమేమోగాని హాసం కొనడం మాత్రం మర్చిపోము.

పుస్తకంలోని ఫీచర్లన్నీ చాలా బాగుంటున్నాయి. వేసవి సెలవులొస్తున్నాయని 'చదువు ల్రావు'కు సెలవియ్యకండి. 'ఇద్దరు మిత్రులు' చదువుతుంటే సినిమా చూస్తున్నట్టే ఉంది.ఇక వారంవారం 'బాపూ'గారి విశ్వరూపాన్ని సాక్షాత్కరింపజేస్తున్నారు. 'ఎలుకవచ్చే ఇల్లు భద్రం' మొదలుపెట్టిన తీరు, నవ్వించే కథనం సూపర్బ్. ఇలాగే శీర్షికల్ని కంటిన్యూ చేస్తారని ఆశిస్తూ...

**-కె.వి.జి.ఎస్.శాస్త్రి, కండక్టర్, రావులపాలెం.**

# హాస్యవల్లరి సంగీతలహరి

**సీరియల్ 13**



# కిశోర్ జీవనఝరి

**- ఎమ్మెస్ స్వాతి**

డబ్బు విషయంలో కిశోర్‌కుమార్‌కు చాలా చెడ్డపేరు ఉంది. ఒకటి - డబ్బు కోసం ప్రొడ్యూసర్లను ఏడిపిస్తాడని. రెండు- ఇవ్వవలసిన చోట ఇవ్వడని, మూడు- పరమలోభి అని. వీటి గురించి అనేక కథలు చలామణిలో ఉన్నాయి. వీటిలో కొన్ని అతిశయోక్తులు ఉండవచ్చేమో కానీ కిశోర్ స్వభావం తెలుసుకోవడానికి ఇవి ఉపయోగిస్తాయి.

కిశోర్, నూతన్‌లను హీరోహీరోయిన్లుగా పెట్టి దర్శక నిర్మాత ఎస్.డి.నారంగ్ 'ఢిల్లీ కా ఠగ్' తీసే రోజులు. సినిమా నిర్మాణం పూర్తి కావచ్చింది. ఆఖరి సీను తీయడానికి కిశోర్‌ను రమ్మన్నాడు నారంగ్. 'ఫుల్ పేమెంట్ నాకు ముట్టేదాకా నేను సెట్స్ పైకి రాను" అన్నాడు కిశోర్.

"ఇస్తానులే. ప్రస్తుతం కాస్త ఇబ్బందిగా ఉంది. ముందు నువ్వు వచ్చి షూటింగ్‌లో పాల్గొను" అంటాడు నారంగ్.

"డబ్బు ముందు.షూటింగు తర్వాత" అంటాడు కిశోర్.

ఇలా రోజులు గడుస్తున్నాయి. నారంగ్ భార్య స్మృతిబిశ్వాస్ అనే నటీమణి. కిశోర్ సరసన నటించింది కూడా. అయినా కిశోర్‌కు ఆ మొహమాటాలు ఏవీ లేవు.

ఓ రోజు కిశోర్ ఇంటికి బయల్దేరాడు నారంగ్. అతన్ని అల్లంత దూరంలో చూస్తూనే కిశోర్ తన కారులోకి దూకి పోనియ్యమన్నాడు. కిశోర్ కారు కోసం గేటుతీయడం చూసి, నారంగ్ తన కోసం తీస్తున్నారని భ్రమపడ్డాడు. తీరా చూస్తే కారు రయ్‌మని వెళ్ళిపోతోంది. 'కిశోర్ సాబ్ కిశోర్ సాబ్' అని పిలిచినా ఉలుకూ పలుకూ లేదు.

ఇంకేం చేస్తాడు? తన కారులో వెంట పడ్డాడు. ట్రాఫిక్ విపరీతంగా ఉంది. 'ఎలాగైనా సరే కిశోర్‌తో ఇవాళ ముఖాముఖీ మాట్లాడేసేయాలి' అనుకుని నారంగ్ పట్టుదలగా వెంబడించి, వెంబడించి కిశోర్ కారు పక్కకు తన కారును తీసుకెళ్ళాడు.

"కిశోర్ సాబ్ కిశోర్ సాబ్" అని అరిచాడు.

కిశోర్ కారు కిటికీలోంచి తల బయటకు పెట్టాడు. అటూ ఇటూ చూశాడు. నారంగ్ "ఇక్కడ ఇక్కడ నేనిక్కడున్నా" అని అరిచాడు.

అయినా కిశోర్ అటూ ఇటూ ఇంకో రెండు సార్లు చూసి చివరకి నారంగ్ కేసి చూసి "నన్నా?, నేనెవరో మీకు తెలుసా?", అని అడిగాడు అమయాకంగా.

నారంగ్ నిర్ఘాంతపోయాడు. "అదేంటి కిశోర్ సాబ్! ఇవాళ ఏమయింది? నేను...నారంగ్... ఎస్.డి.నారంగ్...మన సినిమా ఎలాగైనా కంప్లీట్ చేయాలి". అన్నాడు ఏడుపు గొంతుతో.

రెండు కార్లు పక్క పక్కనే సాగుతున్నాయి. కిశోర్ దీర్ఘంగా ఆలో చిస్తూనే ఉన్నాడు. "నారంగ్!... నా.. రం...గ్..! ఎక్కడైనా విన్నానా? అబ్బే...లేదే! సారీ సార్ నారంగ్... గీరంగ్...ఎవరూ నాకు తెలీదు".

నారంగ్ నోట తడారిపోయింది.

కిశోరే మళ్లీ అందు కున్నాడు. "మీరేం చేస్తుంటారు? ఫిలిం ఫీల్డులో ఉన్నారా?" అని వాకబు చేసాడు.

**ఒక పార్టీలో అశోక్‌కుమార్, అమితాబ్ బచ్చన్, ప్రదీప్ కుమార్ (ముసలివాడి వేషంలో)**



నారంగ్ బదులు చెప్పలేదు. తనివ్వవలసినది ఇస్తే తప్ప కిశోర్‌తో పని ముందుకు సాగదని గుర్తించాడు. ఆ తర్వాత డబ్బు సమర్పించుకుని కిశోర్ చేత పని చేయించుకున్నాడు.

ఈ సంఘటన వింటే కిశోర్ డబ్బు కోసం నిర్మాతలను ఎంతలా పీడించేవాడో అనిపిస్తుంది.

బిపిన్‌గుప్తా అనే ఒక నటుడు క్యారెక్టరు పాత్రలు వేయడంలో సిద్ధహస్తుడు. నిర్మాతగా మారి 'దాల్ మే కాలా'(1964) అనే ఒక సినిమా కిశోర్, నిమ్మీలను హీరో, హీరోయిన్లుగా పెట్టి తీశాడు. సత్యేన్‌బోసు దర్శకుడు.

ఓ రోజు కిశోర్ షూటింగ్‌కి వెళ్లేసరికి 'షూటింగ్ క్యాన్సిల్' అన్నారు.'ఏం?' అంటే 'నిర్మాత దగ్గర డబ్బులేదు. అందుకని క్యాన్సిల్' అని సమాధానం వచ్చింది. 'ఎంత కావాలి?' అన్నాడు కిశోర్.'ఇరవై వేలు' చెప్పాడు బిపిన్ గుప్తా.

కిశోర్ తన డ్రైవర్ అబ్దుల్‌ని పిలిచాడు. "నువ్వు వెంటనే ఇంటికెళ్లి ఇరవైవేలు క్యాష్ తీసుకురా" అని చెప్పాడు. డబ్బు రాగానే కిశోర్ స్వయంగా బిపిన్‌కిచ్చాడు. 'హమ్మయ్య' అనుకున్నాడు అతను.

ఈ సంఘటన వింటే సహనటులు నిర్మాతగా మారి కష్టపడుతూ వుంటే కిశోర్ డబ్బు అడగకపోగా, అప్పు ఇచ్చిన సందర్భాలు కూడా ఉన్నాయన్నమాట అనిపిస్తుంది.

విచిత్రం ఏమిటంటే 'ఢిల్లీకాఠగ్' హిట్ అయి నారంగ్‌ను నిలబెడితే, 'దాల్ మే కాలా' ఫ్లాపయ్యి బిపిన్‌గుప్తాను సర్వనాశనం చేసింది.

తనకు రావలసిన చోట కిశోర్ నిర్దాక్షిణ్యంగా వసూలు చేయడం తప్పులేదనిపిస్తుంది సినిమా ప్రపంచపు పోకడలు తెలిసిన వారికి. డిమాండ్ ఉన్నప్పుడు వెంటబడినవారే అవసరం లేదనుకున్నప్పుడు మొహం చాటేస్తారని ప్రతీతి. పెళ్లయిన కొత్తల్లో డబ్బులేక అవస్థపడ్డ కిశోర్ డబ్బు సంపాదించాలన్న విపరీతమైన కసి పెంచుకున్నాడు. శ్రమపడి సంపాదించిన డబ్బుపై అమితమైన ప్రేమ పెంచుకున్నాడు. ఒకసారి అతనే చెప్పుకున్నాడు-



**"న్యూ ఢిల్లీ" (1956) సినిమాలో ధుమాల్, నానా పల్సికర్, వైజయంతీమాల, నాజిర్ హుసేన్, కిశోర్**

"కొత్తల్లో డబ్బు వచ్చేటప్పుడు నేను ఓ గదిలో గడియవేసుకుని కూచుని డబ్బు నోట్లు లెక్కపెట్టేవాణ్ని. మళ్లీ మళ్లీ లెక్కపెట్టేవాణ్ని గంటల తరబడి అదేపని. లెక్కపెట్టి, లెక్కపెట్టి మంచి స్పీడు సంపాదించాను. ఆ డబ్బంతా కట్టలు కట్టి, టోటల్ చేసి, ఆ టోటల్ సరిగ్గా ఉందో లేదోనని నోట్లు మళ్ళీ లెక్కపెట్టేవాణ్ని! అదోరకమైన కాంప్లెక్స్".

ఈ విధమైన కాంప్లెక్స్ డెవలప్ కావడం వల్లనే ఇన్‌కంటాక్స్ కట్టడానికి అతనికి చేతులు వచ్చేవి కావు. ఏదో రూపేణా ఎగ్గొడదామని చూసేవాడు. అలా చేసే అరెస్టు అయ్యాడు.

ఇన్‌కంటాక్స్ ఎగ్గొట్టడానికి అతను నిర్మాతగా మారాడు. 'లోకోచురీ' తీస్తే అది హిట్ అయింది. 'చల్తీకా నామ్ గాడీ' తీస్తే అదీ హిట్టయికూచుంది. 'ఝుమ్రూ' సినిమాకు సంగీత దర్శకత్వం తను వహించి దర్శకత్వం శంకర్‌ముఖర్జీకి ఇచ్చాడు. సినిమా, పాటలు రెండూ హిట్ అయ్యాయి. ఇవన్నీ అతనికి ఆదాయాన్ని, దానితోబాటు టాక్స్ ప్రాబ్లెమ్‌ని కొని తెచ్చాయి.

ఇక కమర్షియల్ సినిమా కాకుండా కొత్తరకం సినిమా తీద్దామనుకున్నాడు. 'దూర్ గగన్ కే ఛావ్ మే' ప్లాన్ చేశాడు. స్క్రీన్‌ప్లే, సంగీతం, దర్శకత్వం అన్నీ తనే! కొడుకు ముఖ్య పాత్రధారి. ఈ సినిమా వల్ల డబ్బు సంపాదించాలని మాత్రం కిశోర్ అనుకుని వుండడు. అంటే డబ్బు మీద ప్రేమకంటే మంచి సినిమా తీయాలన్న తపన ఎక్కువయిందన్న మాట కిశోర్‌కి.

ఆ సినిమాను కొందరు విమర్శకులు మెచ్చుకున్నా వ్యాపారపరంగా దెబ్బతింది. కిశోర్ నిరాశపడ్డాడు. తనను కమెడియన్‌గానే తప్ప సీరియస్ నటుడిగా ప్రేక్షకులు రిసీవ్ చేసుకోలేదని బాధపడ్డాడు.

రెండేళ్లు గడిచాక 'హమ్ దో డాకూ'(1967) అనే కామెడీ సినిమా తీశాడు. కిశోర్, అనూప్ కుమార్, గంగా, లీనా, భగవాన్, సుందర్, మారుతి ప్రధాన పాత్రధారులు. దర్శకుడు, సంగీత దర్శకుడు కిశోరే! సినిమా ఎప్పుడు వచ్చిందో, ఎప్పుడు వెళ్లిందో కూడా తెలియనంత ఘోరంగా ఫ్లాపయ్యింది.

ఆ తరువాత 'దూర్ కా రాహీ' ప్లాన్‌చేసినా రిలీజ్ కావడానికి చాలాకాలం పట్టింది. సినిమాల మీద డబ్బు గడిద్దామనుకున్న వాడెవడూ అలాటి సినిమా తీయడు. అందువల్ల కిశోర్‌కి పూర్తిగా డబ్బు యావ ఉందని చెప్పడం కష్టం.

నిర్మాతగా కిశోర్ చాలా యత్నాలు చేశాడు. మామూలు ఫార్ములాలకు భిన్నంగా వింత వింత ప్రయోగాలు చేసి చేతులు కాల్చుకున్నాడు.

'బఢ్తీకా నామ్ దాడీ'(1974) అనే ఓ అబ్సర్డ్ సినిమా తీశాడు. ఐ.యస్.జోహర్ ఓ డబ్బున్న పెద్దమనిషి. లోకంలో ఎవరి గడ్డం పొడుగ్గా ఉందో వారికి బహుమతి ఇస్తానని ప్రకటిస్తాడు. ఇక జనాలు పోటీలు పడి గడ్డాలు పెంచేస్తారు. ఒకళ్లనిమించి ఒకళ్లు పెంచడమేకాదు, పక్కవాళ్ల గడ్డాలు కత్తిరించడానికి కత్తెర్లు పట్టుకుని తిరుగుతారు. ఇలా అనేకమంది పోటిలో వెనకపడగా, చివరికి ఇద్దరే మిగులుతారు- కిషోర్‌కుమార్, కె.యస్.సింగ్. ఇద్దరూ తమ గడ్డాలు కాపాడుకోవడంతో బాటు, కత్తెర చేతపట్టుకుని పక్కవాడిది కోసేయబోతారు. ఆఖరి పోరాటంలో ఇద్దరి గడ్డాలు చిక్కుపడిపోతాయి. గడ్డం కత్తిరించేయడం కూడా జరుగుతుంది. కానీ ఊడిన గడ్డం ఎవరిదో తెలియదు. సస్పెన్స్, చివరిలో చూస్తే అది కె.యస్.సింగ్‌దని తెలుస్తుంది.

కిశోర్ వేదికనెక్కి బహుమతి అందుకోబోతూండగా అతిథి పాత్రలో అశోక్‌కుమార్ ప్రత్యక్షం. అతని గడ్డం నేలమీద జీరాడుతూ ఉంటుంది. అతనికే బహుమతి దక్కుతుంది. ఇదో యాంటీ క్లైమాక్స్ అన్నమాట.

అబ్సర్డ్ సినిమా తీయటం మాటలు కాదు. సీరియస్‌గా తీయాలి. కానీ కిశోర్ అషామాషీగా తీసినట్టు అనిపిస్తుంది. సినిమా మధ్యలో ఓ సీన్లో నటీనటులు మామూలు దుస్తుల్లో కనబడుతారు. కిశోర్ తెరపై కనబడి 'టైముకి కాస్ట్యూమ్స్ రానందువల్లన సాధారణ దుస్తుల్లోనే పాత్రలు కనబడాలని డైరెక్టరునైన నేను శాసిస్తున్నాను" అంటాడు. నిజానికి షూటింగ్ టైములో అదే జరిగి వుంటుంది. దాన్నే ఒక తమాషాగా అనుకుని కిశోర్ అదే యథాతథంగా చిత్రీకరించి వుంటాడు. ప్రేక్షకులు మాత్రం ఇలాంటి సీన్లకు బిత్తరపోతారు.

అసలు సినిమా మొదట్లోనే పేర్లు ఆకాశం నుంచి ఊడిపడుతూండంగా కిశోర్ వచ్చి వాటిని తరిమివేస్తాడు. ప్రేక్షకుల వైపుకి తిరిగి 'మీరు చూడబోయేది ఒట్టి అసమంజసమైన కథ. తర్కం గురించి చూడకండి" అని చెప్తాడు. తర్వాత సినిమా మధ్య మధ్యలో అనేకసార్లు ఆడియన్స్ కేసి తిరిగి కన్నుగొడతాడు. బోల్డు డ్రస్సులు మార్చేస్తాడు. సినిమాను తన చిత్తం వచ్చినట్టు తీశాడని చెప్పవచ్చు.

తారాగణం చూడబోతే కిశోర్ కొడుకు అమిత్, శీతల్, భగవాన్, ఐ.యస్.జోహర్, బిందు. నిర్మాత, దర్శకుడు, సంగీతం, ఫొటోగ్రఫీ అన్నీ కిశోరే! 'చల్తీకా నామ్ గాడీ' పేరు గుర్తుకు వస్తోంది కదా అని సినిమా చూడబోయినవారికి దిమ్మ తిరిగిపోయే కథా కథనం!

అ తర్వాత తీసినది "శభాష్‌డాడీ" (1979). కిశోర్‌కుమార్ తన కొడుకు అమిత్‌ని పెట్టి తీశాడు. అమిత్‌కి పెళ్లిసంబంధం చూడబోయి తనే ప్రేమలో పడతాడు. అమిత్ జోడీగా తెలుగుతార జయసుధ. కిశోర్‌కి జంటగా యోగితాబాలి(అతని మాజీ భార్య). షరామాములుగా నిర్మాత, దర్శకుడు, సంగీతం, కథ గట్రా కిశోరే! సినిమా వారం రోజులాడింది.

1981లో తీసిన సినిమా 'చల్తీకా నామ్ జిందగీ' అశోక్, అనూప్, కిశోర్ సోదర త్రయంతో బాటు అమిత్‌కుమార్, రీటాబాధురీ వేశారు. కిశోర్

**'ఝుమ్రూ' (1961)లో కిశోర్, మధుబాల**






## కిశోర్ గీతావళి

### మానా జనాబ్ నె





మానా జనాబ్ నె పుకారా నహీఁ
క్యా మెరా సాథ్ భీ గవారా నహీఁ
ముఫ్త్ మె బన్ కె చల్ దియె తన్‌కె
వల్లా జవాబ్ తుమ్హారా నహీఁ ॥మానా॥
యారోఁ కా చలన్ హై గులామీ
దేతే హై హసీనోఁకో సలామీ (2)
గుస్సా న కీజియె జానె భీ దీజియె
బందగీ తొ బందగీ తొ లీజియె సాహబ్ ॥మానా॥
టూటా ఫూటా దిల్ యె హమారా
జైసా భీ హై అబ్ హై తుమ్హారా
ఇధర్ దేఖియె నజర్ ఫేకియె
దిల్లగి న దిల్లగి న కీజియె సాహబ్ ॥మానా॥
మాషా అల్లా కెహనా తొ మానా
బన్‌గయా బిగ్‌డా జమానా(2)
తుమ్‌కో హసాదియా ప్యార్ సిఖాదియా(2)
షుక్రియా తొ షుక్రియా తొ కీజియె సాహబ్ ॥మానా॥

"పేయింగ్ గెస్టు" (1957) సినిమాలోది ఈ పాట. ఫిల్మిస్తాన్ వారికోసం సుబోధ్ ముఖర్జీ దర్శకత్వం వహించాడు. ఓ యువకుడు ఓ కుటుంబంలో పేయింగ్‌గెస్టుగా ఉండడానికి వెళతాడు. ఆ ఇంట్లో ఓ పడుచు - నూతన్ - ఉంటుంది. అసలు రూపంలో వెళితే ఇల్లు ఇవ్వరని ముసలి ముస్లిమ్ రూపంలో వెళతాడు. అక్కడ ఆ రూపంలో ఉంటూనే అసలు రూపంలో సైకిల్ తొక్కుతూ నూతన్‌ను టీజ్ చేస్తూ పాడే పాటే ఇది. మజ్రూ రాసిన ఈ పాటకు ఎస్.డి.బర్మన్ సంగీతం సమకూర్చారు. ఈ పాట వల్ల దేవ్ ఆనంద్‌కు ఎంత పేరు వచ్చిందో ఏ క్లాసు గాయకుడిగా కిశోర్‌కూ అంతపేరు వచ్చింది.

ఊరూ, వాడా ఈ పాటను ఆలపించడం జరిగింది. అప్పట్లో నగరాలలో జూక్‌బాక్స్‌ల వాడకం బాగా ఉండేది. వెయింగ్ మెషిన్‌లోలా కాయిన్ వేసి మనకు కావలసిన పాట స్విచ్చి నొక్కితే ఆ గ్రామఫోన్ పైకి వచ్చేది, పాట వినిపించేది. అలాటి జూక్‌బాక్స్‌లలో హాట్ ఫేవరేట్ - మానా జనాబ్‌నే! ఈ పాటమీద ఎంత మోజు ఉండేదంటే జూక్‌బాక్స్‌లో పేయడానికి నాణాలు దొరికేవి కావు. పాన్‌షాపుల వాళ్లు చిల్లర నాణాలు కావాలని అడిగే కుర్రాళ్ల దగ్గర ఎక్కువ వసూలు చేసేవారు.

ఈ సినిమాలో హీరోయిన్ ఒకతన్ని పొరబాటున హత్య చేస్తుంది. హీరో గారు ప్రాక్టీసు లేని లాయరైనా కేసు చేపడతాడు. చివరికి వ్యాంప్‌గా వేసిన శుభాఖోటే తన నేరం ఒప్పుకోవడంతో కథ సుఖాంతం అయింది.

కొసమెరుపు ఏమిటంటే ఈ సినిమాకు 'ఎ' సర్టిఫికెట్టు ఇచ్చారు. కారణం, హత్యోదంతం కాదు. హీరోగారు హీరోయిన్ బుగ్గ - అవును బుగ్గే! - గిల్లడం! అప్పటి సెన్సారు ఆఫీసర్ల చాదస్తానికి నవ్వు వస్తోందా? నవ్వుకోండి!

పక్కన తెలుగు నటీమణి వై.విజయ నటించింది. ముగ్గురన్నదమ్ములూ ఓ హోటల్ నడుపుతూంటారు. ఓ గుప్తనిధి పిట్టకథ కూడా ఉంది. ఈ సినిమా పాటికే ముగ్గురూ ముసలివాళ్లు, స్థూలకాయులు. హీరోయిన్లు కూడా పేరున్నవాళ్లు కాదు. ఈ సినిమా కూడా ఫ్లాపే!

సినిమా రంగంలో ఎన్నోయేళ్లు ఉన్న కిశోర్‌కి కమర్షియల్ ఎలిమెంట్స్ తెలియనివికావు. బావగారు ఎస్.ముఖర్జీ, అన్నగారు అశోక్‌కుమార్ ఎన్నో విజయవంతమైన సినిమాలు తీసిన అనుభవజ్ఞులు. తను పాటలు పాడుతున్న సినిమాలలో ఏవి ఆడుతున్నాయో, ఎవరు సంగీతం ఇస్తే డిస్ట్రిబ్యూటర్లు ముందుకువస్తారో కిశోర్‌కి తెలియకపోలేదు. అయినా ఇలాంటి సినిమాలు తీశాడంటే అతనికి డబ్బుమీద మమకారం ఉందనుకోవాలా? లేదనుకోవాలా? నిజానికి 'ఝుమ్రూ' తీసినప్పుడు కిశోర్‌కి ఈ వికారాలు ఉన్నాయని అనుకోవడానికి లేదు. అది ఫక్తు కమర్షియల్ సినిమా. కథ, స్క్రీన్‌ప్లే, సంగీతం అతనివే. డబ్బు అతనే పెట్టుబడి పెట్టినా తన సెక్రటరీ అనూప్‌శర్మ పేరు ప్రొడ్యూసర్‌గా వేశాడు. దర్శకత్వం శంకర్‌ముఖర్జీకి ఇచ్చాడు.

కిశోర్‌కుమార్ సరసన హీరోయిన్ అతని భార్య మధుబాల వేసింది. మధుబాల తండ్రిగా జయంత్ వేయగా కిశోర్ తల్లిగా లలితాపవార్ వేసింది. అనూప్‌కుమార్ జయంత్ సెక్రటరీగా, మధుబాలను ప్రేమించినవాడిగా హాస్యవేషం వేశాడు. చంచల్ కిశోర్‌ను ప్రేమించిన అమ్మాయిగా చక్కటి ఆటపాటలు ప్రదర్శించింది.

సినిమాలో కిశోర్ కొండజాతివాడు. పర్వతారోహకుడు. ఒక ధనికుడి కూతుర్ని ప్రేమిస్తాడు. ఆమె కూడా అతని వలచి వరిస్తుంది... ఇలా ఓ ఫార్ములా ప్రేమకథలా సాగుతుంది సినిమా. చివర్లో లలితాపవార్ వచ్చి కిశోర్ ఎవరో తెలుపుతుంది. కథ సుఖాంతం. ఈ లోగా కిశోర్ బోల్డు మారువేషాలు (ఖట్‌మండూ, ఖట్‌మండూ...అని షెర్పా వేషంలో పాట కూడా ఉంది). కిశోర్ హాస్యంతో బాటు మధుబాల అందచందాలు సినిమాకు ఓ పెద్ద ఎస్సెట్. పాటలు మరీ పెద్ద ఎస్సెట్.

'ఝుమ్రూ' పాటలు చాలా, చాలా బాగుంటాయి. 'కోయీ హమ్‌దమ్ న రహా' బాగా పాప్యులర్ అయిన పాట. అదే కాకుండా 'ఠండీ హవా ఏ చాంద్‌నీ సుహానీ' కూడా చాలా శ్రావ్యమైన పాట. వీటితో బాటు మంచి హుషారైన పాటలు చాలా ఉన్నాయి. 'మై హూ ఝుమ్రూ' అనే టైటిల్ సాంగ్‌లో బోల్డంత యోడిలింగ్ చేసి మహా హడావుడి చేశాడు కిశోర్. కిశోర్, మధుబాల, అనూప్ కలిసి నటించిన 'ఝుమేరే, ఝుమేరే ఝుమేర్ ఝుమేర్, ఝూమే దిల్ మేరా ఝూమే', కిశోర్, చంచల్ డాన్సు 'జానేదే...' (ఇంగ్లీషు పాట ట్యూన్ పై ఆధారపడినది) పడిపడి నవ్విస్తాయి. సినిమా బ్రహ్మాండంగా ఆడింది. జనాలు విరగబడి చూశారు. కిశోర్‌కు కాసుల వర్షం కురిసింది.

మరి ఇలాటి విజయవంతమైన సినిమా తీసినవాడికి సినిమా ఫార్ములా తెలియదనుకోలేం కదా! నిజానికి అతను మధుబాలను పెళ్లి చేసుకున్నప్పుడు ఆమెను డబ్బు గురించే చేసుకున్నాడనీ, ఆమెను హీరోయిన్‌గా పెట్టుకుని సినిమాలు తీసి డబ్బు చేసుకుందామనుకున్నాడనీ అనుకున్నారు చాలామంది. ఆమె అనారోగ్యం నుండి తేరుకోలేదని తెలగానే అతనికి ఇంట్రెస్టు పోయిందనీ, అందుకనే పట్టించుకోవడం మానేశాడనీ కూడా ఆరోపణలు వచ్చాయి. వీటిలో నిజానిజాల మాట ఎలావున్నా బాక్సాఫీసు మీద కిశోర్‌కు కన్ను ఉన్నట్టే అనుకోవాలి కదా!

ఎవరైనా సినిమా తీసినప్పుడు, ముఖ్యంగా ఓ కళాకారుడు తీసినప్పుడు, అది తెచ్చే డబ్బు మాట ఎలావున్నా, తను తీసిన సినిమా పదిమందీ



చూడాలనీ, తను భావాలు పదిమంది తెలుసుకుని చర్చించుకోవాలనీ కోరుకుంటాడు. మరి కిశోర్ తర్వాత తర్వాత తీసిన సినిమాలను చూడబోతే అతను ఏ లక్ష్యంతో వీటిని తీశాడో అంతుబట్టదు. డబ్బు గురించి లక్ష్యపెట్టకుండా వెర్రి పుట్టి తీశాడేమో అనిపిస్తుంది.

మరి కిశోర్‌కు డబ్బంటే లక్ష్యం లేదా? లేకపోతే తన హృద్రోగాన్ని కూడా పట్టించుకోకుండా అన్ని ప్రదర్శనలు ఎందుకిచ్చివుంటాడు? అనేక మంది నిర్మాతలతో అంత కఠినంగా ఎందుకు వ్యవహరించి ఉంటాడు?

మరి తను నిర్మాతగా ఉన్నప్పుడు ఎలా వ్యవహరించాడు? సాధారణంగా అతని కుటుంబసభ్యులు, ఆప్తమిత్రులు ఇఫ్తికర్ లాటివాళ్లే అతని సినిమాలలో ఎక్కువగా వేశారు. వాళ్లందరికీ డబ్బు ఎగ్గొట్టినట్టు ఎక్కడా వినలేదు కానీ మెహమూద్‌తో మాత్రం ఒకసారి చిన్న గొడవ అయింది.

కిశోర్ దర్శకనిర్మాతగా తీసిన "శభాష్ డాడీ" చిత్రంలో మెహమూద్ నటించాడు. కానీ అతనికి ఇవ్వవలసిన పారితోషికం కిశోర్ వెనకబెట్టేశాడు. అప్పటికే మెహమూద్‌కు వేషాలు తగ్గాయి. ఆర్థిక పరమైన ఇబ్బందులలో ఉన్నాడు. సినిమా రిలీజవ్వడం, ఫెయిలవడం జరిగింది కానీ కిశోర్ మాత్రం మెహమూద్‌కి డబ్బు ఇవ్వలేదు. పాపం మెహమూద్ గుర్తు చేస్తూనే ఉన్నాడు. అయినా ప్రయోజనం లేకపోయింది.

సహనం కోల్పోయిన మెహమూద్ ఓ రోజు కిశోర్ ఇంటికి వెళ్లాడు. పెద్ద ఐరన్ గేటు మూసేసి వుంది. కారు దిగి గేటు గట్టిగా తట్టాడు. వాచ్‌మన్ ఓ చిన్న తలుపులోంచి తొంగిచూసి "సాబ్ బయటికెళ్లారు" అన్నాడు.

కానీ కిశోర్ వేషాలు తెలిసిన మెహమూద్ మోసపోలేదు. గొంతుపెంచి గట్టిగా అరిచాడు- "కిశోర్‌దా, నువ్వు లోపలే ఉన్నావని తెలుసు. బయటకి రా. లేకపోతే గేటు విరక్కొట్టుకుని వచ్చేస్తా."



"సాబ్ ఇంట్లో లేరు. గేటు బయటనుంచి తాళం వేసుకుని వెళ్లిపోయారు."అన్నాడు వాచ్‌మన్.

అతని మాట బలపరుస్తున్నట్టు లోపటి నుండి కిశోర్ తల్లి వాయిస్ వినబడింది. "నాయనా మెహమూద్, కిశోర్ లేడమ్మా, బయటకు వెళ్లాడు. మళ్లీ తర్వాత ఎప్పుడైనా రా." అని.

కిశోర్ మిమిక్రీ కళ మెహమూద్‌కి కొత్త కాదు. అది కిశోర్ ఎత్తేనని అర్థమయింది. జేబులోంచి రివాల్వర్ తీసి "కిశోర్‌దా. నువ్వు లోపలే వుండి వేషాలు వేస్తున్నావని తెలుసు. గేటు తీయకపోతే తుపాకీతో తాళం పేల్చేసి నేనే లోపలికి వస్తా. కాస్కో." అని హెచ్చరించాడు.

రెండు నిమిషాలయినా నద్దేమీ కాకపోవడంతో మెహమూద్ తుపాకీ తీసి గాలిలోకి రెండుసార్లు పేల్చాడు మెహమూద్. దాంతో కిశోర్‌కి సీరియస్‌నెస్ అర్థమయిపోయింది. గబగబా లోపలనుండి వచ్చి వాచ్‌మెన్‌కి చెప్పి గేటు తెరిపించాడు. "రా, రా, మెహమూద్. ఏమయింది? ఆ తుపాకీ ఏమిటీ? సంగతేమిటసలు?" అని వాకబు చేయబోయాడు.

మెహమూద్ అతి క్లుప్తంగా సమాధానమిచ్చాడు - "డబ్బు కావాలి. మా నాన్న హాస్పటల్లో ఉన్నాడు. నాకు తక్షణం డబ్బు ఇవ్వాలి."

"తప్పకుండానూ. దానికి ఇంత హడావుడెందుకు? ఇదిగో దాస్, మెహమూద్ గారికి ఇవ్వవలసినది ఇచ్చేశేయ్" అంటూ తన సెక్రటరీకి ఆర్డరేశాడు.

ఈ సంఘటన వింటే వింతగా ఉంటుంది. నిర్మాతగా కిశోర్‌కి పాపం చెడ్డపేరు లేదు. అతని అంతరంగిక మిత్రుడు ఇఫ్తికర్ ఒకసారి చెప్పాడు - "దూర్‌గగన్‌కి ఛావ్‌మే" కి రచయితగా పనిచేసిన రమేష్‌పంత్ ఓ సారి డబ్బు లేదని బాధపడుతున్నాడు. కిశోర్ చెప్పాడు-'నువ్వు రాయవలసినది రాయి. డబ్బిస్తా' అని.

'అదంతా తరువాతి సంగతి. ముందు డబ్బు ఇవ్వకపోతే, నేను బతకను. తర్వాతే రాతలూ, కోతలూ' అని రమేష్‌పంత్ మొండికేశాడు.

కిశోర్ వెంటనే డబ్బు ఏర్పాటు చేశాడు. అందుచేత కిశోర్ పిసినారి అంటే నేను ఛట్టున ఒప్పుకోను.' అని.

మరి మెహమూద్ విషయంలో అలా చేశాడేం అంటే దానికి మెహమూద్ మీద ఆ సమయంలో ఏదైనా అలకో, కోపమో ఉందేమో తెలియదు.

డబ్బు విషయంలో తన పద్ధతులు లోకనిందకు గురవుతాయని కిశోర్ బాధపడేవాడా? లేదా? అంటే దానికీ సరైన సమాధానం దొరకదు.

ఓ సారి ఓ పబ్లిసిటీ కంపెనీ వాడిచేత పబ్లిసిటీ వర్కు చేయించుకున్నాడు కిశోర్. బిల్లు పే చేయడానికి తిప్పుతున్నాడు.

ఓ సారి కంపెనీవాడు వచ్చి 'మీకు డబ్బు లేకనా ఏమైనానా? ఇన్నిసార్లు తిప్పిస్తున్నారు" అని విసుక్కున్నాడు.

"డబ్బు లేక కాదు, నా జేబులో ఓ సారి డబ్బు పడిందనుకో, అది బయటకు రావడం కష్టం." అన్నాడు కిశోర్ నిస్సిగ్గుగా.

కంపెనీవాడు నిర్ఘాంతపోయాడు - "మరి నా డబ్బు నాకు వచ్చే మార్గమే లేదా?" అని అడిగాడు దీనంగా.

"ఉంది. నా చేతికి డబ్బు రాకుండా నువ్వే తీసేసుకోవడమే! రేపు ఫిలిం సెంటర్‌కి రా. అక్కడ ఓ పాట రికార్డింగు చేస్తున్నా. రికార్డింగు అయిపోగానే నాకు ఇవ్వవలసినది నీకే డైరెక్టుగా ఇచ్చేయమని వాళ్లకు చెబుతా.అలా అయితే ఆ డబ్బు నా జేబులో పడడం, మళ్లీ బయట పడలేకపోవడం జరుగదు." అన్నాడు.

చివరకు అలాగే జరిగిందనుకోండి, అయినా ఇలా మాట్లాడితే పిసినారి అని ముద్ర పడదూ? పడింది. పడ్డాక ఓ సందర్భంలో కిశోర్ బాధపడ్డట్టున్నాడు. ఓసారి బొంబాయిలో ఉన్న కొన్ని బెంగాలీ కుటుంబాలను ఖండాలా (బొంబాయికి దగ్గరలో ఉన్న హిల్ స్టేషన్)కు వెళ్లిరమ్మన్నాడు. నాలుగురోజులపాటు విందులు, వినోదాలు, రానూపోనూ ఖర్చులు అన్నీ కిశోర్‌వే!

కిశోర్ ఔదార్యం పరిపూర్ణంగా ఆస్వాదించిన తర్వాత వాళ్లు బొంబాయి తిరిగివచ్చి కిశోర్‌కు థాంక్స్ చెప్పబోయారు. "అక్కర్లేదు కానీ ఇప్పుడు చెప్పండి. నేను లోభినా?" అన్నాడు కిశోర్.

"అబ్బే, ఎవరన్నారు?" అన్నారు వాళ్లు.

"ఆ మాటే పదిమందికీ చెప్పండి." అన్నాడు కిశోర్.

డబ్బు విషయంలో నిర్మాతలతోనే కాదు, రాజకీయ నాయకులతో కూడా అతను నిక్కచ్చిగా వ్యవహరించాడని చెప్పడానికి ఎమర్జన్సీరోజుల నాటి ఉదంతం చెప్పుకుంటే చాలు. ఒక నియంతృత్వ ప్రభుత్వం ఒక కళాకారుణ్ని ఎలా నాశనం చేయ సమకట్టిందో గుర్తుకువస్తుంది.

(ఇంకావుంది)




## సహజత, సరళత, సంప్రదాయం ఇవే ఆమె విజయ రహస్యాలు



# ఫాల్గుణి పాఠక్

పదేళ్ళ వయసులో స్వాతంత్ర్య దినోత్సవం సందర్భంగా వేదికనెక్కి పాట పాడిన ఆ గుజరాతీ పిల్ల అచిర కాలంలోనే దాండియా డిస్కో క్వీన్‌గా పేరు ప్రఖ్యాతుల్ని సంపాదిస్తుందని ఎవరూ ఊహించి ఉండరు. కానీ కృషి పట్టుదల, అకుంఠిత దీక్ష ఆమెకు ఇవాళ దేశవ్యాప్తంగా మంచి గుర్తింపును తెచ్చిపెట్టాయి. శరన్నవరాత్రి ఉత్సవాల్లో చేతిలో రెండు కర్రలు పట్టుకుని దాండియా ఆడుతూ, పాటలు పాడిన ఫాల్గుణి పాఠక్‌కు ఇవాళ గుజరాత్‌లోనే కాదు, ఇతర రాష్ట్రాలలోనూ అనేకమంది అభిమానులు ఉన్నారు. దేశవ్యాప్తంగా ప్రధాన నగరాల్లో ఆమె సంగీత కార్యక్రమాల్ని విజయవంతంగా నిర్వహిస్తోంది.

'యాద్ పియా కి ఆనే లగీ', 'మైనే పాయల్ హై ఛంకీ', 'తేరీ మై ప్రేమ్ దీవానీ' ఆల్బమ్స్‌తో పాపులారిటీని పొందిన ఫాల్గుణీ తాజా ఆల్బమ్ 'యే కిస్నే జాదూ కియా' ఈ మధ్య విడుదలైంది. దాంతో మళ్ళీ ఫాల్గుణి గురించిన వివరాలు, వార్తలు పత్రికల్లో ప్రధానంగా చోటుచేసుకుంటున్నాయి. ఇందులోని ఓ పాటను స్వీట్ లవ్‌స్టోరీగా ప్రచారం కోసం చిత్రీకరించారు. దీనికి మంచి పేరు వచ్చింది. అయితే ఆ క్రెడిట్ రాజూఖాన్‌దేనని, చక్కటి నృత్య రీతుల్ని ఆయన అందించారని ఫాల్గుణీ చెబుతోంది. అలానే గతంలో కంటే ఇంకాస్త చక్కగా పాడటానికి నేను ప్రయత్నించాను అని అంది ఫాల్గుణి. ఇదే మీ కెరీర్‌లో బెస్ట్ అనుకోవచ్చా అంటే మాత్రం... 'అటువంటిదేమీ లేదు. ఇంకా మంచి ఆల్బమ్స్ చేయాల్సి ఉంది' అని ఆశాభావాన్ని వ్యక్తం చేసింది.

ఇంత చక్కటి సింగర్‌గా పేరు తెచ్చుకుని కూడా నేపథ్య గానానికి ఎందుకు ప్రాధాన్యం ఇవ్వరూ అని అడిగితే, "దాండియా గాయనిగా నేనిచ్చే స్టేజ్ షోలు నాకెంతో సంతృప్తిని అందించాయి. ఆ వేదికల మీద కూడా వేరే వాళ్ళ పాటల్ని పాడటం నాకంత ఇష్టం ఉండేది కాదు. నా పాటల్నే నేను పాడేదాన్ని. అదే సమయంలో చాలా మంది యువ గాయనీ గాయకులు మ్యూజిక్ ఆల్బమ్స్ విడుదల చేయడం మొదలుపెట్టారు. కేవలం పాటలు పాడటంతో బోర్ ఫీలయ్యి, నేనూ నా అదృష్టాన్ని ఇందులో పరీక్షించుకోవాలనుకున్నాను. ఆ ప్రయత్నం సఫలీకృతమైంది" అని అంది. ఈ విజయానికి కారణం చెబుతూ, "నా పనిని నేను మనసా వాచా కర్మణా చేస్తాను. దానితో పాటుగా ప్రేక్షకుల అభిరుచిని కూడా గుర్తించడం ప్రధానం. ఇవాళ ఎవరెంత చెప్పినా ప్రేక్షకులు వల్గారిటీ పట్ల విముఖతగానే ఉన్నారు. నా పాటలు నా వ్యక్తిత్వానికి దర్పణంగా నిలుస్తాయి. సహజత, సరళత, సంప్రదాయం, మాధుర్యం... ఇవే పాటల సక్సెస్‌కు కారణమని నా భావన" అంటోంది ఫాల్గుణి.

ఇంత గుర్తింపును పొందిన ఆమెకు సంగీతంలో ప్రావీణ్యం లేదంటే ఆశ్చర్యం అనిపిస్తుంది. ఈ విషయం గురించి ఆమె చెబుతూ, 'నిజంగానే నాకు సంగీతంలో ప్రావీణ్యం లేదు. అయితే ఇవాళ సంగీత ప్రపంచంలో ఉన్న పోటీని తట్టుకోవాలంటే ప్రావీణ్యం తప్పనిసరి అని అనిపించింది. అందుకనే ప్రస్తుతం శాస్త్రీయ సంగీతాన్ని భవదీప్ జైపూర్‌వాలా గారి దగ్గర నేర్చుకుంటున్నాను" అని చెప్పింది. ఇంతకీ మీకు పోటీ ఎవరూ అని ప్రశ్నించినప్పుడు కాసేపు మౌనం వహించి, 'లతా మంగేష్కర్, ఆశాభోంస్లే, కవితా కృష్ణమూర్తి, అల్కా యాజ్ఞిక్ వీళ్ళతో నేను సరితూగలేను కదా... అలాని

- అయిదుగురు అక్కాచెల్లెళ్లలో ఫాల్గుణి ఆఖరి అమ్మాయి. తల్లి ఆ మధ్య చనిపోయింది. అక్కలందరికీ పెళ్ళిళ్ళు అయిపోవడంతో ప్రస్తుతం తండ్రితోనే ఫాల్గుణి కలిసి ఉంటోంది.
- నాలుగేళ్ళ వయసు నుండి పాటలు పాడుతున్న ఫాల్గుణి పది సంవత్సరాల వయస్సప్పుడు తొలిసారి స్టేజ్ మీద పాడింది. అప్పట్నుంచి వెనుదిరిగి చూసిందిలేదు.
- నవరాత్రి ఉత్సవాల్లో అత్యధికంగా పారితోషికం పొందే ఏకైక గాయని ఫాల్గుణినే.
- ఉత్సవాల సమయంలో నెల రోజుల ముందే ఆమె డేట్స్ బుక్ అయిపోయి ఉంటాయి.
- పదేళ్ళ వయసులో స్టేజ్ పెర్ఫార్మెన్స్‌ను ప్రారంభించిన ఫాల్గుణి ఇప్పటికీ నెంబర్‌వన్ పొజిషన్‌ను కొనసాగించడం విశేషం.



- అందరు అమ్మాయిల్లా పంజాబీ డ్రస్ కాకుండా మగరాయుడిలా జీన్స్ ఫ్యాంట్, షర్ట్ వేసి, పైన కోట్ ధరించటం ఆమెకు అలవాటు. ఈ దుస్తులే తనకు నప్పుతాయని, తానెంతో సౌకర్యంగా భావిస్తానని అంటుంది ఫాల్గుణి. అలానే ఎప్పుడు చక్కటి క్రాఫ్‌తోనే ఆమె ఉంటుంది.
- ప్రేక్షకులు తన పట్ల ఇంత ఆదరాన్ని చూపడానికి కారణం ఏమిటో తనకు తెలియదని, అమ్మవారి ఆశీస్సుల కారణంగా ఇంత పాపులారిటీ తనకొచ్చిందని చెబుతుంటుంది ఫాల్గుణి.
- ప్రపంచ వ్యాప్తంగా మైఖేల్ జాక్సన్ ఎంత పేరు తెచ్చుకున్నాడో అలానే తానూ పేరు తెచ్చుకోవాలని, దాండియాను ప్రతి విదేశీయుడు ఆస్వాదించేలా చేయాలనేది తన కోరికని ఫాల్గుణి చెబుతోంది.

అద్నామ్‌సామీ, మహాలక్ష్మి సరసనా నేను నిలబడలేను. వాళ్ళంతా శాస్త్రీయ సంగీతాన్ని ఔపోసన పట్టిన వాళ్ళు. నేనా ఇప్పుడిప్పుడే అడుగులు వేస్తున్నదాన్ని. ఇక్కడ నాకంటూ కాస్త చోటు ఉంటే చాలు అనుకుంటాను. అలానే నాకు నేను పోటీగా భావిస్తాను' అని తెలివిగా సమాధానం చెప్పింది.

ఇవాళ మ్యూజిక్ ఆల్బమ్స్‌లో బాలీవుడ్ తారల హడావుడి బాగా పెరిగిపోయింది. జగ్జీత్‌సింగ్ 'క్యా ఖోయా ఖ్యా పాయా'లో షారూఖ్‌ఖాన్ దర్శనమిచ్చాడు. అలానే రాణీ ముఖర్జీ, రవీనాటాండన్, మహిమాచౌదరి, తాజాగా నమ్రతా శిరోద్కర్ ఇలా చాలామంది మ్యూజిక్ వీడియోలలో కనిపిస్తున్నారు. అద్నామ్‌సామి ఆల్బమ్‌లో బాలీవుడ్ తారలు చాలామందే నటించారు. నిజంగా మ్యూజిక్ ఆల్బమ్‌కు స్టార్స్ ఉపయోగపడతారా? అని అడిగితే, 'స్టార్స్ అప్పియరెన్స్ మీద నాకు పెద్ద విశ్వాసం లేదు. నేను నా వీడియోలో స్టార్స్ నటించాలని కోరుకోను. క్వాలిటీ అనేది ఇక్కడ యాభై శాతం విజయాన్ని ఇస్తుంది. దానితో పాటుగా మన గాత్రం బాగుంటే మిగిలిన యాభై శాతం విజయాన్ని పొందుతాం. బేసికల్‌గా మన గొంతే బాగోనప్పుడు ఏ స్టార్ మాత్రం ఆడియోను సక్సెస్ చేయగలరు?' అని తన అభిప్రాయాన్ని ఖరాఖండిగా చెప్పేసిందీ దాండియా క్వీన్. అయితే ఆమె మ్యూజిక్ వీడియోలో నటించిన అమ్మాయిలు మాత్రం ఇవాళ బాలీవుడ్‌లో హాట్ ఫేవరెట్‌లుగా ఎదుగుతున్నారు. మూన్‌మూన్‌సేన్ కుమార్తె రీమాసేన్, ప్రస్తుతం మూడు నాలుగు తెలుగు సినిమాల్లో కథానాయికగా నటించిన శ్వేత అగర్వాల్... తొలుత ఫాల్గుణి పాఠక్ మ్యూజిక్ వీడియోల్లో నటించిన వారే.

**- అరుణ సత్యవతి.**



ఓ పియా ఓ ...
ఓ పియా ఓ పియా లేకే దోలీ ఆ ॥2॥
చలూం మే తేరే హీ గలీ ॥2॥
ఓ పియా కే గలీ తో లాగే జగసే భలీ జగసే భలీ ॥ఓ॥
సాత్ రంగ్ కీ ఖ్వాబ్‌హా ఆఖోంమే సజే
సోయే సోయే అరమా ఆజ్ దిల్ మే జగే ఓ... ॥సాత్॥
చలూం మే తేరే హీ గలీ ॥2॥
ఓ పియా కే గలీ తో లాగే జగసే భలీ జగసే భలీ ॥ఓ పియా॥
హాతోంకీ లకీరోంమే ఆ ఛుపాలే ముఝే
కర్‌నా పాయే ఫిర్ కోయీ జుదా హీ హమ్ మే ఓ... ॥హాతోం॥
చలూం మే తేరే హీ గలీ ॥2॥
ఓ పియాకే గలీ తో లాగే జగసే భలీ జగసే భలీ ॥ఓ పియా॥

ఫల్గుణీ పాఠక్ పాటల్లో ఇదొక హిట్ సాంగ్... ఈ ఆల్బమ్ చిత్రీకరణ పరంగా మంచిపేరు తెచ్చుకుంది. ఎదురుగా వున్న ప్లాట్స్‌లోని కుర్రాడితో ప్రేమలో పడ్డ ఓ అమ్మాయి - అతగాడున్న పోర్షన్‌కి తాడు వేసి ఆ తాడు మీద నడుస్తూ ఈ పాట పాడుతూ వుంటే ... రెండు ప్లాట్స్ మధ్యనున్న ఆకాశం నుంచి చందమామ, కింద నుంచి చూస్తూ వున్న పాదచారుల రియాక్షన్స్... అదే స్ట్రీట్‌కి కారులో వచ్చిన ఫల్గుణి గొంతు కలపటం, ఇంతలో పైనున్న తాడు తెగిపోతే ఆ ప్రేమికురాలు చలించకుండా వేలాడుతూనే పాడడం, ఆ అమ్మాయిని రక్షించడానికి వచ్చిన ఫైర్ సర్వీస్ వారు కూడా స్టెప్పులు వేస్తూ ఆ పాటతో శృతి కలపటం, చివరకు ప్రేమికులిద్దర్నీ కలిపిన తర్వాత ఫైర్ సర్వీస్ వారు, పాదచారులు, ఫల్గుణీ పాఠక్ అభినందిస్తూ సెలవు తీసుకోవటం ఇవన్నీ పాటను మీరింత ఆకర్షణీయంగా రూపొందించి ప్రేక్షక శ్రోతలను ఈ ఆల్బమ్‌కు మరింత దగ్గర చేశాయి. ఎమ్‌టీవీలోనూ, ఛానల్ వీ లోనూ తరచుగా వచ్చే ఈ ఆల్బమ్‌కి టీవీలో ఇప్పటివరకూ ప్రతిరోజూ చాలా 'క్లిక్స్' తప్పనిసరిగా వుంటూనే వున్నాయి.







శ్రీరామనవమి ఈ పక్షంలోనే వస్తోంది. రాముడికీ, బాపుకీ ఉన్న బంధం ఆంధ్రప్రజలు అందరూ ఎరుగుదురు. ఇష్టదైవం ఆంజనేయుడంత భక్తిగా రాముణ్ని కొలుస్తారు బాపు. రంగనాయకమ్మ గారు 'రామాయణ విషవృక్షం' పుస్తకం రాసి కవరుపేజీ వేయమని బాపు గారికి చెప్పి పంపితే దాని వెనుక 'రామరామ' అని రాసి తిప్పి పంపారట ఆయన.

మానవ జీవితంలోని ఆదర్శాలను బోధించే రామాయణగాథను ఒక తరం నుండి మరొక తరానికి అందించాలంటే అనువైన మార్గం బొమ్మల ద్వారా పిల్లలకు చెప్పడం లేదా పండిత, పామర రంజకంగా తెరకెక్కించడం. పిల్లలకు పురాణ గాథలు చెప్పాలంటే తబ్బిబ్బు పడే తల్లులున్న ఈ ఆధునిక యుగంలో ఈ దిశలో బాపుగారు చేస్తున్న గణనీయమైన కృషి ఆంధ్ర ప్రజలను ఋణగ్రస్తులను చేస్తుంది.

రామాయణం గాథను కొత్త తరహాలో, అప్పటి దాకా వచ్చిన పౌరాణిక చిత్రాల పంథాకు భిన్నంగా 'సంపూర్ణ రామాయణం' గీసిన బాపు 'సీతాకళ్యాణం'ను ఒక దృశ్యకావ్యంగా మలిచారు. రామాయణం థీమ్‌ను సోషలైజ్ చేసి 'ముత్యాలముగ్గు', 'కలియుగ రావణాసురుడు' తీశారు. 'అందాల రాముడు' మధ్యతరగతి జీవితానికి దర్పణంగా తీసినా కథ గమనం, క్లైమాక్స్ అంతా భద్రాద్రి పయనమే.

ఉత్తరాది సంగీతమంతా కృష్ణమయం కాగా, తెలుగు సంగీతమంతా రామమయమే. బాపు పుణ్యమాని వెండితెరపై కూడా రాముడు ప్రకాశించాడు. తెలుగు తెరపై రాముడనగానే గుర్తుకు వచ్చే ఎన్.టి.రామారావు గారితో దరిమిలా 'రామాంజనేయ యుద్ధం'లో పనిచేసినా, తమ 'సంపూర్ణ రామాయణం'లో రామ పాత్రకు బాపు ఎంచుకున్నది శోభన్‌బాబునే! దర్శకుడిగా 'సంపూర్ణ రామాయణం'ను బాపు నడిపించిన తీరు అత్యద్భుతం. కథను వేగంగా నడిపిస్తూ రసవత్తరమైన ఘట్టాలున్న చోట అవి విపులంగా చూపుతూ చక్కటి ప్రయోగం చేశారు. హిందీ డబ్బింగ్ వెర్షన్ కూడా రజతోత్సవం చేసుకునే ఉత్తమ స్థాయిలో రూపొందిందా చిత్రం.

ఆ సినిమాను రిలీజ్ చేసే సందర్భంలో రామాయణ గాథను బొమ్మలలో అందించారు బాపు. తన సినిమాలోని పాత్రధారుల పోలికలతో చిత్రీకరించలేదు కాబట్టి రామాయణ గాథను మరొక్క మారు ఆబాలగోపాలనికీ అందించాలన్న కోరికతో బాపు బొమ్మలు వేశారనుకోవాలి ...... శ్రీ ...... గారు సేకరించి అందించిన ఈ బొమ్మలు 'హాసం' పాఠకులకు 'శ్రీరామనవమి కానుక'.













రాముడు విశ్వామిత్రుని
యాగానికి మారీచ
సుబాహులు భంగం చెయ్య
కుండా కాపాడాడు
మానవమాత్రులెవరూ
కదల్చలేనిది
మహాగొప్పది
అయిన
శివధనుస్సు
శ్రీరాముడు
అవలీలగా
ఎక్కుపెట్టి
భగ్నం చేశాడు
సీతారాముల
కల్యాణం
వైభోగంగా జరి
గింది
దశరథ మహారాజు శ్రీరామునికి పట్టాభిషేకం
చేయనిశ్చయించాడు. కైక దాసి మంథరకు
ఇది ఇష్టం లేదు. రాముని పద్నాలుగేళ్లు అడవు
లకు పంపమని, భరతునకు పట్టాభిషేకం జరి
పించమనీ దశరథుని వరాలడగమని
కైకకి దుర్బోధ చేసింది.
శ్రీరాముడు తండ్రి ఆజ్ఞ పాటించి సీత,
లక్ష్మణుడు వెంటరాగా అడవులకు వెళ్లాడు
పుత్ర వియోగం భరించలేక దశరథుడు
మరణించాడు
భరతునకు ఈ సంగతి తెలిసి ఎంతో దుఃఖించాడు
రాముని రాజ్యానికి రమ్మని బ్రతిమాలాడు.
చివరకు రాముని పాదుకలు తీసుకుని వాటినే
రాజ చిహ్నాలుగా సింహాసనం పై ప్రతిష్ఠించాడు
రావణుని చెల్లెలు శూర్పణఖ శ్రీరాముని చీకాకు
పెడుతూంటే లక్ష్మణునికి కోపం వచ్చి దాని
ముక్కు చెవులు కోసి పంపించాడు


ప్రతీకారంగా రావణుడు, రాముని దూరంగా తీసుకుపొమ్మని మాయలేడిని పంపించాడు
సీత ఒంటరిగా వుండగా రావణుడు వచ్చి ఆవిడను అపహరించుకుని పోయాడు
దశరథుని మిత్రుడైన జటాయువు సీతని కాపాడబోయాడు. కానీ రావణుడు వాని రెక్కలు నరికి నేలకూల్చేశాడు
రాముడు సుగ్రీవునితో మైత్రి చేసుకున్నాడు హనుమంతుని సీతను వెతకడానికై పంపాడు. హనుమ సముద్రం దాటి లంక చేరాడు
లంకిణిని చావ గొట్టాడు
అశోకవనంలో సీతమ్మను కలుసుకుని ధైర్యం చెప్పాడు. ఆవిడ ఇచ్చిన ఆనవాలు తీసుకున్నాడు
రామపరాక్రమం చెప్పి రావణుని బెదిరించి లంకంతా కాల్చి రాముని వద్దకు తిరిగివచ్చాడు




# హిందీ సినీ సంగీతంలో మలుపులు-మజిలీలు

## 1954

'టాక్సీడ్రైవర్' సినిమాకై ఎస్.డి.బర్మన్ సంగీత దర్శకత్వంలో తలత్ మొహమద్ 'జాయేతో జాయే కహా' అనే అద్భుతమైన విషాద గీతం ఆలపించారు. 'చాహే కోయీ ఖుష్ హో చాహే గాలియా హజార్ దే' అనే బృంద గానంలో కిశోర్‌కుమార్ గొంతు కలిపాడు.

గురుదత్ ఓ సరదా సినిమా 'ఆర్‌పార్' తీసి పాటల చిత్రీకరణలో తన సామర్థ్యాన్ని చూపాడు. ఓ.పి.నయ్యర్ గీతాదత్ చేత బ్రహ్మాండమైన పాటలు పాడించాడు. 'బాబూజీ ధీరే చల్‌నా', 'యేలో మై హారీ పియా', 'మొహబ్బత్ కర్‌లో జీ భర్‌లో' (రఫీతో డ్యూయెట్) ఇప్పటి హుషారు కలిగిస్తాయి.


'ఆర్‌పార్' లో గురుదత్, షకీలా, జానీవాకర్

రేడియో సిలోన్‌లో ప్రతీ నెలా మొదటి తేదీ మనక వినబడే పాట- 'దిన్ హో సుహానా, ఆజ్ పెహ్లీ తారీఖ్‌హై' సుధీర్ ఫాడ్కే సంగీత దర్శకత్వంలోకిశోర్ 'పెహలీతారీఖ్' చిత్రానికై ఈ పాటను పాడడం జరిగింది. ఈ సినిమాకు కథ రాసినది, స్క్రిప్టులో సహకరించినది దాదామిరాశి ('సింగపూర్ సిఐడి', 'నిర్దోషి' సినిమాల దర్శకుడు)


'పెహలీ తారీఖ్'లో తల్లిగా నిరూప్‌రాయ్

ప్రదీప్ పాటలు రాసిన 'జాగృతి' చిన్న బడ్జెట్ సినిమా అయినా హిట్ అయింది. హేమంత్ కుమార్ సంగీతంలో 'ఆవో బచ్చో తుమ్హే దిఖాయే, ఝూంకీ హిందూస్తాన్‌కీ', 'దేదీ హమేం ఆజాదీ' (వాజ్‌పేయి గారికి కూడా ఇష్ట మైన పాట) 'చలో చలో మాం' మంచి అపురూప మైన పాటలు రూపు దిద్దుకున్నాయి.


'జాగృతి'లో ఓ చిన్న పాత్రలో మెహమూద్

## కొంటెకొశ్నెన్లు-తుంటరి జవాబులు



టి. లక్ష్మీ ప్రసాద్, విశాఖపట్నం

ప్ర: ఆవులిస్తే పేగుల్లెక్క పెట్టేస్తాను నేను... నా నుంచి మరి మీరెలా తప్పించుకోగలరు?

జ: ఎద్దులిచ్చి...

జె. శ్రీకాంత్, రాజమండ్రి

ప్ర: అసలుసిసలైన భాగ్యనగరపు ఇల్లాలు?

జ: 'పిల్లల ఉత్సాహం మీద నీళ్ళు జల్లకండి' అని ఎవరైనా చెబుతే...

'స్నానంకి బదులు ఒంటిమీద జల్లుకోడానికే నీళ్ళు రావటంలేదు ఇంక ఉత్సాహం మీద ఎక్కడ జల్లగలం?' అని జవాబిచ్చేది.

కూర్మాన వెంకట సుబ్బారావు, విశాఖపట్నం.

ప్ర: వాతావరణం కేంద్రంలో పనిచేసే వ్యక్తిని 'జీవితం ఎలా వుందంటే' ఏం చెబుతాడు?

జ: మూడు లోన్లు ఆరు సైక్లోన్లు గా ఉందంటాడు.

## డబుల్‌రోల్



'హరి' నీ పట్ల అలా 'వ్యవహరించాడేంటి'!?

'ఉగాది' అయితేనేం అలా 'ఎగాదిగా' చూడాలా!?

-పూజారి సింహాచలం, పాడేరు.

అతడు 'రేసు'లో జరిగిన విషయాన్ని 'నేమరేసు' కుంటున్నాడు.

-జె. శ్రీకాంత్, రాజమండ్రి.



## చిలిపి లిపి



When D = వెండి

Bun గా Rum = బంగారం

-బద్ది నాగేశ్వరరావు, అనకాపల్లి.

Thin King = థింకింగ్

-వై.కీర్తిసాగర్,ఏలూరు

## ఈ రూటే వేరు






Bush = Bomb Upon Saddam Hussain

-ఎమ్. శ్రేష్ట హైదరాబాద్.

Come lime = దానిమ్మ

Slate Change = పలకనూరు

-బద్ది నాగేశ్వరరావు, అనకాపల్లి.

ఏప్రిల్ 7వ తేదీ ప్రపంచ ఆరోగ్య దినోత్సవం సందర్భంగా...



## పేరడీ పేరేడ్

దోమేనా... ఆ...ఆ...ఆ...ఆ...
దోమేనా... నను తట్టినది దోమేనా నను కుట్టినది
దోమేనా నా చెవిలో దూరి నిద్దుర భంగము చేసినది.... దోమేనా
దోమేలే నిను తట్టినది దోమేలే నిను కుట్టినది
దోమేలే నీ చెవిపై వాలి గాన కచేరీ చేసినది....దోమేలే ॥దోమేనా॥
తనువున దురదలు పూయించి
నా ఒంటిని బరబర గోకించి
ఒడోమస్ ఆలౌట్ కొనిపించి
పొగ పట్టించి తెగ ఏడ్పించీ... ॥దోమేలే॥

-తెలికచర్ల రామకృష్ణ, విజయనగరం.

(మాయాబజార్ చిత్రంలో "నీవేనా...నీవేనా నను" అనే పాటకి పేరడీ)

## షార్ట్‌కట్స్

| | | |
|---|---|---|
| పిన్నింటి చిన్న కమల | = | పిచిక |
| తూరుబాటి నీరజా గణపతి | = | తూనీగ |
| మేడికొండ కళావతి | = | మేక |

-తాళాభక్తుల లక్ష్మీప్రసాద్,
విశాఖపట్నం.






## పేరు -రిపేరు

ఆవిడ మా ఆవిడే -సతీ లీలావతి

-వి.వి.యస్.మహాలక్ష్మి
చీపురుపల్లి

ఒట్టేసి చెబుతున్నా -నువ్వు నాకు నచ్చావ్

-రాజేష్, హైదరాబాద్

జగదేకవీరుడు అతిలోకసుందరి -లవ్‌బర్డ్స్

-రమేష్, హైదరాబాద్

## చిలిపికవిత






ఏ సభకైనా వచ్చే
పిలవని పేరంటం
ఎవరైనా సరే
ఆరంటాం నూరంటాం!!
అన్నన్నా...!
ఎన్నన్నా
అది కూడా వారికో
పబ్లిసిటీ టాంటాంటాం!!!

-పి.గిరి
భీమవరం

# సంగీత గజాన్ని అధిరోహించిన

# కొచ్చెర్లకోట రామరాజు (1878-

పోలవరం ఒకప్పుడు సంస్థానం... ప్రస్తుతం శిథిలమైన పెద్ద దివాణం... ఒకప్పుడు ఎంత వైభవంగా వెలిగిందో తలుచుకుంటే బెంగ కలిగింది...




వార్ధక్యంతో పెచ్చులూడిపోయిన గోడలు...

గాజు కళ్లతో గతాన్ని గుర్తు తెచ్చుకుంటున్నట్టు ఉన్న పైకప్పూ...

ఎంతమంది మహానుభావులు నా గుండా వెళ్ళారో అని గుండెలు బాదుకుంటున్న సింహద్వారం!... పడిపోడానికి సిద్ధంగా ఉన్న తలుపులూ...

సంగీత సాహిత్యాల హోరులో కళకళ్లాడి... ప్రస్తుతం... శ్మశాన నిశ్శబ్దంగా బావురుమంటూ బంగళా...

రాజువారి కిరీటం లోంచి తొంగిచూసే తురాయిలాగ...

గోడ నందుల్లోంచి ఎండిపోయిన గడ్డి పరకలూ...


ఒకప్పటి సంస్థానం... నేడు శిథిలమైన స్థైనం...

ఏదైనా ఇంతే కాబోలు... కాలపురుషుడు ఎంత దయలేనివాడు...

'కారే రాజులు రాజ్యముల్ కలుగవే... వారేరీ సిరి మూట కట్టుకుని పోవం జాలిరే' అంటాడు పోతన... భాగవతంలో..

కొచ్చెర్లకోట ప్రభువులు... సిరిమూట కట్టుకుపోలేదు గానీ..

బోల్డంత కీర్తిని మాత్రం మూటకట్టుకున్నారు!

ఆ కీర్తి పరిమళాలు ఇంకా ఆంధ్రదేశమంతా వ్యాపిస్తూనే ఉన్నాయ్...

కొచ్చెర్లకోట వంశం వారు ఆరువేల నియోగులు...

కొచ్చెర్లకోట వేంకట జగన్నాధం గారు... పోలవరాన్ని పాలించిన మొదటి పాలకులు..

పోలవరం సంస్థానాధీశులు దైవభక్తులు...

పక్కనేవున్న 'పట్టిసీమ' శైవక్షేత్రానికి వంశపారంపర్యంగా ధర్మకర్తలు..

ప్రస్తుతం.. కొచ్చెర్లకోట వారు... ఎక్కువమంది విదేశాల్లో స్థిరపడ్డా... ప్రతీ సంవత్సరం 'శివరాత్రి'కి ఆ వంశంవారంతా అక్కడికి చేరి అభిషేకాలు చేస్తారని తెలిసింది!... వాళ్లకి వాళ్ల కుటుంబం పట్లా... ఆ సంస్కృతీ సంప్రదాయాల పట్లా ఉన్న గౌరవానికి నమోవాకాలు...

పోలవరం సంస్థానం పచ్చగా ఉండే రోజుల్లో ఎంతోమంది సంగీత కళాకారుల్నీ, సాహితీ వేత్తల్నీ గౌరవించి పోషించింది!..

ఆ సంస్థానానికి చెందిన సంగీత విద్వాంసుడే కొచ్చెర్లకోట రామరాజు గారు... తూర్పుగోదావరి జిల్లాలోని 'ఉప్పాడ' గ్రామంలో 1878లో జన్మించారు.. బాల్యం నుంచీ సంగీత-సాహిత్య విద్యాధురీణులైన 'నాదయోగి' బ్రహ్మశ్రీ చేబోలు వెంకటరత్నం గారి దగ్గర సంగీత సాధన చేశారు.. ఆ తర్వాత కొన్నాళ్లు పట్నం సుబ్రహ్మణ్య అయ్యర్ శిష్యులైన సి.యస్.కృష్ణస్వామి దగ్గర కొంతకాలం... జంత్రగాత్రాలని అభ్యసించారు.

సాధన అంటే రాక్షస సాధన రాజు గారిది...

అదే దీక్ష... అదే పట్టుదల... అదే ధ్యాస...

అసలు అదే రహస్యం.. ఏ విద్యన్నా పట్టుపడాలీ అంటే అర్జునుడికి కనిపించిన పక్షి కన్నులాగ... మరో దానిమీద దృష్టి ఉండకూడదు... అదే గద తపస్సంటే..

వాయులీనాన్ని ఆవాహన చేసేసుకున్నాడు రామరాజు..

రాముడి కోదండం లాగ... రామరాజుకి వాయులీనం... కమాను సంధించాడంటే నాద వర్షం..

ఆఖరికి వాయులీన రహస్యాల్ని ఎంత ఆకళింపు చేసుకున్నాడంటే..

కమాను లేకుండా... కేవలం చేతివేళ్లతో తీగల్ని మీటే

కావల్సిన ధ్వనుల్నీ... రాగాల్నీ వాయించే స్థితికొచ్చాడు...

అంటే వాయులీనం ఆయన ఉచ్ఛ్వాస... నిశ్వాసం...

వాయిలీనం... ఆయన గుండెకాయ...

వాయులీనం... ఈయనలో విలీనం...

సరళీస్వరాలు, జంట స్వరాలు సంగీతాభ్యాసకులకు ఉపయోగపడే విధంగా 'గాయక మనోరంజని' అనే సంగీత గ్రంథాన్ని రాశారు... స్వరపల్లవులు గూడ రాశారు... 'శ్రీకృష్ణ కర్ణామృతం' నూటయెనిమిది కీర్తనలు కూడా రాశారు..

ఈయన కీర్తి ప్రతిష్ఠలు వినీ పోలవరం సంస్థానాధీశులు కొచ్చెర్లకోట కృష్ణారావు గారు రామరాజు గారిని ఆస్థానానికి ఆహ్వానించి కచేరీ పెట్టించారు.. పోలవరం సంస్థానంలో జరిగిన.. అద్భుతమైన కచేరీలో 'ఇదొకటి'గా శాశ్వతమైన అనుభూతి మిగిల్చిందట!

అలాగే 'శ్రీరామకీర్తన కర్ణామృతం' అనే మరో సంగీత గ్రంథం రాశారు.. అది పాడుకోడానికి సులువుగానూ... మధురంగానూ కూడా ఉందని... మిత్రులు కొంత మంది కోరగా... అది ప్రింటు కావడం జరిగింది! అందులో శంకరాభరణం, ఖరహరప్రియ, కేదార, బిళహరి హరికాంభోజి, పుష్పతిలక, జంఝూటి, కానడ, నాదనామక్రియ, దర్బార్, చక్రవాకం వంటి ప్రసిద్ధ రాగాల్లో ఎన్నో కీర్తనలు రాశారు!...

ఉదాహరణకి, ఖరహరప్రియ రాగంలో... రాముడి చరితం...

పల్లవి : శ్రీ రఘురాముని చరితము వినుడీ
: రాతిని ప్రేమతో నాతిగ జేసీ, ఖ్యాతిగ విల్లుద్రుంచీ

: సీతను గైకొని భూతలేశుడని పౌరులు పొగిడిన
: వానర వీరుని వాలిని ద్రుంచీ, దినకరపుత్రుని ఘనమున బ్రోచీ అనిల సుతునికెంతో ఆదరమొసిగిన...
: దారి కొరకు బలు వారధి కట్టి క్రూరుని లంకేశుని కూలగసేసి నీరజనేత్రని నేర్పుతో తెచ్చిన...

కృతికీ కీర్తనకూ గల లక్షణాలలో కృతికంటే, కీర్తనలో సాహిత్యానికి ప్రాధాన్యత ఎక్కువ ఉంటుంది... కీర్తన పురాతనమైన రచన... రామరాజుగారు అదే పాటంటారు...

అలాగే... దైవాన్ని నిలదీసి... దెప్పి పొడిచి... తన కోరిక తీర్చమనే నిందాస్తుతి...

ఏరా నాపై దయరాదు నేనెంత వేడుదునో రామా
చిన్ననాటి నుండి సేవ చేసెదనని చెప్పుకొంటి
కావుమని కరి రాజు ప్రార్థించగా... గక్కున ఏలుట అబద్ధమా!
మిత్రునితో బ్రోవ వచ్చేవు...

వంటివి... ఎంతో ఆర్ద్రంగా... హృద్యంగా ఉంటాయ్..

1930లో రాజోలులో వకీలు సంఘం వారు... రామరాజుగారి షష్టిపూర్తికి ఘనంగా సన్మానం చేశారు. సన్నాయిమేళం ఏర్పాటు చేసీ... ఏనుగు అంబారీపై ఊరేగించారు.

ఆ సాయంత్రం ఏర్పాటు చేసిన పౌరసభలో... ఊరు ఊరంతా చప్పట్లతో దద్దరిల్లి పోయేలా... 'మహామహోపాధ్యాయ' అన్న బిరుదు కూడా ప్రదానం చేశారు.

ఎన్నో సత్కారాలూ... సన్మానాలు పొందిన.. కొచ్చెర్లకోట వారు నిగర్వి.. నిరాడంబరులు... చివరి దశలో తాను గోదావరి ప్రాంతంలోని 'తాటిపాక'లో స్థిరపడి... అక్కడ తన ఇంటనే పూజా మందిరాన్ని ఏర్పాటు చేసి... త్యాగరాజస్వామి వారి విగ్రహాన్ని ప్రతిష్ట చేసే... ఆరాధనోత్సవాలు ఆరంభం చేశారు!



ఆ ప్రాంతంలోని అనేకమంది యువతీ యువకుల్ని చేరదీసీ... ఉచిత భోజన వసతులు ఏర్పాటు చేసీ... ఉచితంగా సంగీతాన్ని నేర్పించేవారు...

సంగీతం కోసం తమ సర్వస్వాన్నీ త్యాగం చేసిన... మహానుభావులు ఎందరో... వారిని స్మరించుకోవడం... మన అదృష్టం...

**-తనికెళ్ల భరణి**

డాక్టర్ సి.విజయలక్ష్మిగారు రచించిన 'ఆంధ్రప్రదేశ్ సంస్థానాలు -సంగీత వాఙ్మయం' చదివి,స్పందించి)

**-భరణి**

ఈ వ్యాసంపై అభిప్రాయాన్ని శ్రీ తనికెళ్ళ భరణికి తెలియజేయ దలచుకునే వారు
**తనికెళ్ళ భరణి,**
**కేరాఫ్: "హాసం", 502, శ్రీబాలాజీ నిలయం, 13-1-212,**
**మోతీనగర్, హైదరాబాదు - 500 018**
**అడ్రసుకు ఉత్తరాలు పంపాలి.**

**శ్రీయుత తనికెళ్ళ భరణి గారికి,**

'హాసం' ప్రతి సంచికలోనూ కర్ణాటక సంగీతంలో లబ్ధ ప్రతిష్ఠుల గురించి చదువరులకు అత్యంత ఆసక్తికరంగా ఎన్నో సంగతులు తెలియజేస్తున్నారు. ఎంతయు ముదావహం.

డిసెంబరు 1-15 సంచికలో గాయక సార్వభౌమ శ్రీ పారుపల్లి వారి గురించిన వ్యాసంలో, పెద కళ్ళేపల్లి సుసర్ల వారి ఇంట ఆయన సంగీతాభ్యాస సమయంలో మీరు చేసిన ప్రకృతి వర్ణన, పాకశాలలో సంగీతం ఎట్లా వెల్లివిరిసేదీ చదువుతుంటే మా కళ్ళ ఎదుటే అవన్నీ జరుగుతున్న అనుభూతి కలిగింది. రచనలో మీ చమత్కార ప్రయోగాలకు జోహార్! పంతులు గార్ని మద్రాసు మ్యూజిక్ అకాడమీ వారు 'ఎక్స్‌పర్ట్స్ కమిటీ'లో సభ్యునిగా చేర్చుకుని, ఆయన సలహాలను కూడా తీసుకునే వారనే సంగతి పొరబాటున మీ వ్యాసంలో చోటుచేసుకోనట్లుంది. ఆయనను ఒక సంగీత విశ్వవిద్యాలయంగా పేర్కొనవచ్చును. తమ గురువు గారి వలె ఒకేచోట స్థిరంగా గురుకులం నడపకుండా, అనేకచోట్ల సంగీత ప్రదర్శనలిచ్చి మెప్పు పొందిన మహానుభావుడు. ఆంధ్రదేశంలో ఈనాడు త్యాగరాజ పారంపర్యమైన సంగీతం మనం అందరం విని ఆనందించే భాగ్యం కలిగిందంటే దానికి కారణం సుసర్ల వారు ఆ కాలంలో మీరు చెప్పినట్లు ఎన్నో వ్యయప్రయాసలకోర్చి తిరువైయారు వెళ్ళి సంగీతం నేర్చుకొని రావటం, ఎంతోమంది ఉద్దండులను సంగీత విద్వాంసులుగా తయారు చేయడం, వారిలో ప్రముఖులు శ్రీ పారుపల్లి రామకృష్ణయ్య పంతులుగారు. అనేకమంది శిష్యులను తయారు చేయటం, వారందరూ తమ సంగీత విద్యను త్యాగరాజ ప్రసాదితంగా, నిగర్వంగా, మనకందరికీ వినిపించటం, తిరిగి వారి వంతు ఎంతో మంది శిష్యులను తయారు చేయటం (ఉదా : నేతి శ్రీరామ శర్మగారు, అన్నవరపు రామస్వామి గారు, మంగళంపల్లి బాలమురళీకృష్ణగారలు) అని చెప్పవచ్చును.

ఒక సందర్భంలో పురాణం పురుషోత్తమశర్మగారు వ్రాసిచ్చినట్లు దక్షిణామూర్తిగారు తిరువైయారు వెళ్ళి యుండకపోయినట్లైతే, మనకి ప్రస్తుతం త్యాగరాజు సంగీతాన్ని ఇంత విస్తృతంగా వినే అవకాశం కలిగేది కాదేమో?!

ఈ మీ వ్యాస పరంపరలో ఇంకా ఎందరు సంగీతజ్ఞులను పరిచయం చేస్తారో అనిఎదురుచూస్తున్నాము.

పారుపల్లి వారి గురించిన వ్యాసం అందించినందుకు మీకు ప్రత్యేకంగా కృతజ్ఞతలు.

శ్రీ సుసర్ల వారి చిత్రపటం (ఫోటో) నా దగ్గర ఉంది. కావలసినచో ఇవ్వగలను. సుసర్ల వారి జీవిత సంగ్రహం కూడా ఉంది.

మరొక్కసారి మీకు అభివందనాలను సమర్పిస్తూ...

నమస్కారములతో...

భవదీయుడు
బొమ్మకంటి దక్షిణామూర్తి, మల్కాజ్‌గిరి, హైదరాబాదు.




పాటలను క్లిష్టంగా స్వరపరిస్తే ఆ రంగంలోని పండితుల ప్రశంసలు లభిస్తాయి. శ్రావ్యంగా స్వరపరిస్తే చాలా మంది మెచ్చుకుంటారు. సాధారణంగా ఈ రెండు వర్గాల మధ్య గల దూరం ఒకసారి సమాంతరంగానూ, ఒక్కోసారి ఎక్కువగానూ ఉంటుంది. క్లిష్టతలో శ్రావ్యతను, శ్రావ్యతలో క్లిష్టతను సమతూకంలో మేళవిస్తూ స్వరరచనలు చేసే వారిని గురించి తల్చుకున్నప్పుడు చటుక్కని స్ఫురించే వాళ్లలో ఉత్తరాదిన ఒక సలీల్ చౌధురి, ఒక జయదేవ్, దక్షిణాదిన ఎమ్మెస్ విశ్వనాథం, ఖచ్చితంగా ఉంటారు. ఎవరు ముందు, ఎవరు తర్వాత అనే రంధ్రాన్వేషణాంశాలను పక్కన పెట్టేసి రసాస్వాదన వరకు చూసుకుంటే వీరందరిలాగే మన తెలుగులో అటువంటి లక్షణాలను పుణికి పుచ్చుకున్న సంగీత దర్శకులలో ఒకనిగా సుసర్ల దక్షిణామూర్తిని చెప్పుకోవచ్చు. ఆయన స్వరపరిచే గీతాలలో క్లిష్టత పాళ్ళెంతో, శ్రావ్యత పాళ్ళెంతో పాడగలిగే వాళ్లకి మాత్రమే అర్థమవుతుంది. అంతటి వ్యక్తి కూడా కొన్ని కొన్ని సార్లు అన్యభాషలో అత్యధిక ప్రజాదరణ పొందిన ట్యూన్‌లను స్వీకరించిన సందర్భాలు లేకపోలేదు. అందుకు సాక్ష్యంగా 1957లో విడుదలయిన మోడ్రన్ థియేటర్స్ వారి

# వీరకంకణం

చిత్రంలోని ఓ రెండు పాటల్ని ఉదహరించవచ్చు. 1950లో తమిళంలో వచ్చిన 'మంత్రికుమారి' చిత్రం ఈ చిత్రానికి ఆధారం. ఆ తమిళ చిత్రానికి జి.రామనాధన్ సంగీత దర్శకుడు. ఆయన స్వరపరిచిన ఓ రెండు పాటలను 'వీరకంకణం'లో ఉపయోగించటం జరిగింది. ఆ రెండు పాటలతో పాటు నేటికీ పేర్కొనదగిన స్థాయిలో గల మరో రెండు పాటలను కలుపుకున్న విశ్లేషణ యిది.




కట్టండి వీరకంకణం
పట్టండి ధర్మఖడ్గమే
దేశభక్తి చూపుటకై
దుర్మార్గుల బాపుటకై ॥కట్టండి॥
స్వార్థపరులు పెచ్చురేగి
స్వదేశమునే పీడించగ ॥స్వార్థ॥
చూసి వూరకుందురా
లేచి శక్తి చూపరా
కట్టండి వీరకంకణం ॥3॥
భద్రకాళివంటి వీర
రుద్రమాంబ మన సోదరి...మనసోదరి ॥భద్ర॥
కొంచెమ్మైన జంకనట్టి ॥భద్ర॥
మాంచాల మన చెల్లెలు
ప్రమాదమున దేశమున్న
ప్రాణమ్మైన యిచ్చుటలో
ఆడువారు వెనుకాడరు - ॥2॥
ఓడిపోవుటే ఎరుగరు ॥2॥ ॥కట్టండి॥
కట్టండి వీరకంకణం - ॥4॥
పట్టండి ధర్మఖడ్గమే
తెలుగు కీర్తి నిలుపుటకై
దేశభక్తి చూపుటకై ॥కట్టండి॥











ఈ పాటను ఆరుద్ర రాయగా ఎ.ఎం.రాజా, జిక్కి పాడేరు. ఎన్.టి.రామారావు, రేలంగి, జమునతో పాటు పెక్కుమంది ఉపపాత్రధారులు అభినయించిన ఈ పాటకు మోహనరాగం ఆధారం. ఒకరకంగా టైటిల్‌సాంగ్ అని చెప్పదగ్గ ఈ పాట పల్లవి చాలా రోజుల వరకు జనం నోట ఒక రిఫరెన్స్‌లా కోట్ చెయ్యబడేది. ఇవాళ విన్నా కూడా ఈ పాట చక్కని ఉత్తేజాన్ని కలుగజేస్తుంది.

ఆమె : తేలి తేలి నా మనసు
తెలియకనే నావ వలే
ఊగుచున్నదే ॥తేలి॥
అతడు: అలలు లేచి ప్రేయసీ
హోయియని పాటవిని
తాళం వేయునే ॥అలలు॥
ఆమె : ప్రేమ ముందు కొండ కూడ
చిన్నదైనదో ॥ప్రేమ॥
అతడు: కొండవంటి గుండెనీవు
తెలియలేవులే ॥కొండ॥
ఆమె : తేటనీరు వంటి మంచి
ప్రేమ ఇదేనోయ్... ॥తేట॥
అతడు: నలుసులెన్ని ఉన్నవో
తెలుసుకోగదే
ఆమె : ఇంత వింత మాటలాడ
ఎవరు నేర్పిరో ॥ఇంత॥
ఆమె : నీదు ఓర చూపులోన నేర్చుకుంటినే
ఇద్దరు : సాగారాన ఆగకనే
ప్రేమయనె పెన్నిధికై సాగిపోదమా ॥సాగ॥



ఆరుద్ర రచించిన ఈ పాటను ఘంటసాల, జిక్కి ఆలపించగా జగ్గయ్య, జమునపై చిత్రీకరించారు. ఈ పాటలో చరణానికి చరణానికి మధ్య గల ఇంటర్‌లూడ్స్‌లోను, పాడే పద్ధతిలోను పాట స్వభావానికి తగ్గట్టుగా తేలిపోతున్న ఫీలింగ్ కలిగేలా స్వరపరచటం జరిగింది. అలుపు, అడ్డు, ఆపు లేని ఓ నది ఎన్ని మెలికలు తిరుగుతూ ప్రవహిస్తూ పోతుందో - నది పేరుని ఇముడ్చుకున్నందుకన్నట్టుగా - యమన్‌కళ్యాణి రాగం కూడా ఈ పాటలో అన్ని పోకడలూ పోయింది. 'ప్రేమ ముందు కొండ' దగ్గిర 'తేటనీరు వంటి' దగ్గర మెలికలు తిరిగిపోయింది. 'ఇంత వింతమాటలాడ ఎవరు నేర్పిరో' దగ్గిర ఒదిగిపోయింది. 'కొండవంటి గుండె' దగ్గిర, 'నీదు ఓరచూపులోన' దగ్గిర-ఎగుడు దిగుడుల్లో పూర్తి పట్టుగల శాంత గంభీరత్వాన్ని పోలిన నడకలు నడిచింది. 'నలుసులెన్ని ఉన్నవో తెలుసుకోగదే' దగ్గిర ఎంత ఎదగాలో అంత ఉవ్వెత్తున ఎగిసిపోయింది. తమ ప్రతిభను తెలుసుకొనగోరే గాయనీ గాయకులకు ఈ పాట ఓ లిట్మస్ టెస్ట్ లాంటిది. తమిళంలో 'ఉలవుమ్ తెండ్రళ్ పాటైయిలె ఓడమిదె నా మదిళ్ళై ఊంజలాడదె' పల్లవితో వచ్చిన ఈ పాటను జిక్కితో పాటు తిరుచ్చి లోకనాథన్ పాడేరు. తమిళ గీతాల్ని సేకరించే తెలుగువారికి ఈ తిరుచ్చి లోకనాథన్ 'వివాహభోజనంబు' పాటను తమిళంలో 'కళ్యాణ సమయసాదం'గా పాడిన గాయకుడిగా గుర్తుండే ఉంటారు. మరొక గాయకుడిని తక్కువ చేయడం సంస్కారం అనిపించుకోదు. గానీ ఒకే ట్యూన్‌తో రెండు పాటలు (వేర్వేరు భాషలలో) వెలువడినప్పుడు వాటిని పాడిన గాయనీ గాయకుల గాన సామర్థ్యానికి సంబంధించిన చర్చ తప్పనిసరిగా వచ్చి తీరుతుంది. అందులోని భాగంగా అనుకుంటే - తమిళ, తెలుగు పాటలను రెండింటినీ పక్కపక్కన పెట్టుకుని వింటే - ఘంటసాల మనవాడైనందుకు గర్వపడని తెలుగు వాడుండడు. చరణాల తర్వాత పల్లవి ఎక్కడా రిపీట్ కాకపోవటం ఈ పాట ప్రత్యేకతలలో ఒకటి.

సిగ్గులు చిగురించెనే
బుగ్గలు ఎరుపెక్కెనే
కన్నులు బరువెక్కెనే
కారణాలు చెప్పవే ॥సిగ్గులు॥
చెలియ ఓ చెలియా కారణాలు చెప్పవే
అయ్యో రామా, అయ్యో రామా -
అదియే తొలిప్రేమ తెలుసుకొనవె భామా
పేరు పలకపోతే నా పెదవి అదిరెనే
తిన్నగా చూసేందుకు కన్ను బెదరునే
కన్ను బెదరునే
అయ్యో రామా - అయ్యో రామా -
అదియే తొలిప్రేమ తెలుసుకొనవె భామా
ఆతనితో గడిపినట్టి దినమే ఒక క్షణము
దినమే క్షణము
అతను లేని క్షణమే - ఒక యుగము
అదియే యుగము
చీమ చిటుకు మన్నా తానే అనిపించు ॥2॥ ॥సిగ్గు॥
ఏమిటమ్మ ప్రేమ ఈ భువినే మరిపించు
భువినే మరిపించు
అయ్యో రామా - అయ్యో రామా -
అదియే తొలిప్రేమ తెలుసుకొనవె భామా



ఈ పాటను రావు బాలసరస్వతిదేవి, బృందం పాడగా జమున, చెలికత్తెలుగా వేసిన కొందరు ఉపపాత్రధారిణులు కలిసి కృష్ణకుమారి ఎదుట నృత్యం చేస్తూ అభినయిస్తారు. 'అయ్యో రామా అయ్యోరామా అదియే తొలిప్రేమ తెలుసుకోవె భామా' అనే వాక్యాలు, వాటికి జతపడ్డ ట్యూన్‌ని మినహాయించుకుంటే హాయిగా పాడుకోదగ్గ ఈ గీతాన్ని రాసింది ఆరుద్ర.

అతడు: రావే...రావే...
పోవు స్థలం అతి చేరువయే
నా రాణీ ॥పోవు॥
ఆమె : ఆహా - చల్లగా వీచును గాలి
అంతయు వింతగ తోచునే ॥ఆహా॥
అతడు: ఇంతకుమించిన వింతదనాలు
చెంతకు చేరుట నేడే - ఇంత చూడే॥రావే॥
ఆమె : తనివి తీరునా - మేను తిరుగునా ॥తనివి॥
మమతలే మైకముగ మారునే
అతడు: సుఖముగా మేను మరచుట ॥సుఖముగా॥
గిరిశిఖరమందునే - రావే రావే...
ఆమె : హాయిగా ఇకను మనసు తీరగా
స్వర్గ సౌఖ్యమే చూద్దాం... ॥హాయిగా॥
అతడు: నీకీరోజే నిజముగా నేనే
స్వర్గద్వారములు తీస్తా ॥నీకీ॥
రావే... రావే...
భూమిని వీడి పోవుట నేడే
రావే... రావే...



ఈ పాటను ఘంటసాల, జిక్కి పాడగా జగ్గయ్య, జమున అభినయించారు. ఈ పాటకు కూడా తమిళ మాతృకలోని, వారాయ్... నీ... వారాయ్... పోగుం మిడం దూరమిల్లై... నీ వారాళ్" అనే పాట ట్యూన్‌ని తీసుకున్నారు. ఈ తమిళ గీతాన్ని తిరుచ్చి లోకనాథన్, జిక్కి పాడేరు. ఈ పాటలో మందగమనాన్ని తెలుగులో మరింత వేగవంతం చేసి తేజోవంతంగా తీర్చిదిద్దారు సుసర్ల. ఇహ రెండు పాటల్లోనూ గాయకుల పెర్మార్మెన్స్ గురించి చెప్పుకుంటే 'తేలి తేలి' పాటలో చెప్పుకున్నదే మరోసారిక్కడ మననం చేసుకోవాలి.

ఈ పాట స్వరపరంగా ఎంత ఉత్కృష్టంగా ఉంటుందో సన్నివేశపరంగా అంత తమాషాగా ఉంటుంది. ఆరుద్ర-ఘంటసాల-జిక్కి ఈ పాటను నిలబెట్టిన తీరు అనుపమానం. ఘంటసాల గాత్రానికుండే రేంజ్‌ని, ఏ స్థాయిలోనైనా ఒదిగిపోగల జిక్కి గళ బలాన్ని ఎంతగా ఉపయోగించుకోగలరో అంతగానూ ఈ పాటలో అతి చక్కగా వాడుకోగలిగారు సుసర్ల. 'ఇంతకు మించిన వింతదనాలు' చరణంలో 'నేడే-చూడే' అంటున్నపుడు, 'సుఖముగా మేను మరచుట గిరి శిఖరమందునె' అనే వాక్యాలతో 'ఖ' అనే అక్షరాన్ని వెలికి తీస్తున్నప్పుడు, ఆ తర్వాత వచ్చే 'రావే రావే' దగ్గిర ఉండే ఎగుడు దిగుడు గ్రాఫ్‌ల ఆలాపన వింటుంటే ఘంటసాల వంటి గాయకుడు తెలుగువాడిగా పుట్టినందుకు గుండె ఉప్పొంగిపోతుంది. 'హాయిగా మనసు తీరగా' చరణంలో 'చూద్దాం' అంటూ 'మ' కారం మీద జిక్కి ఇచ్చిన ఆలాపనకి శరీరం రోమాంచితం అయిపోతుంది. భీంప్లాస్ రాగంలోని జీవ స్వరాలన్నీ సజీవంగా మన కళ్ళముందు నిలబడి నాట్యం చేస్తున్నంత మనోహరంగా మలచబడ్డ ఈ పాట-పాడగల సత్తా ఉన్న ప్రతివారి శ్వాసకోశాలకి ఓ చక్కని వ్యాయామంగా చెప్పుకోవాలి.

సన్నివేశపరంగా ఉండే తమాషా ఏమిటంటే-సాహిత్యం చూస్తుంటే హనీమూన్ కోసం హిల్‌స్టేషన్‌కి వచ్చి పాడుకుంటున్నట్టు ఉంటుంది. కానీ-ఎత్తుకి తీసుకువెళ్ళి భార్యని చంపేద్దామన్న ఎత్తుతో పాడే దుష్టబుద్ధి గల భర్త దురాలోచనకి అన్వయం కుదిరేలా రాయటం-ఆరుద్ర చేసిన చమత్కారం.

ఈ సందర్భంగా చెప్పుకోదగ్గ మరో ముఖ్య విషయం ఏమిటంటే - మంచి పాటలు రెండూ విలన్ పాత్రధారియైన జగ్గయ్యకు పెట్టడం, హీరోలకు పాడే ఘంటసాల చేత వాటిని పాడించటం, హీరో పాత్రధారి ఎన్.టి.ఆర్.కి ఎ.ఎమ్.రాజా చేత పాడించటం చాలా ఆశ్చర్యంగా ఉంటుంది...! ఇలాంటివి ఇప్పుడు ఊహించగలమా!?



తారాగణం:
ఎన్టీ రామారావు
జగ్గయ్య
రేలంగి వెంకట్రామయ్య
గుమ్మడి వెంకటేశ్వరరావు
రమణారెడ్డి
పేకేటి శివరాం
కె.వి.ఎస్.శర్మ
వై.వి.రాజు
జమున
కృష్ణకుమారి
గిరిజ, రమాదేవి
ఇ.వి.సరోజ మరియు రెడ్డి, రాజు, సింగారం, రాజారాంరావు

టెక్నీషియన్లు :
మాటలు,పాటలు : ఆరుద్ర
సంగీతము : సుసర్ల దక్షిణామూర్తి
నృత్యములు : శ్రీ వడూరు రామయ్య పిళ్ళై, చోప్రా, వి.పి.బలరామ్, సంపత్‌కుమార్, చిన్నీలాల్
ప్లేబాక్ : ఘంటసాల, ఎ.యం.రాజా, పి.నాగేశ్వరరావు, బాలసరస్వతి, జిక్కి, లీల, సుశీల, స్వర్ణలత
డైరక్షన్ : జి.ఆర్.రావు






**సాహిత్యాన్ని ప్రజలకు చేరువ చేయడంలో యువ భారతి కృషి విస్మరించరానిది. 38వ వార్షికోత్సవాల సందర్భంగా డిసెంబరు 2002లో 'హాస్యలహరి' ఉపన్యాస కార్యక్రమాలు ఏర్పాటు చేసి 9 మంది హాస్య రచయితల గురించి మాట్లాడించారు. వాటిని పుస్తక రూపంలో వెలువరించారు. వాటిలో చిలకమర్తి వారి రచనల గురించి శ్రీ డా॥ముక్తేవి భారతి ప్రసంగవ్యాసంలో కొంతభాగం:**

హాస్యవాఙ్మయ నిర్మాతగా చిలకమర్తికి గొప్పస్థానం కల్పించిన నవల 'గణపతి'. ఇది సాంఘిక నవలగానేకాక హాస్య నవలగా ప్రసిద్ధిచెందింది. ఒకనాటి తెలుగుదేశ సాంఘిక స్థితిగతులకి దర్పణమిది. విద్యావిహీనుడై, బంధుజనాదరణలేని నిర్భాగ్యుడై, ఆనాటి దురాచారాలైన మేజువాణీ లాటి వానిపై మోజు వదులుకోలేని యువకుడుగా గణపతి పాత్రను సృష్టించారు చిలకమర్తి. గణపతిలోని లోపాలను సమర్థించేందుకు తల్లిపడే పాట్లు, శవవాహకుల స్వార్థపరత్వాన్ని, నిరక్షరాస్యులైనా ఉపాధ్యాయ పదవికి సిద్ధమయ్యే పంతుళ్ళను, కడుపుబ్బ నవ్వించే సన్నివేశాలతో 'గణపతి' నవలను పాఠకులకు అందించారు చిలకమర్తి.



గణపతి సిద్ధాంతం ప్రకారం పంతులు పాఠాలు చెప్పక్కర్లేదు. భయం చెప్పాలి. "చదువు చెప్పట కష్టమనుకున్నావా ఏమిటి, దాశరథీ అని రెండు కూనిరాగాలు తీసి చెప్పగానే సరా ఏమిటి. భయం చెప్పాలి, అదీ ప్రజ్ఞ, అదీ సొగసు. పంతులుగారిని చూడగానే గజగజ వణికి మూర్ఛపోవాలి పిల్లవాడు. వాడే పంతులు" అంటాడు గణపతి. గణపతి నవలలో చిలకమర్తివారు "శ్రీరఘురామ, చారుతులసీదళధామ-"అనే దాశరథి శతకపద్యానికి గణపతి చెప్పిన ప్రతి పదార్థతాత్పర్యాలు సాహిత్యంలో ఒక హాస్య ఉదాహరణగా మిగిలింది. 'ఒకనాడు శ్రీరాములవారు పైత్యము వల్ల చారు కాపించుకున్నారు. ఆ దేశంలో కరివేపాకు లేనందున తులసిదళాలే అందులో వేసి రంగరించారు. ఆ చారు తాగబట్టే శ్రీరాములవారికి కఫముపోయింది.' అని నోటికి వచ్చినట్టు చెప్పాడు ఉపాధ్యాయ గణపతి.

పిల్లవాడు ఆలస్యంగా బడికి వస్తే ఆలస్యంగా వచ్చావా అని బాదుతాడు. ముందువస్తే, ఇంట్లో పనీపాటా లేదా అని బాదుతాడు. పాఠం గబగబా అప్పగిస్తే 'వెనకనించి నిన్నెవరు తరుముతున్నారు' అని బాదుతాడు. మెల్లగా అప్పగిస్తే, అన్నం తినలేదా. లంఘనాలున్నావా అని బాదుతాడు. పాఠం గట్టిగా అప్పగిస్తే, నాకేమన్నా చెముడా, దెయ్యపు గొంతుతో అలా అరుస్తావు అని బాదుతాడు. బెత్తము దాస్తే పిల్లవాడు చెడిపోతాడని రోజూ నాలుగైదు బెత్తాలు పిల్లల వీపుమీద విరగకొడతాడు గణపతి.

చిలకమర్తి వారి నవల గణపతిలో ప్రతివాక్యంలోనూ హాస్యమే. ఆ నవల చదివి కడుపుబ్బ నవ్వి, నవ్వి, నలుగురితో ఆ హాస్యం పంచుకోకపోతే తోచదు. అయినా ఇది హాస్యనవల కాదు, అధిక్షేపాత్మక నవలే అని మనసు చెప్తుంది. చివరకి-నవ్వులేకుండా గణపతి నవల చదవలేరెవరూ.

చిలకమర్తి పురాణ పద్ధతిని కూడా పేరడీ ద్వారా హాస్యం సృష్టిస్తూ రచించారు. విష్ణుమూర్తి పాము మీద పడుకోవటానికి కారణము, నూలు బట్టలు కట్టుకోక, పట్టుబట్ట కట్టుటకు కారణము, శివుడు దిగంబరుడగుటకు కారణము చెప్పమని ఋషులు సూతుని కోరారు. వీటన్నిటికీ సమాధానము చాకలివారి బాధలు పడలేకనేనని సూతుని సమాధానం. 'దుప్పట్లు మాసిపోతాయి. వాటిని చాకలికి వేయాలి. చాకలి సమయానికి తేడు. తెచ్చినా చిరిగిపోయి వుంటాయి. అందువల్ల విష్ణువు పాము మీద పడుకున్నాడు. శివుడి విషయానికి వస్తే ఆయన ధనం లేనివాడు. చాకలితో బట్టలుతికించుకోవటానికి డబ్బెక్కడనుండి వస్తుంది. కనక దిగంబరుడై యుండి, ఎవరైనా పెద్దలు వచ్చినపుడు సభ్యతకోసం పులితోలు చుట్టుకుంటాడు అంటాడు సూతుడు. ఈ పేరడీ కేవలం హాస్యాత్మకంగా చెప్పినా సంప్రదాయపద్ధతిలో రాయటం చిలకమర్తివారి ప్రత్యేకత.

చిలకమర్తివారు దివాలాదేవి వ్రతము అనేదొకటి రచించారు. కలిపురుషునికి, కక్కుర్తి అనే మహాదేవికి జన్మించిన మూడవ కూతురు దివాలాదేవి.

ఈ వ్రతం చేసేవాడు కష్టపడరాదు. నౌకరీ చేయరాదు. ఎక్కువ వడ్డీకి అప్పులు తేవాలి. నమ్మకం కుదిరేవరకు వడ్డీయిచ్చి, తరువాత ఎగ్గొట్టాలి. భూములు ఇండ్లుకొని భార్యాబిడ్డల పేర రాయించాలి. వ్యాపారం క్షీణిస్తున్నకొద్దీ డబ్బూ దర్పం ఎక్కువగా వుండాలి. సిగ్గు, బిడియం ముందుగానే విడిచేయాలి. దొంగేడ్పులు ఏడ్వాలి.

అప్పులవాళ్ళు ఇంటి మీదకొస్తే కోర్టుకెళ్ళి ఇన్సాల్వెన్సీ పిటీషన్ దాఖలు చేయాలి. ఇలా హాస్యంతోనే చిలకమర్తి వ్రతకథలను అధిక్షేపించారు హాస్యాన్ని ఆయుధంగా వాడుకోవటం తెలిసిన రచయిత చిలకమర్తి.

# సముద్రాల జూనియర్



## అనబడే రామానుజాచార్య

**ఏప్రిల్ 15 జూనియర్ సముద్రాల జయంతి సందర్భంగా...**

కొంతమంది చిత్ర నిర్మాతలు సముద్రాల జూనియర్ పాటలు రాసినా, మాటలు రాసినా చోటు కలిసొస్తుందని కాబోలు, సముద్రాల(జూ) అని బ్రాకెట్లో వేసేవారు. ఆయనకి మండేది. "వేస్తే జూనియర్ అని వెయ్యండి గాని, జూ అని మాత్రం వెయ్యకండి. చదివిన వాళ్లు నేను జూలో వుంటాననో, అక్కణ్ణుంచి వచ్చాననో అనుకుంటారు" అని గట్టిగా చెప్పేవారు. కొంతమంది మెల్లిగా వినేవాళ్లు అలాగే అన్నా, అలాగే వేసేవారు. "చెప్తే వినరు బ్రదర్! (వాహిని వారిలాగా, యన్.టి.ఆర్.లాగా ఈయనకీ బ్రదర్ అలవాటుండేది) ఈసారి ఎవరైనా వేస్తే వీళ్ళని అక్కడికి పంపించేయాలి" అనేవారు. "అసలెందుకీ బాధ? రామానుజాచార్య అని వెయ్యమనరాదా?" అని అడిగితే అది పెద్ద పేరయిపోతుందని అదో బాధ! ఎందుకో మొదట్నుంచి జూనియర్ అని అలవాటయిపోయింది. మా నాన్నగారి పేరు 'సముద్రాల' అనే వేసేవారు. మేమిద్దరం వున్నపుడు నాకు 'జూ' అనీ, ఆయనకి 'సీ' అనీ వేస్తారు. 'సముద్రాల అన్నా 'సీ' అన్నా ఒకటేనయ్యా బాబూ' అని చమత్కరించాను. ఎన్ని చమత్కారాలు చేసినా కారాలు నూరినా వాళ్ళు వేసే విధానంలోనే వేస్తారు. అది వాళ్ల ప్రాథమిక హక్కు." సిగరెట్టు దమ్ము గాఠిగా లాగుతూ అన్నారు సముద్రాల జూ - సారీ సారీ జూనియర్ సముద్రాల.

ఆయనకి సిగరెట్టు అలవాటు బాగా ఉండేది. "సత్యనారాయణ వ్రత మహత్మ్యం" సినిమాకి ఆయనే రచయిత. ఆ సినిమా స్క్రిప్టుకు చాలా నియమ నిష్ఠలతో కూచుని రాశారు. ఎప్పుడు పడితే అప్పుడు రాయకుండా, సూర్యోదయంతోనే స్నానం చేసి, దైవప్రార్థన చేసుకుని, శుచిగా పట్టుపంచె కట్టుకుని - స్క్రిప్టు రాశారు. అయితే, చేతిలో సిగరెట్టు! "ఈ నిష్ఠేమిటి, ఈ కాష్ఠమేమిటి?" అని అడిగితే "అది కూడా మడి కట్టుకుంది బ్రదర్. ఓ చేతిలో శంఖం, ఇంకో చేతిలో చక్రం లేకపోతే విష్ణుమూర్తి కాలాన్ని నడపలేడు. అలాగే మనకీ ఓ చేతిలో కలం, ఓ చేతిలో సిగరెట్టు లేకపోతే కథ నడపలేను" - అదీ జవాబు.

తండ్రి గారి రక్తంలో వున్న సాహితీ కణాలు - ఆయనలోనూ ప్రవహించడం చేత క్షుణ్ణంగా కవిత్వం చదివారు. అభ్యసించారు. ఛందస్సు, వ్యాకరణం తెలుసుకుని పద్యాలు రాశారు. పాటలు కూడా రాసి తండ్రి గారికీ, తక్కిన వారికీ చూపించి మెప్పు పొందారు. సైన్సు గ్రాడ్యుయేటు. సినిమా ఇంటరెస్టు. అంచేత ఏదో ఒకటి చేద్దామని శబ్ద గ్రహణ శాఖలో చేరి, పనిచేశారు రామానుజం. వినోదాలో తండ్రి భాగస్వామి గనక, తన కొడుకు కూడా తనలాగే మంచి రచయిత కావాలన్న అభిలాష వుంది గనక, పెద్ద సముద్రాల గారు - వినోదా వారి "శాంతి" సినిమాలో చిన్న సముద్రాల చేత పాటలు రాయించారు. అప్పుడే ఆయన్ని 'జూనియర్ సముద్రాల' అన్నారు. అది అలా కంటిన్యూ అయింది. 'బ్రతుకుతెరువు' సినిమాలో "అందమె ఆనందం - ఆనందమె జీవిత మకరందం' పాట జూనియర్‌కి పేరు తెచ్చిన మొదటి పాట. ఆయనకి ఇంకా ఆశ వుండేది. సినిమా డైరెక్టరు కావాలని. అంచేత శబ్ద గ్రహణం వదిలేసి మెగాఫోన్ గ్రహణం (వీల్డింగ్ ది మెగాఫోన్ అంటే డైరక్షన్ అని ఒక అర్థం వుండేది) లో చేరారు. అదీ ఎక్కడ? ఎన్.టి. రామారావుగారి ఎన్.ఎ.టి.లో. రామారావు "తోడుదొంగలు" సినిమాకి మాటలు రాయించారు జూనియర్ చేత. అది, రచయితగా ఆయన మొదటి చిత్రం. ఆ సినిమా నుంచి ఆ సంస్థలో కొంత కాలం సముద్రాల రామానుజాచార్య దర్శకత్వ శాఖలో సహాయకుడిగా కూడా పని నేర్చుకున్నారు. బయటి సినిమాల్లో పాటలు రాసే వత్తిడి, స్క్రిప్టులతో, దర్శకత్వం మాట వదిలేసి, మాటలు రాయడం మీదనే శ్రద్ధ చూపించారు.

ఘంటసాలా, ఆయనా మంచిమిత్రులు. "ఒరే ఒరే" అనుకునేవారు. 'పెళ్ళిసందడి'కి (రిపబ్లిక్ ప్రొడక్షన్స్) జూనియర్ పాట రాయడానికి కూచున్నారు ఒకనాడు.

పాట చూసి, "నీ పాట ట్యూన్‌కి రావడం లేదురా!" అన్నారు ఘంటసాల. "నా పాటకి ట్యూన్ ఇవ్వడం నీ చేతనవునా?" అని ఇద్దరూ సరసాలాడుకుంటూ వుంటే ఎంతో ముచ్చటనిపించింది. పాట తాళానికి రావడం లేదని, ఘంటసాల అంటే, "ఎందుకు రాదూ?" అని, తొడమీద చేత్తో దబదబా కొట్టి, "ఈ తాళానికి ట్యూన్ చెయ్యి" అన్నారు సముద్రాల.

పండితుడే అయినా, మాట్లాడేప్పుడు భాషలో యాస దొర్లేది - 'ఆడు' 'ఎల్లేడు' ఇలా. "ఏమిటండీ మీ భాష?" అని అడిగితే "సావాస దోషం. చిన్నప్పుడు తిరిగిన స్నేహితులంతా అలా మాట్లాడితే ఆ భాష అలవాటయింది. రాసినప్పుడు బాగానే రాస్తాను కదా!"

"ఆహా!"

'నర్తనశాల' సినిమాలో కీచకుడికి 'స్వగతం' వుంది. అది రంగారావు గారు గనక ప్రత్యేకంగా వుండాలని రాయమన్నారు - రచయిత రాఘవాచార్యులగార్ని. ఆయన అప్పుడు అస్వస్థతలో వుండడంతో రామానుజాచార్యను రాయమన్నారు. పది పేజీల్లో - పదిహేను నిమిషాల్లో రాసిచ్చారు జూనియర్. దాన్ని కొంత ఎడిట్ చేసి, దర్శకుడు యథాతథంగా వాడుకున్నారు. "సంధాన సమయమైంది - ఇంకనూ సైరంధ్రి రాలేదే" అన్న ఆ స్వగతం జూనియర్ రాసిందే. ఆ విషయం తెలుసుకున్న కీచక పాత్రధారి - "ఓహ్ - జూనియర్ రాశాడా! బాగా రాశాడయ్యా. ఇంకా జూనియర్ ఏమిటి - సీనియర్‌కి సీనియర్‌లా రాశాడు" అని మెచ్చుకున్నారు. ఆ మాట రామానుజాచార్యుల వారితో అంటే, ఆయన రంగారావును మెచ్చుకున్నారు. "రంగారావు నోటివెంట ఎలాంటి భాష పలుకుతుందో అదే రాశానయ్యా - కీచకుడు ఇంకోడు వేస్తున్నాడనుకో - అతడికి తగ్గట్టు రాయాలి. పాత్రకి తగ్గట్టే కాకుండా, పాత్రధారికి తగ్గట్టు కూడా సినిమా రచయిత రాయగలగాలి; రాయాలి!" - అదీ సముద్రాల ముద్ర గల రామానుజం గారి తీరు. అన్ని రకాల పాటలూ రాసిన జూనియర్‌కి తెచ్చిన మంచిపేరు!

**-రావికొండలరావు**



# జూనియర్ సముద్రాల సినీ గీతాలు

**చిత్రం: కులదైవం**
**సంగీతం: మాస్టర్ వేణు　　పాడినది: ఘంటసాల**

పయనించే ఓ చిలుకా ఎగిరిపో
పాడైపోయెను గూడూ ॥పయనించే॥
పుల్లా పుడకా ముక్కున కరచీ- గూడును కట్టితి వోయీ
వానకు తడిసిన నీ బిగిరెక్కలు - ఎండకు ఆరిన వోయీ
ఫలించలేదని చేసిన కష్టము... - మదిలో వేదన వలదోయీ
రాదోయీ సిరి నీ వెనువెంటా - త్యాగమె నీ చేదోడు ॥పయ॥
పయనించే ఓ చిలుకా ఎగిరిపో - పాడైపోయెను గూడు
మరవాలీ నీ కులుకుల నడలే - మదిలో నయగారాలే
తీరని వేదన తీయని ముసుగే - శిరమున సింగారాలే
ఓర్వలేని ఈ జగతికి నీపై - లేవే కనికారాలే
కరగీ కరగీ కన్నీరై - కడతేరుటే నీ తల వ్రాతే ॥పయ॥
గోడుమని విలపించారే - నీ గుణము తెలిసినవారూ
ఏరులయే కన్నీరులతో - మనసారా, దీవించేరే
ఎన్నడో తిరిగి ఇటు నీ రాకా - ఎవడే తెలిసినవాడూ ॥పయ॥

**చిత్రం: శభాష్ రాముడు**
**సంగీతం: ఘంటసాల　　పాడినది: రావుబాల సరస్వతి**

ధరణికి గిరి భారమా
గిరికి తరువు భారమా
తరువుకు కాయ భారమా
కనిపెంచే తల్లికి పిల్ల భారమా ॥ధరణి॥
మును నే నోచిన నా నోము పండగా
నా ఒడిలో వెలిగే నా చిన్నీ నాయనా
పూయని తీవెననీ అపవాదూ రానీక
తల్లివనే దీవెనతో తనియించినావయా ॥తరువుకు॥ ॥ధరణి॥
ఆపద వేళలా అమ్మ మనసు చెదురునా
పాపల రోదనకే ఆ తల్లీ విసుగునా
పిల్లల కనగానే తీరేనా స్త్రీ విధీ
ప్రియముగా పాపలను పెంచనిదొక తల్లియా॥తరువుకు॥ ధరణి॥

**చిత్రం: శాంతి నివాసం**
**సంగీతం: ఘంటసాల　　పాడినది: పి.లీల**

సాకీ: తుషార శీతల సరోవరాన - ఆనంత నీరవ నిశీథిలోన
ఈ కలువ నిరీక్షణా - నీ కొరకే రాజా వెన్నెలరాజా!
కలనైనా నీ వలపే - కలవరమందైనా నీ తలపే
కలువ మిటారపు కమ్మని కలలు - కళలూ కాంతులు నీ కొరకేలే
చెలి ఆరాధన సాధన నీవే - జిలిబిలిరాజా జాలి తలచరా ॥కలనైనా॥
కనుల మనోరథ మాధురి దాచే- కానుక చేసే వేళకు కాచే
వాడే రేకుల వీడని మమతల - వేడుచు నీకై వేచి నిలచెరా
॥కలనైనా॥

**చిత్రం: జయసింహ**
**సంగీతం: టి.వి. రాజు　　పాడినది:ఘంటసాల**

జయ జయ శ్రీరామా రఘువరా
శుభకర శ్రీరామా! ॥జయ॥
త్రిభువన జన నయనాభిరామా (2) ॥జయ॥
తారకనామా...
తారకనామా... దశరథరామా ॥తారక॥
దనుజవిరామా పట్టాభిరామా (2) ॥జయ॥
రామా రఘుకుల జలనిధిసోమా (2)
భూమిసుతా కామా ॥రామా॥
కామిత దాయక కరుణాధామా (2)
కోమలనీల సరోజ శ్యామా(2) ॥జయ జయ॥

**చిత్రం: పెళ్లిసందడి (1959)　　సంగీతం: ఘంటసాల**
**పాడినది: ఘంటసాల, రావుబాలసరస్వతి**

చూపుల తీపితో కొసరుచున్ దరిజేరి మనోజ్ఞ గీతికా
లాలన సేయు కూర్మి జవరాలొకవైపు, మరొక వైపునన్
ఈ పసి కమ్మ తెమ్మరలు ఈ పూవు దోటల శోభలున్నచో
రేపటి ఆశ నిన్న వెత లేటికి నేటి సుఖాలతేలుమా
అ: రావే ప్రేమలతా నీవే నా కవితా
కిన్నెర మీటుల కిలకిలవే పలు వన్నెల మెరపుల మిలమిలవే
ఆ: ఓహో కవిరాజా నేడే నెలరాజా
ఎందులకోయీ పరవశము నీ కెందులకో ఈ కలవరము
అ: పూవులలో నును తీవెలలో ఏ తావున నీవే వనరాణి॥పూవు॥
ఆ: అందవతి కనుపించినచో కవులందరి చందమిదేలే॥రావే॥
అ: వరువులిడే సెలయేరువలె
నిను చేరగ కోరును నామనసు ॥పరువు॥
ఆ: ఊహలతో ఉలికించకుమా
నవమోహన ఈ చెలి మదినే ॥రావే॥
ఆ: ముచ్చటగా మనముండినచో
మన మచ్చికకు జగమేమనునో
అ: లోకముతో మనకేమిపని
మనసేకమయి మనముంటే ॥రావే॥

**చిత్రం: బొబ్బిలి యుద్ధం**
**సంగీతం: ఎస్. రాజేశ్వరరావు　　పాడినది: పి. భానుమతి**

శ్రీకర కరుణాలవాల వేణుగోపాల
సిరులు యశము శోభిల దీవించు మమ్ములా ॥శ్రీకర॥
కాకతీయ వైభవం హంపీ వేంగీ ప్రాభవం
కన్నతండ్రి కలలునిండి కలకాలం వర్థిల్లగా ॥శ్రీకర॥
పెరిగే మా బాబు వీరుడై ధరణీ సుఖాల ఏలగా
తెలుగు కీర్తి తేజరిల్లి దిశలా విరాజిల్లగా ॥శ్రీకర॥



బొమ్మల కథ
కథ, బొమ్మలు: Ramakrishna
కోటీశ్వరుడు కోడల్రావ్‌కి ఒక్కగా నొక్క కూతురు - పేరు శశిరేఖ! ముద్దుగొలిపే బొమ్మ! బొమ్మ అంటే (చిత్రలేఖనం) వల్లమాలిన అభిమానం!
ఆర్టిస్ట్ అభిమన్యు అంటే అంతకన్నా! అది కాస్తా మూడు మురిపాలు ఆరు అనురాగాలు ఐంది మూడు ముళ్ళదాకా వచ్చింది. ఆ మాటే సిగ్గుతో చెప్పింది.
శటప్! ఈ కోడల్రావ్ పీకల్లో ప్రాణం ఉండగా అల్లా జరగదు! అతని అంతస్తేమిటి?! మన అంతస్తేమిటి?!
ఏ తండ్రిని చూసినా ఇదే డైలాగు! ఛీ!
అతని ఆర్ట్ స్టూడియో ఆరో అంతస్తులో ఉంది. అసలైన ప్రేమకి అవేవీ అడ్డురావు, డాడ్! నీకు అంతస్తు ముఖ్యమా కన్నకూతురు సుఖం ముఖ్యమా, ఆలోచించండి!
కోడల్రావ్ గారు ముందో చెయ్యి, వెనకో చెయ్యి పెట్టి వేళ్ళు తెగ నలుపుతూ తీవ్రంగా ఆలోచించడం మొదలెట్టారు!
ఆ చేతుల్లు నలిపి నలిపి ముందూ వెనకా మట్టి గుట్టల్లు పెట్టేసింది. ఇప్పటికైనా తేల్చి చెప్పు డాడీ!
యస్ మై చైల్డ్, ఐ ఏగ్రీ! కాని ఒక్క షరతు!
అతను నాకు అల్లుడవటానికి తగినవాడో కాదో టెస్ట్ చేసి ఓకే చేస్తాను, సరేనా!
ఓ యస్, డాడీ! రేపే తీసుకొస్తాను!


ఏం బేబీ! ఆయనెటూ కథానాయకుడని తెలుసూనే ఉంది! మరి ఎవరీ తోక?
నా పేరదే సార్! తోట కమలాకరం! అందరూ ముద్దుగా "తోక" అంటారు! అభికి మిత్రుడిని!
వెల్ మిస్టర్ అభిమన్యూ! మా మ్మాయి స్వయంవరంలో చిన్న ఇంటర్వ్యూ! ఓకే?!
చెన్నైలోని ఓ డాక్టర్‌గారికి కోల్‌కతాలోని ఇంజనీరు బ్రదరవుతారు. కాని ఆ ఇంజనీర్‌కి చెన్నైలో డాక్టరైన బ్రదర్ ఎవరూ లేరు. ఎలా?
చెన్నైలోని డాక్టర్ స్త్రీ! కనుక ఆవిడ కోల్‌కతా ఇంజనీర్‌కి సిస్టర్ అవుతుంది కాని బ్రదర్ కాదు గదా!
గుడ్! మరో ప్రశ్న! ముగ్గురు తండ్రులు - ఒక్కొక్కరికీ ఇద్దరు కొడుకులు, అంతా హోటల్‌కి కెళ్ళారు! అక్కడ ఖాళీగా వున్న ఏడు కుర్చీలు వాళ్ళకి సరిపోయాయి. ఎలా?
3×2=6+3=9?
అందులో ఒకాయన తాతయ్య - ఆయనకి ఇద్దరు కొడుకులు! వాళ్ళిద్దరికీ నలుగురు కొడుకులు, మొత్తం ఏడుగురు! సరిపోయాయి కదా!
1+2+4=7!
వెరీ గుడ్! రేపుదయం నేనూ, బేబీ మీ ఇంటికొస్తాం! ఆస్తి ఎంతున్నా ఆరగించేది అన్నం మెతుకులే అంటారు! కాని...
...నాకు మేలిమి బంగారం తినాలనుంది! రేపు మీ ఇంట్లో పెట్టించు - ఓకే?!


మర్నాడు అభిమన్యు వాళ్ళింట్లో:
మరి కొంచెం వడ్డించుకోండి, సార్! మేలిమి బంగారం కావాలన్నారు కదాని 24 క్యారట్లుతో కూర చేయించాను!
భేష్! ఏమో అనుకున్నాగాని మీ వాడు ఘటికుడే!
చూడబ్బాయ్! నువ్వు మామ్మాయికే కాదు, నాకూ నచ్చావ్! ఇక అసలు విషయం!
ఏదేళ్ళక్రితం మా నాన్నగారు పోయాక నాకు సంక్రమించిన ఆస్తితో పాటు బ్యాంక్ లాకర్లో ఈ బొమ్మల కౌగితం దొరికింది. దీన్లో ఏదో రహస్యముందని...
... నా అనుమానం. ఎందరికో చూపించాను, ఏమీ లాభంలేకపోయింది. దీన్ని నువ్వు సాధించగలవనే నమ్మకం నాకు కలిగింది!
అందుకే ఇదేదో కనుక్కొని అమ్మాయితో పాటు సగం ఆస్తినికూడ గెల్చుకో! విష్యూ ఆల్ ది బెస్ట్!
ఇక రంగంలో దిగి, ఆ బొమ్మల కౌగితం నిశితంగా పరిశీలించసాగారు ముగ్గురూ!
తల్లో! ఇది చూస్తుంటే మీ తాతగారు ఏదో రహస్యాన్ని ఎవరికీ చెప్పలేని పరిస్థితుల్లో ఇలా చేశారనిపిస్తోంది!
ఏమో అభీ! ఈ పోర్ట్స్ కార్డేమిటి? ఈ బిల్డింగేమిటి? బ్లౌస్, పొలిటీషియన్, కి, ... అబ్బబ్బ!!

(మిగతా వచ్చే సంచికలో...)

